


# సదాచారము.

సాంధ్రతాత్పర్యము.



గ్రంథసంపాదకుఁడు.

క. మార్కండేయశర్మ.



FIRST EDITION, 2000.

GUNTUR

Printed at the Radha Press,

1913

# చిదానందాశ్రమగ్రంథమాల.

సస్వరాంధ్రప్రయోగములతో దళసరికాగితములందు ముద్రించిన గ్రంథములు.

| | రు. అ. |
|---|---|
| తైత్తిరీయస్మార్త బ్రాహ్మణ నిత్యకర్మాష్టకము, దీనియందు మహాసౌరమంత్ర పాఠము మున్నగునవి క్రొత్తగా చేర్పబడినవి. సస్వరాంధ్ర ప్రయోగము. రెండవకూర్పు | 1 - 4 |
| డిటో. డిటో. కిత్తాకా బైండు. | 1 - 8 |
| ఆబ్దికమంత్రము. తీర్థశ్రాద్ధములు సస్వరాంధ్రప్రయోగము | 1 - 4 |
| సంధ్యావందనము. డిటో. | 0 - 3 |
| మంత్రపుష్పత్రయము-సంస్కృతాంధ్రవ్యాఖ్యానయుతము | 0 - 3 |

ఇవిమున్నగు అనేక గ్రంథములు గలవు.

వలయువారు.

## మానేజరు స్వధర్మప్రకాశిని

గుంటూరు అని వ్రాసేది.

"స్వధర్మే నిధనం శ్రేయః"



# సదాచారము

సాంధ్ర తాత్పర్యము.



కనుపర్తి మార్కండేయ శర్మ చేత
శ్రుతిస్మృతిన్యాయవేదాదిగ్రంథ సహాయమువలన
సంగ్రహింపఁబడినది.

గుంటూరులో ఫస్టుగ్రేడు ప్లీడరుగారగు
యమ్. శ్రీనివాసరావు గారిచేత

రాధా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడి ప్రచురింపఁబడినది.
గుంటూరు.
1913

వెల. రు. 2-0-0  వెల. రు. 2-

శ్రీ చిదానంద సరస్వతీశ్శరణమ్.

సదాచారగ్రంథ

# విషయసూచిక.

శ్రీచిదానన్దసరస్వతీ శ్శరణం భవతు

''స్వధర్మే నిధనం శ్రేయః

# ఉపోద్ఘాతము.

శ్లో. ఆచారా ల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః ।
ఆచారా ద్ధన మక్షయ్య మాచారో హంత్యలక్షణమ్ ॥
మనుస్మృతి.

లోకమునందు జన్మించిన మనుజులందఱు శక్తికొలఁదియో అంతకధికంబుగనో సుఖప్రాప్తికై ప్రయత్నించుట స్వభావముగ నున్నది. అట్టిసుఖము దేనిని యాచరించుటవలనఁగలుగునో ఆవిషయమును పరిశీలించుట మనకు అత్యావశ్యకము. సుఖము ఇహలోకసుఖము, పరలోకసుఖము అనిద్వివిధము. ఈ రెండును నామమునకు మాత్రము భిన్నభిన్నములుగ గనంబడినను నిజమునకు ఒక్కటియే ఇహలోక సుఖపరిజ్ఞానమాయు ర్వేదమునుండియు, పరలోక సుఖపరిజ్ఞానము ధర్మశాస్త్రములనుండియు మనము గ్రహింపవలయు

శ్లో. సుఖార్థా స్సర్వభూతానాం మతాస్సర్వాః ప్రవృత్తయః ।
సుఖంచనవినాధర్మం తస్మాద్ధర్మపరోభవ ॥

అనిధర్మ శాస్త్రములందుగలదు. ఆయుర్వేదమునందును ఈ శ్లోకమే ప్రమాణముగ గ్రహింపఁబడియున్నది. ఈధర్మము శ్రుతి స్మృతులందు అధికార తారతమ్యము ననుసరించి వివరింపఁబడియున్నది. నిత్యము, నైమిత్తికము, కామ్యము అని త్రివిధముగ కర్మలు విభజింపఁబడియున్నవి. నైమిత్తిక, కామ్యకర్మల వివరణము ఈ సదాచార గ్రంథముయొక్క రెండవభాగమునందు చేయఁబడును. ప్రకృత మీ గ్రంథమునందు నిత్యకర్మలకు సంబంధించిన విషయములలో కొన్నింటిని తెలుపుచున్నారము శాస్త్రీయములగు నిత్యకర్మల నాచరింపక తక్కిన సత్కార్యము లనేకము లాచరించినను వానికి సద్గతి కలుగదని బోధాయనుఁడు పలుకుచున్నాఁడుః—

శ్లో. యస్య నిత్యాని లుప్తాని తథైవాగంతుకానిచ ।
సుపథస్థోఽపిన స్వర్గం గచ్ఛేత్పతితో హిసః ॥

శ్రుతిస్మృత్యుక్తములగు నిత్యకర్మలను సమగ్రముగ చేయుటకు శక్తిలేనివాడు సదాచారమునైనను అవలంబించవలయునని శాస్త్రములందు గన్పట్టుచున్నది:—

శ్లో. శ్రౌతంకర్తు మశక్తశ్చేత్ స్మార్తం కర్మ సమాచరేత్
తత్రాప్యశక్తః కరణే సదాచారం లభేద్బుధః ॥

తా. శ్రుతియందు ప్రతిపాదింపఁబడిన కర్మల నాచరించుటకు శక్తిలేనివాఁడు స్మార్తకర్మల నాచరింపవలయును. వానిని కూడ చేయఁజాలనివాఁడు సదాచారము నవలంబించవలయును.

ఈ సదాచారమునకు మూలము ధర్మము. ధర్మమనఁగా శాస్త్రీయవిధులను ఆచరించుటయే. శాస్త్రవిధుల నాచరించువారిప్పుడులోకమునందు చాలతక్కువయని చెప్పుట స్వభావోక్తియగును. అందులకు క్రిందివి ప్రధానకారణములని చెప్పవచ్చును:—

౧. శాస్త్రవిధుల నెఱుంగకపోవుట.

౨. శాస్త్రవిధులందు అశ్రద్ధ

౩. విధర్మీయులను వేషభాషాదులందు అనుకరించుట

౪. స్వేచ్ఛాచారమునందు అతిశయప్రీతి

౫. మనుష్యస్వాభావికమగు ఆలస్యము.

మన సమాజమునందు పైనఁజెప్పిన ౫ దోషములు చాలకాలమునుండి పాదుకొనియున్నవి.

1. శాస్త్రవిధుల నెఱుంగక పోవుట.

బ్రాహ్మణపండిత సముదాయము కాలవశముచేత జీవికకువలయు ధనాదికములేక అన్న మెట్లులభించునా? యను చింతతో కుందుచున్నారు. అందువలన బ్రాహ్మణుఁడు ఫలమున భిలషింపకయే వేదమును సాంగముగ పఠింపవలయునను విధివాక్యము నాదరించుటలేదు. ఒకవేళ పఠించిన వారుకొందఱున్నను జీవికకుగానుపరుల చిత్తమనుసరించవలసిన వారగుటచే వారు శ్రోతల యాచరణమునందు దోషములున్ననువానిని తెలుపక ఉదాసీనభావము నవలంబించు

చున్నారు. ౧. తాముచదువుట, ౨. ఇతరులకు బోధించుట, ౩. తాముచేయుట, ౪. ఇతరులచే జేయించుట. ఈ నాలుగు కృత్యములు గల బ్రాహ్మణోత్తములు పలుచబడుటచేత జనసామాన్యమునందు శాస్త్రవిధులు వ్యాపింపకయున్నయవి.

2. శాస్త్రవిధులందు అశ్రద్ధ.

వసిష్ఠకాశ్యపాదులగు మంత్రద్రష్టలకు జన్మభూమియగు నీభరతఖండమునందు ఋషిపుంగవుల వంశమునందు జన్మించిన మనము మనబాలురను జీవికాలోపము చేత స్వమతాచారాదికమునకు విహితమగు వేదవిద్యను ఆవంతయినను బోధింపక వేదాధ్యయనార్థము విధింపఁబడిన ఉపనయన సంస్కారమును మాత్రము నొనర్చి అందులకుఁ బంపక సత్కర్మాచరణ సత్సంతానార్థమయి పరిగ్రహించు సతీమణిని క్షుధాతురులై పరుల పంచలకు పంపించు మనసువిధంబుగ ఆబాల్యమునుండి స్వమత విద్యయన నేమియో ఎఱుంగక మతాచారములందు విధర్మీయు లొనర్చిన తిరస్కారాభిప్రాయములు చక్కఁగ పట్టుబడియున్న వారిచేతులందు బాలుర నప్పగించుచున్నారము. ఇఁక నచ్చట ప్రత్యక్షముగనో భంగ్యంతరముగనో దేశీయశాస్త్రవిధులందు శ్రద్ధఁబోగొట్టునట్టి బోధయే జరుగుటకూడ కలదన్న తప్పేమి? దీనివలన కలిగిన ఫలితమేమన? విద్యాభ్యాససమయమాదిగ శాస్త్రవిధులందు అవిశ్వాసము తిరస్కారము మనబాలురకు జనించుటయే.

3. విధర్మీయుల వేషభాషాదుల ననుకరించుట.

ఆయా దేశముల ననుసరించి వేషభాషలుమున్నగునవి స్థిరీకృతములయి యున్నయవి. ఆయామతములకుఁగూడ కొన్ని నియమములు, చిహ్నములు గలవు. ఈబాహ్యచిహ్నముల గాంచియే వీరీమతమునకు సంబంధించినవారు అని ఇతరు లెఱుంగుచున్నారు. ఆయామతాచార వేషములందు ప్రేమకలిగియుండుట సత్పురుషునకుండఁదగు లక్షణములలో నొకటి. మన బాలురు అట్టి సల్లక్షణములనుకూడ అజ్ఞానముచేత వదలుచున్నారు.

శాస్త్రవిధులు దేశమునందును దేశీయులందును చక్కఁగా వ్యాపింపమికిగాను పైనిచెప్పిన మూఁడు కారణములు ఆగంతుకములు ప్రథమమున స్వల్పముగనే యుండెను కాని ప్రస్తుతకాలమునందవి,

అంతట దట్టముగ వ్యాపించియున్నవి. అయినను వీనిని పోగొట్టుట దుస్సాధ్యమని చెప్పవచ్చునుగాని అశక్యము మాత్రముకాదు.

1. శాస్త్రవిధుల నెఱుంగకపోవుటకు ప్రతిక్రియ.

ఆగంతుకమగు ఈదోషమును పోగొట్టుకొనుటకు హృదయమునందు సరియగు అభిలాషయున్న చాలును. పలువురు లేక పోయినను ఇప్పటికిని కొందఱయినను శాస్త్రజ్ఞులును సదాచారతత్పరులును అగుసత్పురుషులున్నారు. వారినాశ్రయించిన పైదోషములను చాలవఱకు పోగొట్టుకొనవచ్చును.

2. శాస్త్రవిధులందు అశ్రద్ధకు ప్రతిక్రియ.

ఈసాంక్రామిక (అంటువ్యాధి) వ్యాధి విధర్మీయులపాఠశాలలయందు అట్టి బోధ చేపెద్దలయిన గురువుల బోధవలన జనించి బాలురను యువానులను కబళించివేయుచున్నది. వయోవృద్ధులందును మతాచారవిద్యల నింతో అంతో చదువుకొని విచారణాశీలురగు వారియందును ఈవ్యాధిచేరుటలేదు. కొందఱు హూణవిద్యాభ్యాసము వలననే శాస్త్రములందు నిరాదరణబుద్ధి మనవారికి కలుగుచున్నదని యనుచున్నారు. కానిఆమాట నిర్బాధమయినదికాదు. అచట హూణవిద్యయన ఏ ఏ. బీ సీ. డీ. లోఅభ్యసించి అంతటితో స్వదేశస్వవిద్యలందు నిరాదరణము కలిగి ఉభయభ్రష్టులగు వారి విద్యయని యర్థము చేసికొన్న చేసికొనవచ్చునేమోకాని భాషయందును ప్రకృతిశాస్త్రములందును సంపూర్ణపాండిత్యము గలిగి యుక్తాయుక్తములను సాధ్యమయినంతవఱకు ఓపికగలిగి ప్రవర్తించువారి విద్యకు మాత్రము తగదు.

మనపరిపాలకు లగు ఆంగ్లేయులు భరతవర్షము నకంతయు ప్రధానులయి పరిపాలించుటకు ప్రధానకారణమేమియో యెఱుంగకయున్నారు.

వారట్లుండుటకు ప్రధానకారణము వారిదేశస్థితికి మతాచారము లకు అనుకూలము లగు విధులనువారు పరిపాలించుట గాని మఱొండుగాదు. వారుతమదేశమునకు తమధర్మమునకు అనుకూలములగువానిని పరిపాలించుకొనుట శరీరదార్ఢ్యము, మనోదార్ఢ్యము, పరస్పరసహానుభూతి యనుసుగుణత్రయమును పొందినారు మనశాస్త్రోక్తసదా

ర్రోద్దేశ్యమును గాంచినను శరీరస్వాస్థ్యము, తేజము మున్నగుసుగుణములు మాత్రమువిడనాడుచు మనదేశమునకును మతాచార విధులకును ప్రతికూలములగు వేషములువేయుచు ఆరోగ్యదమగుప్రాతస్స్నానమునైనను ఆచరింపకయే మనదేశప్రకృతికి అననుకూలములగు పానీయాదులను సేవించుచు అనారోగ్యమునందుట చూడవీరియజ్ఞతనువేవోళ్ళ చాటును. కాని తెలిసియో తెలియకయో ముందుమిగిలినవారు తప్పతక్కినవారిలోపలువురుతమయజ్ఞానమునకుసిగ్గిలుచువానినివిడువజూచుచున్నారు కాని చిరకాలాభ్యాస్తములగుటచేతకాబోలు ఒకేపర్యాయము విడువఁజాలకున్నారు శాస్త్రాచారములు లోపించుటకుగాను సంభవించిన ఈఆగంతుక దోషములపై ప్రతిక్రియలవలన ఉపశమించును.

తక్కిన రెండు దోషములు శాస్త్రాచారాచరణము వలనఉపశమించును గాని ఇతరోపాయముల వలన ఉపశమింపవు.

మనుష్యునియందు పశుధర్మము, జడధర్మము అను రెండుధర్మములుండును.

ఈసమయమునందీ కృత్యము చేయునెడల దీనివలన గలుగుఫలమేమి? నష్టమేమి అనునది విచారింపక తోఁచినపనిని చేయుట పశుధర్మము. ఇట్టి పశుధర్మమును పోఁగొట్టుటకుఁగాను శాస్త్రాచారములుద్దేశింపఁబడినవి. మనుజుఁడు తాను జేయుకార్యము లన్నియు దృఢమును స్థిరమును అగుమనస్సుతో శరీర స్వాస్థ్యము కలిగియే చేయవలయునను తలంపుతో శాస్త్రములుండును. ఆఁకలి యగునప్పుడు భుజించుమనియు, నిద్రవచ్చిన నిద్రించుమనియు, కామేచ్ఛ కలిగినప్పుడు సుఖమనుభవించుమనియు చెప్పువానిని సనాతనశాస్త్రములు నిందించును. ఎటుల భుజించిన శాశ్వతారోగ్యము నిలిచియుండునో, ఎప్పుడుసుఖించిన శాస్త్రీయ సంతానము జనించి ప్రజాతంతువు అవిచ్ఛిన్నముగ నిలుచునో అట్టిదానిని బోధించుటయే శాస్త్రవిధియొక్క ప్రయోజనము.

మనుష్యునియందుండు రెండవదుర్గుణమగు జడధర్మమునకు లక్షణము ఆలస్యము. ఇయ్యది శాస్త్రాచారమువలన తప్పకనశించును. శాస్త్రములయందు సూర్యోదయమునుగడి మఱల సూర్యోద

యమునకు ప్రతిముహూర్తము నందును మనుజుఁడాచరింప వలసిన భిన్న భిన్న విధులు విధింపఁబడియున్నవి. నియమిత కాలమునందు ఆ యావిధుల నాచరించు వానికి జడత్వము సంభవించుటకు అవసరమే లేదు. శాస్త్రములందు విధించిన నియమములను పాటించిచరించు వానికి శారీరకారోగ్యము, తేజస్విత్వము మున్నగునవి తమంతటతామే భృత్యులయి అనుసరించును. ఒక గడియఅయినను జడత్వముగ గూర్చొనియుండుటకు అవకాశముండదు. తగిన సమయములందే ఆహారము, విహారము, నిద్ర, మున్నగునవి చేయుచుండును. ఇట్లు ప్రాతఃకాల స్మరణముచేతను, మధ్యాహ్నానంతరమునందు చేయదగిన పురాణపఠనాదికము చేతను లోభ, మోహాది దుర్గుణములను విడిచి పరోపకారపరత్వము, స్వార్థశూన్యత, మున్నగు సుగుణములను అలవరుచుకొనును. సకలానర్థములకు మూలకారణమగు ఆలస్యమును (అనగాజడత్వము) నశింపఁజేయుటయే శాస్త్రమునకు ముఖ్యప్రయోజనము. మృత్యువనఁగా ఆలస్యముకంటె మఱొండులేదు.

శ్లో॥ అనభ్యాసాచ్చ వేదానా మాచారస్యచ వర్జనాత్।
ఆలస్యా దన్నదోషాచ్చ మృత్యు ర్విప్రా ఞ్జిఘాంసతి॥

—మనుస్మృతి.

తా. వేదములను అభ్యసింపనందు వలనను, ఆచారపరిత్యాగమువలనను, ఆలస్యమువలనను, అన్నదోషము వలనను మృత్యువు విప్రులను చంపుచున్నది. అని మనుస్మృతియందు తెలుపఁబడియున్నది

ఒక దృష్టాంతమును చూడుఁడు:— శాస్త్రాచారములందు శ్రద్ధలేనివారిలో పలువురు శీతకాలమునందు ముసుగుపెట్టుకొని ౮ గంటలవరకు పరుండెదరు, దంతధావనము చేయుటయు భుజించుటయు ఒకేపర్యాయ మాచరించుచు పక్కయందు పరుండియే చుట్టమున్నగు దుర్వస్తువుల నుపయోగించు వారునుగలరు. వీరి శరీరములందు క్రమక్రమముగ అలసత్వమేర్పడి చిట్టచివరకు అందులకు వ్యతిరేకముగనే మాత్రమాచరించినను వారి శరీరప్రకృతికి గిట్టకయుండును. శాస్త్రవిశ్వాసము కలిగి తదను సారమాచరించువారలు శీతకాలమునందును బ్రాహ్మముహూర్తమునందే లేచి ఈశ్వరస్మరణాదిమున్నగునవిచేసి నిర్ణయించు నియమితకాలమునందు స్నానమున్నగువానిని ఆలస్యవిహీనులై

యుందురు. వీరిలో ఎవరియాచరణము శాశ్వత సుఖకారియో యూహింపుడు.

మఱికొందఱు శాస్త్రాచారము ననుసరించి చరించువారు శాంతశమదమాది గుణములుగలిగి బలహీనులయి పోదురుగాని, శౌర్యవంతులును, దేహపుష్టి గలవారును కాజాలరని యనియెదరు. కాని ఇది శాస్త్రముయొక్క లోభముకాదు. ఆచరించువారిలోభమే. ఏలయిన వానప్రస్థులును, గృహస్థులును ఆచరించవలసిన కర్మలయొక్క పరిజ్ఞానము నెఱుంగక యెవారటుల చెడిపోవుచున్నారు. గృహస్థునకు శరీర పీడాకరములగు కర్మలనాచరించుట శాస్త్రములందు నిషేధింపబడియున్నది.

ఉపనిషత్తులందు పలుతావులందు దేవాసురుల యుద్ధమును గూర్చి రూపకాలంకారముగ జెప్పబడియున్నది. అందు శ్రీశంకరభగవత్పాదులవారు ఈక్రింది విధముగ వివరించియున్నారు. శాస్త్రవిధిచేత సంస్కరింపబడిన ఇంద్రియవృత్తులు దేవతలనియు స్వాభావికమయినట్టిగాని లేక తమోగుణ రూపమయి నట్టిగాని ఇంద్రియ ప్రవృత్తులు అసురులనియు, వీరికి శరీరమే యుద్ధభూమియనియు శాస్త్రసంస్కారజన్యమగు జ్ఞానముచేత తమోగుణమును జనియించుటయే దేవతాజయ మనియు తెలిపిరి. ఇదియ శాస్త్రాచారమునకు ఫలము. ఇదియే ధర్మమునకు మూలము.

సదాచారమును చక్కగపరిపాలించు వారికి ఆయురభివృద్ధి సహజముగ గలుగునని వెనుక చెప్పియుంటిమి. అదియొకింతనిచట వివరింతుము. ఆయుష్మంతుడగుటకు ఈక్రింది ౧౦ లక్షణములు అత్యావశ్యకములు:—

౧. వీరి పూర్వపురుషులు దీర్ఘజీవులయియుండుట
౨. అవికలాంగుడై జన్మించుట
3. దుర్ఘటనలు లేక యుండుట
౪. ఆరోగ్యదమగు ఆవాసము గలిగి యుండుట
౫. ఆరోగ్యకరమగు ఆహారము కలిగియుండుట
౬. మితాహారము

౭. మితాహారము
౮. శాస్త్రీయనియమములను పరిపాలించుట
౯. శీతోష్ణాదిద్వంద్వములను సహించుట
౧౦. శాంతమగు మనస్సుకలిగి యుండుట

పైనఁజెప్పిన ౧౦ విషయములలో మొదటి 3 విషయములు మనుష్యుని యధీనములోనివికావు. జన్మించువాఁడు దీర్ఘజీవులగు మాతాపితరులకు జన్మించ వలయుననియు అవికలాంగుఁడనై యుండవలయుననియు, బాల్యావస్థయందు ఆయుర్విఘ్నకారులగు విపత్తులుకలుగకుండనుండవలయుననియుతలంచితదనుసారముపుట్టఁజాలఁడు. కావున ఈ మూఁడువిషయములు దైవాధీనములు. (అనఁగా జీవుఁడు ప్రయత్నించి ఇందులకు ప్రతీకారముఁ చేయుటకు సమర్థుఁడు కాడనుట.) అయినను ఎడ తెగక వచ్చుచున్నట్టి పురుషపరంపరకు మాత్రము అనాధీనముకాదు. శరీర స్వాస్థ్యమునకును సద్గుణాభివృద్ధికిని హేతుభూతమగు సదాచారము నవలంబించు తల్లితండ్రులు గలవంశమునందు జన్మించినవారు సాధారణముగ దీర్ఘాయుష్కులును అవికలాంగులును అయియుందురు. ఇట్టివారియందు అకాలమృత్యువు మున్నగు దుర్ఘటనలు తఱుచుగసంభవింపవు.

ఆయుష్మంతుఁడగుటకు హేతుభూతములగు మొదటి 3 హేతువులు పురుషుని యధీనములోనివి కాకపోయినను పురుషపరంపరయందును పురుషులకూటమియందును ఆయత్తమైయుండును. ఈ రెంటికి సమాజమని నామాంతరము. పై మూఁడుహేతువులు సమాజాధీనములు ౪, ౫. హేతువులు మానవునియొక్క బాల్యకాలములోనివి. బాల్యకాలమునందు జరుగవలసినపనులకు బాలుఁడు అధీనుఁడుకాడు, ఆరోగ్యమునిచ్చు వసతియు, ఆహారములేనియెడల దీర్ఘాయుష్మంతుఁడుకాఁజాలఁడు, ఇవియుసమాజాధీనములే, ఆయుష్మంతుఁడగుటకునిర్ణయించిన ౧౦ నిర్ణయములలో ౫ నిర్ణయములు సమాజాధీనములు. తక్కిన ౫ నిర్ణయములు పురుషకారాధీనములు, ఇందుదైవాయత్తముకూడనున్నను విశేషము పురుషకారము ననుసరించియుండును.

ఈనిర్ణయములన్నియు ప్రాకృతన,సామాజిక పౌరుషము, లని ద్రివిధములయియుండును. ఇవియన్నియు పరస్పరముమిళితములయియుండును. ఒక దానినివిడిచిన మఱొక్కదానికి అవకాశముండదు. శాస్త్రమునందుపదేశింపఁబడిన ఆచారపద్ధతి పైమూఁడింటికి అనుకూలమయియున్నది. ఈవిషయము నెఱుంగక కేవలపురుషకారమును మాత్రము అవలంబించియుండు విధర్మీయుల ప్రవర్తనమును గాంచుచు దేశీయమగు శాస్త్రాచారమును విమర్శింపఁజూచువారిదృష్టికి మనయాచారములు మూఢాచారములు గాఁదోచును. అక్కడతనవారుశాస్త్రాచారవిశ్వాసములేని దోషమునుపొందుటయగాక స్వల్పాయువును కూడపొందెదరు నానాఁటికి దుర్బలులును అల్పాయువులును అగుజనులులోకమునందు పుట్టుచుండుటకు ప్రధానకారణము జనులు శాస్త్రాచారశూన్యులగుటయే. కానిమఱొండుకాదు.

బాల్యమునుండి జనులాచరించవలసిన ఆచారాదివిషయములు తల్లితండ్రులు, సమాజము, విద్యాగురువులు, అవిచ్ఛిన్నముగ ఉపదేశించుచువచ్చినగాని పురుషుఁడువానిని ఆచరించుటకు ప్రయత్నించఁడు. అట్టిశిక్షణము లేకపోవుటయుస్వల్పాయుస్సునకుపరంపరాకారణమయ్యెననియు చెప్పవచ్చును.

శాస్త్రమనఁగా భగవంతునియాజ్ఞ, దానిని తెలిసికొనుటయనఁగా మనము తదనుసారము చరించుటయే. కాని దానివలన మనము పొందునట్టిఫలమేమి? యనివిచారించి ఫలమున్నయెడల దానిని ఆచరించుటకాదు. ఫలమేమి? యని ఇప్పటినవీనవిద్యాధికులు అడిగిగాని ఆచరింపరు. ఫలమునుకోరి ఈశ్వరాజ్ఞను నెరవేర్చుట రజోగుణము. భగవద్గీతలందు "కర్మలనొనర్చుట యందేనీకు అధికారము, ఫలములందు కాదు" అని చెప్పఁబడియున్నది, ఫలాన్వేషణ లేకయొనర్చుటసత్వగుణముయొక్క ధర్మము, ఇట్టిసత్వగుణాధీనమగు అంతఃకరణవృత్తి రజోగుణాధీనవృత్తి (అనఁగా ఫలాభిలాషతో చేయువారు) గలవారి సహవాసముచేతను బోధలచేతను కల్మషమగుచువచ్చెను. అట్టికల్మషమును బోగొట్టుకొనుటకై ప్రయత్నించుటకర్తవ్యము. ఇట్టిసదాచారమును యథారూపముగ ననుకరించుట ప్రకృతమున మనకశక్యమయినను అభ్యాస

ముచేత ఆచరించుటకు సులభమగును, చికిత్సాశాస్త్రముకూడ ఇందులకు చాలవఱకు అనుకూలమే.

సదాచారవృత్తమునకు ధనము శాఖలతో సమానమయినది. ధనార్జనము, ధనసంరక్షణ, ధనసంవర్ధనము, అనిధనమును గూర్చి త్రివిధముగ విచారించవలయును, సదాచారపరిపాలనమువలన శారీరిక, మానసిక స్వాస్థ్యములు కలిగి లోకానురాగము మున్నగునవి కలిగియుండును, ఇట్టివానికి ధనార్జనమంతగా కష్టకరముగాదు; భోగేచ్ఛ, విలాసశీలత్వము, బాహ్యాడంబరసంకోచనము, న్యాయానుసరణముగలవానికి ధనసంరక్షణము స్వాధీనమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు; పై రెండువిషయములుగలవానికి మూఁడవదియగు ధనసంవర్ధనము తనంతటతానే సిద్ధించును.

ధనవంతునకు ధార్మికత్వముండదనుట పలువురు అభిప్రాయపడుదురు, కాని ఆ అభిప్రాయము సార్వత్రికము కాదు, అది రాజస, తామస, ధనములకు సంబంధించినది. సాత్త్వికధనమువలన ధార్మికత్వము తప్పక కలుగును. త్రివిధధనములయొక్క వివరమిక్రింద తెలుపుచున్నారము.

శ్లో॥ అపరాబాధమక్లేశం ప్రయత్నేనార్జితం ధనం।
స్వల్పం వా బహులం వాఽపి దేయమిత్యభిధీయతే॥ ౧
,, కుసీదకృషివాణిజ్యశుల్కగానానువృత్తిభిః।
కృతోపకారాదాప్తంచ రాజసం సముదాహృతమ్॥ ౨
,, పాశ్వికద్యూతచౌర్యార్తిప్రతిరూపకసాహసైః।
వ్యాజేనోపార్జితం వస్తు తత్ కృష్ణం సముదాహృతమ్॥ ౩

తా॥ పరులబాధింపక కష్టమెక్కువచేయక ప్రయత్నించి సంపాదించిన ధనము దేయమనంబడును. ఇదియ సాత్త్వికధనము, వడ్డి, వ్యవసాయము వ్యాపారము, శుల్కము, సంగీతము, సేవ, ఉపకారము మున్నగు వానిచే ఆర్జింపఁబడిన ధనము రాజసము; ఒకరిపక్షమవలంబించియు, జూదము, దొంగతనము, పీడించుట, మారువేషము వేయుట, సాహసము, కపటము, మున్నగువానిచేత సంపాదింపబడిన ధనము తామసము అని తాత్పర్యము.

ఈ త్రివిధభేదములనెఱింగి సాత్వికధనార్జనవృత్తి నవలంబించుట కే జనులు ప్రయత్నించినచో లోకము నందు కృత్రిమత్వము, పరపీడన మును న్నగు దుర్గుణములు మూలముతోడ నశించును, లోకము నంద శాంతియు తొలఁగును. కేవల సాత్వికధనార్జనము చేతఁగూడ ధనము నార్జించుకొనవచ్చునుగాని తామసధనార్జనము చేయఁదగదు.

బ్రాహ్మముహూర్తమునందు లేచుట.

బ్రాహ్మముహూర్తమునందు లేచి నిత్యకృత్యములను నెరవేర్చుకొనవలయునని చెప్పఁబడియున్నది. ఈవిషయ మొక ధర్మశాస్త్రములందేగాదు. వైద్యశాస్త్రమునందును ఇట్లుగలదు.

శ్లో. బ్రాహ్మే ముహూర్త ఉత్తిష్ఠేత్ స్వస్థో రక్షార్థమాయుషః।
శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధిస్తతః॥

అష్టాంగహృదయం. సూ॥ అధ్యా. ౨. ౧.

తా. స్వస్థమగు ప్రకృతిగలవాఁడు ఆయుస్సుయొక్క రక్షార్థమయి బ్రాహ్మముహూర్తమునందు లేచి మలమూత్రోత్సర్జనాది దేహధర్మముల నొనర్చికొని శౌచమును చేసికొనవలయును.

శౌచవిధి.

గ్రామమునకు దూరముగ మూత్రపురీషోత్సర్గ మొనర్చుకొనుట ఏలయనఁగా సమీపముననున్న యెడల ఆదుర్గంధమువలన రోగాదికము వచ్చుననియు; సూర్యాద్యభిముఖముననిషేధించుటవలన పూజ్యుల ఎదుట హేయకృత్యములను చేయగూడదనియు; దున్నినపొలమునందు నిషేధించుటవలన అందుపుట్టిన ధాన్యములను భుజించుటవలన జనులకు రోగములు కలుగుననియు, అమేధ్యస్థానమునందు ఉమియుట నిషేధించుటచే గళరోగములు జనించుననియు, నెఱుంగవలయును, మానవిధానము శ్వాసకోశమునకు క్రిందనుండు అవయవములకు చలనము కలుగుచుండగా ఊర్ధ్వస్థితములగు అవయవములకు ఎక్కువ చలనము కలుగఁజేయుట అనారోగ్యమునకు హేతుభూతమని ఎఱుంగునది.

దంతధావనవిధి.

ధర్మశాస్త్రమునందు విధించిన దంతధావన కాష్ఠములలో అన్నియు వైద్యశాస్త్రమునందును అంగీకరించినవిధము:—

శ్లో. అర్కన్యగ్రోధఖదిరకరంజకకుభాదికం।
ప్రాతర్భుక్త్వాచ మృద్వగ్రంకషాయకటుతిక్తకమ్॥
భక్షయేద్దంతధవనం దంతమాంసాన్యబాధయన్॥
అష్టాంగహృదయం. సూత్ర. అధ్యా. ౨. ౨, ౩.

,, కరంజకరవీరార్కమాలతీకకుభాశనాః।
శస్యన్తేదంతపవనే యేచాప్యేవం విధాద్రుమాః॥
చరకేం. సూత్రస్థానేం ౫ అధ్యాయే

తా. పై శ్లోకములందు చెప్పఁబడిన కాష్ఠములు దంతధావనమునకు ప్రశస్తములు అని అష్టాంగహృదయము; చరకము, మున్నగు వైద్యగ్రంధములందు గలదు.

౨. మధ్యమానామికాంగుష్ఠములు దుర్బలాంగులులు, వీనితో దంతదావనము చేసికొనునెడల బలమైన ఘర్షణము చిగుళ్ళకు తగులకుండునని విధించిరి; అజీర్ణాది రోగగ్రస్తునికి కాష్ఠదంతదావనము నిషేధించుట వమనము మున్నగునవి కలుగుననియు తెలిసికొనవలయును.

సామాన్యవిషయములు.

సదాచారము నాచరించు శిష్టులు ప్రతికర్మయు ఆచరించుటకు పూర్వమందు పాదప్రక్షాళనము, ఆచమనము, ప్రాణాయామము మున్నగునవి చేయుదురు. దివాస్వాపనమును, రాత్రియందు జాగరణము మున్నగు వానిని నిషేధింతురు. అస్పృశ్యులగు వారితోడి సంభాషణమును నిషేధింతురు. కాని ఈ విషయములకు అన్నింటికి ఫలములు వైద్యగ్రంధములందును ఇతర గ్రంథములందును గనఁబడుచుండును. కొన్నింటిని మాత్రమిందుదహరింతుము.

శ్లో. పాదప్రక్షాళనం పాదమలరోగశ్రమాపహమ్।
దృష్టిప్రసాదనం వృష్యంరక్షోఘ్నం ప్రీతివర్ధనమ్॥
,, నిద్రాయత్తం సుఖందుఃఖం పుష్టిఃకార్శ్యంబలాబలమ్।
వృషతాక్లీబతాజ్ఞాన మజ్ఞానం జీవితంనచ
,, అకాలేఽతిప్రసంగాచ్చన చనిద్రానిషేవితా।
సుఖాయుషీపరాకుర్యాత్కాళరాత్రిరివాపరా ॥౨॥
,, రాత్రౌజాగరణంరూక్షం స్నిగ్ధంప్రస్వాపనందివా।
ద్రవ్యగుణసంగ్రహము.

తా. పాదప్రక్షాళనమువలన పాదమాలిన్యము, పాదరోగములు శ్రమయు పోవును, దృష్టిప్రసాదనము, వృష్యము, రాక్షసనాశనము, ప్రీతివర్ధనము కలుగును. సుఖము, దుఃఖము, పుష్టి, కృశించుట., బలాబలము, వీర్యవత్వము, క్లీబత్వము, జ్ఞానాజ్ఞానములు, మరణము ఇవన్నియు నిద్రననుసరించియుండును. అకాలనిద్రయు, అతినిద్రయు కాళరాత్రివలె సుఖమును ఆయుస్సును నశింపజేయును. రాత్రి జాగరణము, పగలు నిద్ర ఈ రెండు అనారోగ్యకరములు.

### స్నానవిధి.

ప్రాతఃకాలస్నానమువలన కలుగు లాభములను గురించి విశేషించి వ్రాయనక్కర లేదు. ఈస్నానమువలన మనఃప్రసన్నత్వము, శరీరారోగ్యము మున్నగునవి కలిగియుండుటచేత దృష్టఫలమును, అదృష్టఫలము కలుగును. ప్రాతఃకాల స్నానమును గూర్చియు అందులో శీతలోదకస్నానమును గూర్చియు వైద్యశాస్త్రమునందు పలుతావుల బోధించియున్నది. గ్రంథవిస్తర భీతిచేత ఆప్రమాణవచనముల నన్నింటినివదలి ఒక శ్లోకమును మాత్రమిాక్రింద వ్రాయుచున్నారము:--

శ్లో. స్నానం సర్వాంగశుద్ధిర్మలినశుచికరం దేహకాంతింకరోతి
కండుఘ్నంస్వేదహారి శ్రమకరణహరం పైత్యదాహాదిమేహ౯।
దీప్తాగ్నిర్ధాతువృద్ధిస్సుఖతరమకిసంస్తంభకృత్పావనంచ
నానారోగోపశాంతిర్హితకరణకరం చిత్తశుద్ధింకరోతి॥

చరకే.

తా. స్నానముసర్వావయవములను శుద్ధినందించి మలినమును పోగొట్టిదేహకాంతినిచేయును, దురదను, చెమటను, శ్రమను పైత్యదాహమేహములను శమింపజేయును. జఠరాగ్ని దీపనమును, ధాతువృద్ధినిస్తంభనమును, పవిత్రతను, సకలరోగశాంతిని హితవును చిత్తశుద్ధిని చేయునని చరకునిమతము.

అభ్యంగస్నానమునకు ఉష్ణోదకము నుపయోగించవలసినదిగా విధించుట ఉష్ణోదకముచేత తైలఘృతాదిమాలిన్యము సులభముగ పోవునని ఎఱుంగునది.

వస్త్రధారణవిధి

స్నానానంతరమునందు దౌతవస్త్రమును ధరించవలయును. ఈవస్త్రము తెల్లనిదిధరించవలయును హస్తముల పొడవుండి బద్దెక లిగియుండ వలయునని వసిష్ఠునిమతము:---

శ్లో. అష్టహస్తంనవం శ్వేతంసదశంధౌతమంబరం।
శుష్కంచధారయేద్విద్వాన్ సర్వకర్మసుపావనమ్॥

తెల్లనివస్త్రముధరించినందువలన గలుగుఫలము వైద్యశాస్త్రమగు చరకమునందీ విధముగ జెప్పబడియున్నది:---

శ్లో॥ శ్వేదంనుకూలం మజ్జాసృగోజోబల వివర్ధనమ్।
కఫకృత్పిత్తశమనం శ్రమతృడ్దాహనాశనమ్॥

తా. తెల్లని వస్త్రమును ధరించునెడల, మజ్జయు, రక్తము, ఓజస్సు, బలము వృద్ధినొందును, కఫమును చేసును, పైత్యమును శ్రమను తృడ్దాహములను శమింపఁజేసును.

౧. ఆర్ద్రవస్త్రధారణమువలన రోగములు జన్మించునవియు
౨. బద్దెలేనివస్త్రము అశౌచాదులందు ధరించువస్త్రసూచకమనియు
3. ఛిద్రవస్త్రధారణము అవయవములు గనఁబడుననియు
౪. కాలినట్టియు, మలినమయినట్టియు, గోమహిష్యాదులు నమలినవస్త్రమునుధరించుట దరిద్రసూచకమనియు
ఇట్లే అన్నింటికి హేతువు లూహించుకొనునది.

రక్తవస్త్రధారణమునిషేధమునకు హేతువుచరకమునండీవిధముగనున్నది.

శ్లో. తృష్ణాశోషవిభేదనం ధృతికరంకాంతిప్రదంశ్లేష్మలం
న్యామం॥ శుక్లమతీవహృద్యమమలం పిత్తామయధ్వంసనం।
మాంజిష్ఠంచ విదాహికంచకఫకృచ్ఛోష్ణంచవాతామయ
ధ్వంసార్ణంయచిరంసుఖంచకురుతేశ్లేష్మాపహంచస్మృతమ్॥

తా. తెల్లపట్టుగుడ్డ, తృష్ణను శోషను శ్లేష్మను శమింపఁజేయును ధైర్యమును కాంతియునిచ్చును శుక్లవస్త్రము, మనోహరము దోషరహితము, కౌసుంభాదిరక్తవస్త్రధారణము, దాహము వేడినిచేసును వాతరోగని వారకము, కాంతినీ సుఖమునిచ్చును.

## గోపీచందన, భస్మధారణవిధి.

ఊర్ధ్వపుండ్రము గోపీచందన, శ్వేతమృత్తికలచేతను, త్రిపుండ్రము భస్మముచేతను ధరించవలయునని ధర్మశాస్త్రము లందుగలదు. ఇంతియేకాక వానిని ధరించుటవలన దృష్టఫలముగూడ లుగునని వైద్యగ్రంథములందుఁ గనంబడుచున్నది.

శ్లో॥ గోపీచన్దన మగ్నిదీప్తిజననం పైత్యస్య శాంతిప్రదం
నానాక్లేశనివారణాయజనితం లక్ష్మీని వాసాస్పదమ్।
పాపానాం వినిహన్తి వాంతిశమనం శోకస్య విచ్ఛేదనం
పుణ్యైః పూర్వకృతై ర్విశిష్టమనుజై ర్యత్నా త్సదాలభ్యతే॥ ౧

,, పుణ్యంగోమయభస్మభాగ్యజనకం శ్లేష్మాణముల్మలయ
ద్వాతఘ్నంకిలజూర్తివేగశమనం రక్తస్యశాంతిప్రదమ్।
ప్రీతింలోకగురుస్తనోతినితరాం పాషండసంజీవనం
భీతింహన్తి పిపీలికాది విహితాం తచ్ఛీతపైత్యాపహమ్॥ ౨

చరకః

తా. గోపీచందన ధారణము లక్ష్మీనివాసాస్పదము, పైత్యశాంతి నిచేసును, అగ్నిదీప్తిని పుట్టించును. వాంతిని పాపములను కష్టములను దుఃఖములను పోగొట్టును పూర్వకృత పుణ్యముగల శిష్టజనముచే యత్నమున సర్వదా లభించును॥ ౧॥ గోమయభస్మము భాగ్యముసు కలుగఁజేయును, శ్లేష్మమును పుట్టించును, వాతమును జ్వర వేగమును చీమల మొదలగు పురుగుల బాధను నివారింపఁజేయును. రక్తమునకు శాంతిని కలుగఁజేయును, దీనిని ధరించుటవలన భగవంతుడు సంతసించును. పాషండులకు జీవనమయ్యుండును, శీతపైత్యములను పోగొట్టును.

## భోజనవిధి.

భోజనకాలమునందు శుచియును ఆవరణము కలిగిన ప్రదేశమునందు చేయవలయునని చెప్పుటచేత ఆరోగ్యమునకుగాను ఈవిషయము చెప్పఁబడినదని గ్రహించవలయును, పలాశపద్మములందు మాత్రము గృహాశ్రమి భుజించగూడదు. గృహాశ్రమియు వ్రతతిథులందు భుజించవచ్చును. భోజనపాత్రమునకు అధోభాగమునందు భూమియందు గోమయముచేత చతురశ్రమండలము చేయవలయుననుట ఉన్మాదాదిరోగములున్న పోవుటకని ఎఱుంగునది:—

శ్లో॥ అలక్ష్మిహరణంగోవిట్ లేపకర్మణిశస్యతే।
సర్వాశుద్ధికరంపుణ్యం శస్తమున్మాదరోగిణామ్॥ చరకః.

తా. గోమయముచేత క్రింద అలికినయెడల సకలదుర్గంధములను పోగొట్టుటచేత అలక్ష్మినిపోగొట్టుటయు, పవిత్రకరమును ఉన్మాదరోగములు పోగొట్టుటయు, కలుగును.

ఇతర విషయములకుగల గుణములను గ్రంథవిస్తరభీతిచేత వ్రాయమానితిమి.

ఉపసంహారము.

ఈగ్రంథము ఉపోద్ఘాతములతోడ అతిత్వరితముగ వ్రాయఁబడినది. కావున ఇందు ప్రమాదముచేత దొర్లిన తప్పులను చూపరులు మన్నింతురుగాత. పలువిధములగు కారణములచేత సంభవించిన ప్రమాదములను రెండవముద్రణమునందు సంస్కరించుకొనుచున్నాము ప్రాతస్స్మరణ శ్లోకమునకు తాత్పర్యమున్ను శతావధానులును మా మిత్రులును అగు పురాణము సూర్యనారాయణ తీర్థులవారిచే ఇంతకు ముందు వ్రాయఁబడి మాచే ప్రకటింపఁబడినగ్రంథమునుండి గ్రహించితిమి. ఇందులకయి వారియందు కృతజ్ఞులమయి యుందుము, మేమీ గ్రంథమును వ్రాయునప్పుడు, పరాశరమాధవీయము, వైద్యనాథీయాహ్నికకాండ, ఋగ్వేదీయాహ్నిక చంద్రిక, ఋగ్వేదీయాహ్నికము, తైత్తిరీయ సంహిత విద్యారణ్యభాష్యయుతము, ఋగ్వేదము విద్యారణ్యభాష్యయుతము, అష్టాంగ హృదయ, ద్రవ్యముగుణ సంగ్రహము, సదాచార ప్రబంధము, మున్నగు గ్రంథములు చాలసహాయమునొనర్చినవి. ఇతర గ్రంథములనుండికూడ కొంత సహాయమును పొందితిమిగాని గ్రంథవిస్తరభీతిచేత వదలితిమి.

ప్రమాదపరిశోధనము.

ఋగ్వేదీయ స్నానవిధియందు గంగాదిధ్యానము నందుండపవలసిన ౮ శ్లోకము అచ్చువారి పొరబాటువలన ఋగ్వేదీయస్నానవిధియొక్క మొదటియందుంచబడినది. కనుక దయయుంచి పాఠకులు చదువుకొందురుగాత.

శ్లో॥ గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః!
హసన్తిదుర్జనాస్తత్ర సమాదధతి సజ్జనాః॥

సదాచారప్రియులు { వై. కోటీశ్వరశర్మ శాస్త్రి
క. మార్కండేయశర్మ



"స్వధర్మే నిధనం శ్రేయః"

"శ్రీచిదానందసరస్వతి శ్శరణం భవతు."

శ్లో॥ ఆచారా ల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః।
ఆచారా ద్ధన మక్షయ్య మాచారో హంత్యలక్షణమ్॥

శ్లో॥ బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ చింతయే దాత్మనో హితం।
ధర్మార్థకామాన్ స్వేకాలె యథాశక్తి నహాపయేత్॥

# సదాచారము.

సదాచారమునకు మూలము ధర్మము. శాస్త్రములందుఁ జెప్పఁబడిన విధులకనుకూలముగఁ జరించుట ధర్మమనంబడును. ప్రకృతమున ధర్మోల్లంఘనము చేయుచున్న వారిని పలువురిని చూచుచున్నారము. వారతిక్రమించుట కీక్రింది మూఁడుకారణములు గానవచ్చుచున్నవి:—

౧. శాస్త్రవిధుల నెఱుంగక పోవుట.

౨. అన్నిటియందును విదేశీయుల నధికముగ ననుకరించుట.

౩. స్వేచ్ఛాచారమునందు అతిశయప్రీతి.

కావున ప్రథమకారణమగు శాస్త్రవిధుల నెఱుంగమి శాస్త్రపరిజ్ఞానము చేతఁబోవును కావునతదర్థ మీగ్రంథమునాంధ్ర భాషానువాదముతోడ వ్రాయుచున్నారము.

౧. సూర్యోదయముకంటె పూర్వమున్న ముహూర్తమునకు రౌద్రమనియు, దానికంటె వెనుకటి ముహూర్తమునకు బ్రాహ్మమనియు పేరు. ముహూర్తమనఁగా రెండుగడియలు. ఉదయమునకంటె

రగు గడియలు ముందుగ మేల్కొనవలయునని మనుయాజ్ఞవల్క్యాదు లయభిప్రాయము *

మూ. బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ చింతయే దాత్మనో హితమ్।
స్మరణం వాసుదేవస్య కుర్యాత్కలిమలాపహమ్. ౧

తా. బ్రాహ్మముహూర్తమున నిదురమేల్కొని ప్రతిమనుజుఁడును దనకుహితము నాలోచించుకొనవలయును. కలిదోషములను బోఁగొట్టువాసుదేవుని స్మరింపవలయును.

ప్రాతఃకాల స్మరణ శ్లోకములు.

మూ. శ్రీమద్రామాభిధానంవిధుతకలిమలంబ్రహ్మధర్మస్యమూలం
స్మృత్వాబ్రాహ్మే ముహూర్తే సకలసుకృతిభిస్సంప్రబుద్ధైరుపాస్యమ్
స్మృత్వామన్వత్రిముఖ్యానపినిఖిలమునీన్ ధర్మధామప్రదీపాన్
విశ్వాదర్శం విధాస్యేవిమలమతికృతే ధర్మశాస్త్రస్యసారమ్. ౨

తా. బ్రాహ్మముహూర్తమున జ్ఞానులగు పుణ్యాత్ములందఱిచే నుపాసనచేయఁ దగినదియు, సమస్తమైన ధర్మములకును మూలమును, కలిదోషములను దొలఁగించునదియు, శ్రీమంతమును, రాముఁడను పేరు గలదియు నగుపరబ్రహ్మమును, స్మరించి ధర్మము లనునిండ్లకు దీపములవంటివారును మనువు, అత్రి మొదలుగాఁగల వారును అగు మునీశ్వరుల నందఱిని స్మరించి నిర్మలమైన బుద్ధి గలుగుటకుఁగాఁ బ్రపంచకమునకు నద్దమువంటి ధర్మశాస్త్రముయొక్క సారమును రచించుచున్నాను.

మూ. గుర్వర్థేత్యక్తరాజ్యోవ్యచరదనువనంపద్మపద్భ్యాంప్రియాయాః
పాణిస్పర్శాక్షమాభ్యాంమృజితపథిరుజో యోహరీన్ద్రానుజాభ్యామ్,
వైరూప్యాచ్ఛూర్పణఖ్యాః ప్రియవిరహరుషాగోపితభ్రూవిజృంభ
త్రస్తాబ్ధిర్బద్ధసేతుః ఖలదవదహనః కోసలేన్ద్రోఽవతాన్నః. 3

---

* 5 గడియల ప్రొద్దుండఁగా మేల్కొని నిత్యకృత్యములను తీర్చుకొనవలయునని కొన్నిస్మృతులందుగలదు. పరాశరమాధవీయమునందు సూర్యోదయాత్పూర్వమున అరజాములో బ్రాహ్మ, రౌద్రముహూర్తములు గలవనియు చెప్పబడియున్నది. అందులో బ్రాహ్మముహూర్తమునందు లేచి ప్రాతస్స్మరణాదికము చేయవలయునని గలదు.

తా. తండ్రియగు దశరథమహారాజుయొక్క సత్యమును నిలుపుటకై రాజ్యమును విడిచినవాఁడును, చేయి తగిలినఁ గందునట్టి పద్మములవంటి పాదములతో నడవిలోఁ దిరుగుచున్నవాఁడును, ప్రియురాలగు సీతయొక్క మార్గాయాసమును బోఁగొట్టిన వాఁడును, శూర్పణఖయొక్క ముక్కుఁ జెవులును గోయుటవలనఁ గలిగిన ప్రియురాలి వియోగముచేత నైనకోపముతోఁ గూడినవాఁడై సుగ్రీవుఁడు లక్ష్మణుఁడు తోడుగాఁ గోపసూచక మగు కనుబొమ్మల విజృంభణముచేత సముద్రిని భయపెట్టి వాని యనుమతిచే సేతువును గట్టించి దుర్మార్గులగు రాక్షసులను అడవిని దవాగ్ని మాడ్చినట్లు మాడ్చి కోసలదేశాధీశ్వరుఁడగు శ్రీరామచంద్రుఁడు మమ్మును రక్షించుఁగాత.

మూ. యఃపృథ్వీభరవారణాయ దివిజై స్సంప్రార్థిత శ్చిన్మయః
సంజాతః పృథివీతలే రవికులే మాయామనుష్యోఽవ్యయః,
నిశ్చక్రంహతరాక్షసః పున రగా ద్బ్రహ్మత్వ మాద్యం స్థిరాం
కీర్తిం పాపహరాం విధాయ జగతాం తం జానకీశం భజే. ౪

తా. రావణాదులవలనఁ గలిగినభూభారమును వారించుటకై దేవతలచేఁ బ్రార్థింపఁ బడినవాఁడై చిత్స్వరూపుఁడును, అవ్యయుఁడు నయ్యునుభూమియందు సూర్యవంశమున మాయామానుషవిగ్రహుఁడై యవతరించి పుత్రపౌత్రాదులతో రావణాదిరాక్షసులఁ జంపి జగత్తుల పాపములహరించు తనకీర్తిని శాశ్వతముగా వ్యాపింపఁజేసి యెవఁడు తన మొదటిదియగు బ్రహ్మత్వమును బొందెనో అట్టిజానకీపతి యగు శ్రీరామచంద్రుని సేవించుచున్నాడను.

మూ. మనోజవంమారుతతుల్యవేగం జితేన్ద్రియంబుద్ధిమతాంవరిష్ఠమ్
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శరణంప్రపద్యే.

తా. మనస్సుయొక్క వేగమువంటి వేగము గలవాఁడును, గాలితో సమానమైన వేగముగలవాఁడును, ఇంద్రియములను జయించినవాఁడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడును, వానరు లందఱిలో ముఖ్యుఁడును, శ్రీరామచంద్రునికి దూతయును అగు వాయుదేవుని కుమారుఁడగు నాంజనేయుని శరణు పొందెదను.

మూ. జన్మాద్యస్య యతోఽన్వయా దితరత శ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్
తేనే బ్రహ్మ హృదాయ ఆదికవయే ముహ్యంతి యత్సూరయః,
తేజోవారిమృదాం యథావినిమయో యత్ర త్రిసర్గోమృషా
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి. ౬

తా. ఏపరమేశ్వరునివలన నీప్రపంచముయొక్క సృష్టిస్థితి లయములు గలుగుచున్నవో, ఏపరమేశ్వరుఁడు ఆకాశాదికార్యముల విషయమై అన్వయ వ్యతిరేకములవలన నెఱుకగలవాఁడో, ఏపరమేశ్వరుఁడు తనంతటఁ బ్రకాశించువాఁడో, ఏపరమేశ్వరుఁడు చతుర్ముఖబ్రహ్మకుఁ బ్రీతిచేఁ బండితులనుగూడ మోహపెట్టు వేదములను బ్రకాశింపఁజేసెనో, సూర్యకిరణములయందును, గాజుమొదలగువానియందును ఉదకము మొదలగువానియొక్క భ్రాంతివలెనే యేపరమేశ్వరుని యందు ఆత్మమాయాగుణములగు సత్త్వరజస్తమస్సులయొక్క సృష్టి అసత్యమో, అట్టి తనతేజస్సుచేతనే యెప్పుడును మాయాసంబంధమువలనఁ గలుగుచున్న ప్రపంచమును నిరసించు సత్యస్వరూపుఁడగు పరమేశ్వరుని ధ్యానించుచున్నారము.

మూ. ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కింవా పరై రీశ్వర
స్సద్యోహృద్యవరుధ్యతేఽత్ర కృతిభిః శుశ్రూషుభి స్తత్‌క్షణాత్.

తా. శ్రీమన్నారాయణునిచే మొదటసంక్షేపముగా రచింపఁబడిన యీవిష్ణుభాగవతమునందుఁ గపటములేని యుత్తమధర్మము ప్రతిపాదింపఁ బడుచున్నది. ఇందుఁబరమసుఖ మిచ్చునదియు నాధ్యాత్మికాది తాపత్రయమును బోఁగొట్టునదియుఁ బరమార్థభూతమును అగుబ్రహ్మరూప మగువస్తువు మచ్చరము లేని పండితులచేఁ దెలియఁదగినది గలదు. అనేకములగు నితరశాస్త్రములవలన నేమిప్రయోజనమున్నది. ఇందు విన నిచ్ఛగల పుణ్యాత్ములచేఁ దత్క్షణమే అట్టివస్తువు హృదయమందు స్థిరము చేయఁబడును.

మూ. నిగమకల్పతరోర్గళితం ఫలం
శుకముఖా దమృతద్రవసంయుతమ్,

పిబత భాగవతం రస మాలయం
ముహు రహో రసికా భువిభావుకాః. ౮

తా. రసజ్ఞులగు సహృదయులారా! అమృతరసముతో నిండినదియు, శుకముఖమునుండి భూమియందుఁ బడినదియు నగు భాగవతరూపమైన వేదమనెడు కల్పవృక్షముయొక్క ఫల(రస)మును మోక్షమునుబొందువఱకునుమాటిమాటికిని శ్రోత్రపుటములచేఁ ద్రాగుఁడు.

మూ. కృష్ణ! త్వదీయపదపంకజ పంజరాన్త
మద్యైవమే విశతు మానసరాజహంసః,
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే. ౯

తా. కృష్ణా! నామనస్సనెడు రాజహంస యిప్పుడే నీపాదపద్మములనెడు పంజరములోఁ బ్రవేశించుఁగాక. ఏమనఁగా:—ప్రాణమీ శరీరమును విడిచిపోవునపుడు కఫము, వాతము, పైత్యము అనువీనిచే గంఠమున కడ్డుగలుగుచుండఁగా నీస్మరణ యెట్లులభించును?

మూ. కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః।
జలా త్సూర్యో యథాపద్మం నరకా దుద్ధరా మ్యహమ్. ౧౦

తా. ఎవఁడు నన్ను నిత్యమును కృష్ణా! కృష్ణా! కృష్ణా! అనిస్మరించుచుండునో వానిని నేను జలమునుండి సూర్యుఁడు పద్మము నుద్ధరించునట్లు నరకమునుండి యుద్ధరించుచున్నాఁడను.

మూ. సకృ న్నారాయణేత్యుక్త్వా పుమాన్ కల్పశతత్రయమ్,
గఙ్గాదిసర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక. ౧౧

తా. నాయనా! ఒక్కమాఱు నారాయణా! అని పలికినమనుష్యుఁడు మూఁడువందల కల్పములు గఙ్గ మొదలగు సమస్తమైన పుణ్యతీర్థములయందును స్నానము చేసినవాఁడగుచున్నాఁడు.

మూ. సకృ దుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్,
బద్ధః పరికర స్తేన మోక్షాయ గమనం ప్రతి. ౧౨

తా. ఎవనిచేతను ఒక్కమాఱు హరి యనెడి రెండక్షరములు నుచ్చరింపఁబడునో వానిచేత మోక్షమునకొఱకైన ప్రయాణమును గూ

ర్పి పరికరము సిద్ధము చేయఁబడినది యగుచున్నది. అనఁగా నొక్క మాఱు హరీ యని యుచ్చరించినవాఁడు మోక్షమునకుఁబోవుననుట.

మూ. ధ్యాయే ద్దాదిత్యసంకాశం వాసుదేవం చతుర్భుజమ్,
శంఖచక్రగదాపద్మవనమాలావిరాజితమ్.

తా. సూర్యునితో సమానమైన వెలుఁగు గలవాఁడును, నాలుగుబాహువులు గలవాఁడును, శంఖను, చక్రము, గద, పద్మము, వనమాల వీనితోఁ బ్రకాశించువాఁడును అగు వాసుదేవుని ధ్యానించవలయును.

మూ. తత్పాదోదకజాం ధారాం నిపతన్తీం స్వమూర్ధని,
చిన్తయే ద్బ్రహ్మరంధ్రేణ ప్రవిశన్తీం స్వకాం తనుమ్,
తయా సంక్షాళితం సర్వ మన్తర్దేహగతం మలమ్.

తా. ఆ వాసుదేవుని పాదపద్మములవలనఁ బుట్టినయుదకధార తనశిరస్సుపైఁ బడినదియై బ్రహ్మరంధ్రముగుండఁ దనశరీరమును బ్రవేశించుచున్నదానిని గాను ఆధారచేఁ దనదేహములో నున్నమల మంతయుఁ గడిగివేయఁబడినదానిగను జింతనచేయ వలయును.

మూ. మహర్షి ర్భగవాన్ వ్యాసః కృత్వేమాం సంహితాం పురా,
శ్లోకై శ్చతుర్భి ర్ధర్మాత్మా పుత్ర మధ్యాపయ చ్ఛుకమ్. ౧౫

తా. ధర్మాత్ముఁడును, మహాబుషి యగువ్యాసభగవానులవారు పూర్వమందీభారతసంహితను నాలుగు శ్లోకములచేఁ జేసి తన కుమారుఁడగు శ్రీశుకులచే నధ్యయనము చేయించిరి.

మూ. మాతాపితృసహస్రాణి పుత్రదారశతాని చ,
సంసారే ష్వనుభూతాని యాన్తి యాస్యన్తి చాపరే. ౧౬

తా. ఈసంసారమునందు వేలకొలఁదిగఁ దల్లులుఁ, దండ్రులు, వందలకొలఁదిగఁ గొడుకులు, భార్యలు అనుభవింపఁబడిరి, పోవుచున్నారు. పోఁగలరు.

మూ. హర్షస్థానసహస్రాణి భయస్థానశతానిచ,
దివసే దివసే మూఢ మావిశన్తి న పణ్డితమ్. ౧౭

తా. ప్రతిదినమందును వేలకొలఁదిగ సంతోషములు, వందల కొలఁదిగ భయములు మూఢుని నావేశించుచుండును గాని పండితు నావేశింపవు.

మూ. ఊర్ధ్వబాహు ర్విరౌ మ్యేష నచ కశ్చి చ్ఛృణోతిమే,
ధర్మా దర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే. ౧౮

తా. నేను జేతు లెత్తుకొని మొఱ్ఱ వెట్టుచున్నాను. మొఱ వినుటయే లేదుకదా. ఒకధర్మము వలన యర్థముగాని కామముగాని కలుగును. కావున నా ధర్మము నెందుకు సేవింపరాదు?

శ్లో. న జాతు కామా న్న భయా న్న లోభా
ద్ధర్మం త్యజే జ్జీవితస్యాపి హేతోః,
ధర్మో నిత్య స్సుఖదుఃఖే త్వనిత్యే
జీవో నిత్యో హేతు రస్య త్వనిత్యః. ౧౯

తా. కామమువలనఁగాని భయమువలనఁగాని లోభమువల నఁగాని తుదకు ప్రాణముకొఱకుఁగాని ధర్మమును విడువరాదు. ఏమ నఁగా ధర్మము నిత్యమైనది. సుఖదుఃఖములు నిత్యములు గావు. జీవు డు నిత్యముగా నుండువాఁడు. ఈజీవునికిఁ గారణముల నిత్యములు.

శ్లో. ఇమాం భారతసావిత్రీం ప్రాత రుత్థాయ యః పఠేత్,
స భారతఫలం ప్రాప్య పరం బ్రహ్మాధిగచ్ఛతి. ౨౦

తా. ఎవఁడీభారతసావిత్రిని ప్రాతఃకాలమునందు నిదురనుండి లేచిపఠించునో వాఁడు భారతమును బఠించినఫలమును బొంది పరబ్ర హ్మమును బొందును.

శ్లో. దధి మధురం మధు మధురం ద్రాక్షా మధురాసితాపిమధురైవ,
మధురా దపి మధురతరం మధురానాథస్య నామ యద్గీతమ్.

తా. పెరుగు మధురమైనది, తేనె మధురమైనది. ద్రాక్షఫల ము మధురమైనది. పంచదారయు మధురమైనదే, మధురములైన పదార్థములన్నిటికంటెను మిక్కిలి మధురమైన దేది? మధురానాథుఁ డగు శ్రీకృష్ణభగవానునియొక్క గానము చేయఁబడిన నామము. భ గవన్నామమున కన్నియు నీరసము లనుట.

శ్లో. మృద్వీకా రసితా; సితా సమసితా; స్ఫీతం నిపీతం పయః;
స్వర్యాతేన సుధాప్యధాయి; కతిధా రంభాధరః ఖండితః,
సత్యం బ్రూహి మదీయజీవ భవతా భూయో భవే భ్రామ్యతా
కృష్ణేత్యక్షరయో రయం మధురిమోద్గారః క్వచి ల్లక్షితః *

తా. ఓ నాజీవమా! తఱచుగా నీసంసారములోఁ దిరుగుచున్న నీవు ద్రాక్షఫలములు దింటివి. పంచదార రుచి గంటివి. వలసినన్ని పాలు ద్రావితివి. అనేకపర్యాయములు స్వర్గమున కేగి రంభాసుందరి యధరామృత మానితివి. నిజము చెప్పుము కృష్ణా! అను నక్షరముల యందుగల మాధుర్యమెక్కడనైనను జిక్కినదా? *

శ్లో. హేజిహ్వే! రససారజ్ఞే! సర్వదా మధురప్రియే,
నారాయణాఖ్యం పీయూషం పిబ జిహ్వేనిరన్తరమ్. ౨౩

తా. రసముయొక్కసారము నెఱిఁగినదానవును, ఎప్పుడును మధురమైనపదార్థము లిష్టమైనదానవును అగు నోజిహ్వా! "నారాయణ" అనుపేరు గల అమృతము నెల్లప్పుడును ద్రాగుము. అనఁగా సదా నారాయణస్మరణ చేయుమనుట.

శ్లో. జిహ్వే! కీర్తయ కేశవం; మురరిపుం చేతో భజ; శ్రీధరం
పాణిద్వంద్వ! సమర్పయా; చ్యుతకథాః శ్రోత్రద్వయ త్వంశృణు,
కృష్ణంలోకయలోచనద్వయ!; హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం;
జిఘ్రఘ్రాణ! ముకుందపాదతులసీం; మూర్ధన్నమాధోక్షజమ్.

తా. ఓ నాలుకా! నీవు కేశవుని గీర్తనజేయుము. ఓ చిత్తమా! నీవు మురవైరిని భజించుము. ఓ చేతులారా! మీరు శ్రీధరుని బూజింపుఁడు. ఓ చెవులారా! మీరు విష్ణుని కథలు వినుఁడు. ఓ కన్నులారా! మీరు కృష్ణభగవానుని జూడుఁడు. పాదములారా!

---

* ప్రసంగవశమున నీక్రిందిపద్యమిందుఁ బొందుపఱచుచున్నాము.

ఉ. ఇమ్ముగ నాల్కపై నిలిచి యెన్నియొనాల్కలకానఁగొల్పుగ
ర్వమ్మునఁ జొచ్చికర్ణము లనంతములన్ మదిఁ గోరఁ జేయఁజి
త్తమ్మునఁజిక్క యింద్రియపథమ్ములఁ గట్టను గృష్ణనామమం
త్రమ్మెవ రైన నంతయమృతమ్మునఁ జేసిరొ చెప్ప నేర్తురే.

మీరు విష్ణుని యాలయమునకు వెళ్లుఁడు. ఓ ఘ్రాణమా! నీవు విష్ణుమూర్తిపాదముల యందర్పించిన తులసిని వాసనఁజూడుము. ఓ శిరస్సా! నీవు విష్ణుభగవానునకు నమస్కరించుము.

శ్లో. యో గోశతం కనకశృంగమయం దదాతి
విప్రాయ వేదవిదుషేచ బహుశ్రుతాయ,
పుణ్యాంచ భారతకథాం శృణుయాచ్చ నిత్యం
తుల్యం ఫలం భవతి తస్యచ తస్య చైవ. ౨౪

తా. వేదవేత్తయుఁ జాల చదువుకొన్నవాఁడునునగు బ్రాహ్మణునకు బంగారుకొమ్ములు గల గోవులనువందలకొలఁదిదానములిచ్చువారికిని నిత్యమును పవిత్రమగు భారతకథ వినువారికిని ఫలముసమానము.

౨. సూర్యస్మరణ.

శ్లో. ప్రాతః స్మరామి ఖలు తత్సవితు ర్వరేణ్యం
రూపం హి మండల మృచోఽథ తను ర్యజూంషి,
సామాని యస్య కిరణాః ప్రభవాదిహేతుం
బ్రహ్మహరాత్మక మలక్ష్య మచింత్యరూపమ్. ౨౫

తా. ఋగ్వేదస్వరూపమైనమండలమును, యజుర్వేద స్వరూపమైనశరీరమును, సామవేద స్వరూపమైనకిరణములు గలవాఁడును, సృష్టి స్థితిలయములకుఁ గారణుఁడును, బ్రహ్మ విష్ణు శివస్వరూపుఁడును, జూల్పుటకుఁగాని చింతన చేయుటకుఁగాని వీలులేనిస్వరూపముగల వాఁడును అగు సూర్యభగవానుని శ్రేష్ఠ స్వరూపమును ప్రాతఃకాలమందు స్మరించుచున్నాఁడను.

శ్లో॥ ప్రాతర్నమామి తరణిం తను వాఙ్మనోభి
ర్బ్రహ్మేంద్రపూర్వకసురై ర్నుత మర్చితం చ,
వృష్టి ప్రమోచన వినిగ్రహ హేతుభూతం
త్రైలోక్యపాలనపరం త్రిగుణాత్మకం చ. ౨౬

తా. శరీరముచేతను వాక్కులచేతను మనస్సుచేతను బ్రహ్మాది దేవతలచేఁ గొనియాడఁ బడువాఁడును, పూజింపఁ బడువాఁడును, వర్షించువాఁడును, వర్షింపకుండనుండువాఁడును, ముల్లోకములఁ బాలిం

చుటయందా శక్తిగలవాఁడును, సత్వరజస్తమోగుణస్వరూపుండునుఅగు సూర్యభగవానుని గూర్చి ప్రాతఃకాలమందు నమస్కరించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్భజామి సవితార మనన్తశక్తిం
పాపౌఘ శత్రుభయ రోగహరం పరంచ,
తం సర్వలోక కలనాత్మక కాలమూర్తిం
సంసారబంధన విమోచన మాదిదేవమ్. ౨౭

తా. అనన్త శక్తియు, పాపములను శత్రువులను, భయములను, రోగములను హరించువాఁడును, అన్నిఁటికంటెఁ బైగానుండువాఁడును, తత్పదవాచ్యుఁడును, కాలస్వరూపుఁడయి అన్నింటిని లెక్కించువాఁడును, సంసారమను బంధమును విప్పువాఁడును, అంతకు నాదిదేవుఁడును అగు సూర్యభగవానుని ప్రాతఃకాలమందు భజించుచున్నాఁడను.

శ్లో. శ్లోకత్రయ మిదంభానోః ప్రాతఃప్రాతః పఠేత్తుయః,
స సర్వవ్యాధినిర్ముక్తః పరం సుఖ మవాప్నుయాత్. ౨౮

తా. ప్రతిదినమును ప్రాతఃకాలమందీసూర్యభగవానుని మూఁడు శ్లోకములను బఠించువాఁడు రోగములన్నియుఁ దొలఁగి చాల సుఖము నొందును.

గణేశ స్మరణ.

శ్లో. ప్రాతః స్మరామి గణనాథ మనాథబంధుం
సిందూరపూర పరిశోభిత గండయుగ్మమ్,
ఉద్దండవిఘ్న పరిఖండనచండదండ
మాఖండలాదిసురనాయకబృందవంద్యమ్. ౨౯

తా. దిక్కులేని నావంటివానికి బంధువును, గండస్థలములయందు సిందూరముచే నలంకరింపఁబడినవాఁడును, అధికములగు విఘ్నముల ఖండించు తీక్ష్ణమైన దండముగలవాఁడును, ఇంద్రాది దేవతలచేఁ గొని యాడఁబడుచుండువాఁడును అగు గణేశభగవానుని ప్రాతఃకాలమందు స్మరించుచున్నాఁడను.

శ్లో. ప్రాత ర్నమామి చతురాననవంద్య మాన-
మిచ్ఛానుకూల మఖిలంచ వరం దదానమ్,

తం తుందిలం ద్విరసనప్రియయజ్ఞసూత్రం
పుత్రం విలాసచతురం శివయోః కుమారమ్. ౩౦

తా. బ్రహ్మచేతఁ గొనియాడఁబడుచుండువాఁడును, ఇచ్ఛానుకూలుఁడును, సమస్తవరముల నిచ్చుచుండువాఁడును, పెద్దకడుపు గలవాఁడును, పాములే ప్రియమైన జన్నిదములుగాఁగలవాఁడును, విలాసచతురుఁడును, పార్వతీ పరమేశ్వరులకుఁ గుమారుఁడును అగు నాగణేశభగవానునిగూర్చి ప్రాతఃకాలమందు నమస్కరించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్భజామ్యభయదం ఖలు భక్తశోక
దావానలం గణవిభుం వరకుంజరాస్యమ్,
అజ్ఞానకానన వినాశన హవ్యవాహ
ముత్సాహవర్ధన మహం సుత మీశ్వరస్య. ౩౧

తా. అభయము నిచ్చువాఁడును, భక్తుల శోకమును హరించువాఁడును, ప్రమథగణములకు నాయకుఁడును, ఏనుఁగు మొగము గలవాఁడును, అజ్ఞానమను నడవిని దహించుటకు దవాగ్ని వంటివాఁడును, ఉత్సాహమును వృద్ధిఁబొందించువాఁడును ఈశ్వరునకుఁ గుమారుఁడును అగు గణేశ భగవానుని ప్రాతఃకాలమందు సేవించుచున్నాఁడను.

శ్లో. శ్లోకత్రయ మిదం పుణ్యం సదా సామ్రాజ్యదాయకమ్,
ప్రాతరుత్థాయ సతతం యఃపఠేత్ ప్రయతఃపుమాన్,
స సర్వభోగా నాప్నోతి గణాధిపపదం తతః, ౩౨

తా. సామ్రాజ్యసంపదనిచ్చు నీపవిత్రమయిన గణేశభగవానుని మూఁడు శ్లోకములును ప్రతి ప్రాతఃకాలమందును నియముగా నెప్పుడు బఠించువాఁడు సమస్తభోగముల నొంది పిమ్మట గణేశ భగవానుని పదమును బొందును.

## ౭. దేవీస్మరణ.

శ్లో. ప్రాతఃస్మరామి శరదిందుకరోజ్జ్వలాభాం
సద్రత్నవత్సకలకుండల హారశోభామ్,
దివ్యాయుధోర్జిత సునీల సహస్రహస్తాం
రక్తోత్పలాభచరణాం మనసా పరేశామ్. ౩౩

తా. శరత్కాల చంద్రుని కిరణములవలె వెలుంగుచున్న కాంతి గలదియు, మంచిమంచిరత్నములతోఁ బ్రకాశించు కుండలములు ముత్యాలహారములు మొదలగు నలంకారములతోఁ బ్రకాశించునది యు, దివ్యములగు నాయుధములతో నొప్పుచుండు నల్లనివేయిభాహు వులు గలదియు, ఎఱ్ఱగలువపూలవంటి పాదములుగలదియు, పరదేవత యునగు దేవిని ప్రాతఃకాలమందు మనస్సుచేత స్మరించుచున్నాఁడను.

శ్లో. ప్రాత ర్నమామి మహిషాసురచండముండ
శుంభాసుర ప్రముఖదైత్య వినాశదక్షామ్,
బ్రహ్మేంద్రరుద్ర మునిమోహనశీలశీలాం
చండీం సమస్తసురమూర్తి మనేక రూపామ్. ౩౪

తా. మహిషాసురుఁడు చండుఁడు ముండుఁడు శుంభాసురుఁడు మొదలుగాఁగల రాక్షసులఁ జంపునేర్పుగలదియు, బ్రహ్మను శివుని మునీశ్వరులను మోహపెట్టు స్వభావముగల విలాసములు గలదియు, సకలదేవతా స్వరూపురాలును, అనేక రూపములు గలదియునగు చం డికాపరమేశ్వరిని గూర్చి ప్రాతఃకాలమందు నమస్కరించుచున్నాఁడను.

శ్లో. ప్రాత ర్భజామి భజతా మఖిలార్థదాత్రీం
ధాత్రీం సమస్త జగతాం దురితాపహంత్రీమ్,
సంసారబంధన విమోచనహేతుభూతాం
మాయాం పరాం మునిభి రంత రుపాస్యమానామ్. ౩౫

తా. తన్ను సేవించువారి కోరిక లన్నియుఁ దీర్చునదియు, లోకము లకుఁ దల్లియు పాపముల నపహరించునదియు, సంసారమను బంధము విప్పుటకుఁ గారణ భూతురాలును, మాయాస్వరూపురాలును, అన్ని టికంటెఁ బయిగానుండునదియు మునులచే నంతరంగమునందుపాసిం పఁబడుచుండునదియు నగు పరదేవతను ప్రాతఃకాలమునందు సేవించు చున్నాఁడను.

శ్లో. శ్లోకత్రయ మిదం దేవ్యా శ్చండికాయాః పఠే న్నరః,
సర్వాన్ కామా నవాప్నోహ దేవీలోకే మహీయతే.

తా. చండికా పరమేశ్వరి సంబంధమగు నీశ్లోకత్రయమును బఠించుచుండువాఁడు తప్పక యీలోకమందు సమస్త మనోరథములను బొంది తుదకు దేవలోకములోఁ బూజింపఁ బడుచుండును.

౮. శివస్మరణ.

శ్లో. ప్రాతఃస్మరామి భవభీతిహరం సురేశం
గంగాధరం వృషభవాహన మంబికేశమ్,
ఖట్వాంగశూల వరదాభయహస్త మీశం
సంసారరోగహరణౌషధ మద్వితీయమ్. ౩౭

తా. పుట్టుకవలని భయమును హరించువాఁడును, దేవతల కధిపతియు, శిరస్సున గంగను ధరించుచుండువాఁడును, వృషభము నెక్కి తిరుగుచుండువాఁడును, అంబికకుఁ బ్రియుఁడును, ఖట్వాంగశూల వరదాభయ హస్తుఁడును, సంసారమను రోగమును హరించుటకు నద్వితీయమగు నౌషధమును నగు శివభగవానుని ప్రాతఃకాలమున స్మరించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్నమామి గిరిశం గిరిజార్ధదేహం
సర్గస్థితి ప్రళయకారణ మాదిదేవమ్,
విశ్వేశ్వరం విజిత విశ్వమనోభిరామం
సంసారరోగ హరణౌషధ మద్వితీయమ్. ౩౮

తా. కైలాస పర్వతముమీఁద శయనించువాఁడును, సగము శరీరమందుఁ బార్వతిగలవాఁడును సృష్టిస్థితి సంహారములకుఁ గారణుఁడును, అందఱికంటెను ముందున్న దేవుఁడును, ప్రపంచమున కీశ్వరుఁడును, ప్రపంచమును జయించిన మనస్సుచే నొప్పుచుండువాఁడును, సంసారమను రోగమును హరించుటకు నద్వితీయమైన యౌషధమును అగు శివభగవానునిగూర్చి ప్రాతఃకాలమున నమస్కరించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్భజామి శివమేకమనంత మాద్యం
వేదాంతవేద్య మనఘం పురుషం మహాన్తమ్,
నామాది భేదరహితం షడభావశూన్యం
సంసార రోగహరణౌషధ మద్వితీయమ్. ౩౯

తా. ఏకాకియు, అంతములేనివాఁడును, మొదటివాఁడును, ఉపనిషత్తులచేఁ దెలిసికోఁదగినవాఁడును, జీవునికిఁగల దోషము లొక్కటియు లేనివాఁడును, పురుష స్వరూపుఁడును, మహచ్ఛబ్దవాచ్యుఁడును, నామము రూపము మొదలగు భేదములు లేనివాఁడును, ఆ ర్తైన యభావములు లేనివాఁడును, సంసారమను రోగమును హరించుటకు నద్వితీయమగు నౌషధమును అగు శివభగవానుని ప్రాతఃకాలమున సేవించుచున్నాఁడను.

శ్లో. ప్రాతస్సముత్థాయ శివం విచింత్య
శ్లోకత్రయం యేఽనుదినం పఠన్తి,
తే దుఃఖజాతం బహుజన్మసంచితం
హిత్వా పదం యాంతి తదేవ శంభోః. ౪౦

తా. ప్రాతఃకాలమున లేచి శివభగవానుని ధ్యానించియెవరీమూఁడుశ్లోకములను బఠియింతురో వారు పెక్కుజన్మములనుండి సంచితమైన దుఃఖములను విడిచి పునరావృత్తిరహితమైన శివపదమును బొందుదురు.

౬. విష్ణుస్మరణ.

శ్లో. ప్రాతః స్మరామి భవభీతిమహార్తి శాంత్యై
నారాయణం గరుడవాహన మబ్జనాభమ్,
గ్రాహాభిభూతవరవారణ ముక్తిహేతుం
చక్రాయుధం తరుణ వారిజపత్రనేత్రమ్. ౪౧

తా. గరుడవాహనుండును, పద్మము నాభియందుఁ గలవాఁడును, మొసలిచేఁ బట్టువడిన గజేంద్రుని మోక్షమునకుఁ గారణుండును, చక్రమను నాయుధము గలవాఁడును, ముదిరిన తామర రేకులవంటి కన్నులు గలవాఁడును నగు విష్ణు భగవానుని సంసారభయమను మహారోగముయొక్క శాంతికొఱకుఁ బ్రాతఃకాలమున స్మరించుచున్నాఁను.

శ్లో. ప్రాతర్నమామి మనసా వచసాచ మూర్ధ్నా
పాదారవిందయుగళం పరమస్య పుంసః,
నారాయణస్య నరకార్ణవతారణస్య
పారాయణ ప్రవణ విప్ర పరాయణస్య. ౪౨

తా. పరమపురుషుండును, నరకసముద్రమునుండి దాటించువాఁడు ను, తన నామములఁ బారాయణచేయు బ్రాహ్మణులయందుఁ బ్రీతిగల వాఁడును అగు విష్ణుభగవానుని పాదారవిందములను మనస్సుచేతను వాక్కుచేతను, శిరస్సుచేతను ప్రాతఃకాలమున నమస్కరించు చున్నాఁడను.

శ్లో. ప్రాతర్భజామి భజతా మభయంకరం తం
ప్రాక్సర్వజన్మకృతపాప భయాపహత్యై,
యోగ్రాహవక్త్రి పతితాంఘ్రి గజేంద్ర ఘోర
శోక ప్రణాశ మకరో ధ్ధృతశంఖచక్రః. ౪౩

తా. మొసలినోటఁ బడిన పాదముగల గజేంద్రుని ఘోరమైన శోకమును పోగొట్టుటకు మొసలి విషయమై యెత్తఁబడిన శంఖ చక్ర ములు గలవాఁడును, తన్ను సేవించువారి కభయమిచ్చువాఁడును నగు నావిష్ణుభగవానుని పూర్వజన్మములయందుఁ జేయఁబడిన పాపములవలని భయమును బోఁగొట్టుకొఱకు ప్రాతఃకాలమునభజించుచున్నాఁడను.

శ్లో. శ్లోకత్రయ మిదంపుణ్యం ప్రాతఃకాలే పఠే త్తుయః,
లోకత్రయగురు స్తస్మై దద్యా దాత్మపదం హరిః. ౪౪

తా. పవిత్రములైన యీమూఁడు శ్లోకములను ప్రాతఃకాలమునఁ బఠించువానికి మూఁడులోకములకును గురుండగు విష్ణుభగవానుఁడు తన శాశ్వతమైన పదము నిచ్చును.

౧౦. రా మ స్మ ర ణ.

శ్లో. ప్రాతఃస్మరామి రఘునాథముఖారవిందం
మందస్మితం మధురభాషి విశాలఫాలమ్,
కర్ణావలంబి చల కుండలశోభిగండం
కర్ణాంతదీర్ఘ నయనం నయనాభిరామమ్. ౪౫

తా. చిఱునగవు గలదియు, మధురమైన పలుకులు గలదియు, విశా లమైన నుదురు గలదియు, చెవులయందు వ్రేలుచుఁ జలించు కుండల ములచేఁ బ్రకాశించు చెక్కులు గలదియు, చెవులవఱకును వ్యాపించిన పెద్ద కన్నులుగలదియు, నేత్రములకు మనోహరమైనదియు నగు శ్రీరా మ భగవానుని ముఖపద్మమును ప్రాతఃకాలమున స్మరించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్భజామి రఘునాథ కరారవిందం
రక్షోగణాయ భయదం వరదం నిజేభ్యః,
యద్రాజసంసది విభజ్య మహేశచాపం
సీతాకర గ్రహణ మంగళ మాప సద్యః. ౭౬

తా. రాజాధి రాజులందఱును జూచుచుండఁగా శివుని విల్లువిరిచి వెంటనే సీతాపాణిగ్రహణ మంగళమును బొందినదియు, రాక్షసులకు భయంకరమైనదియు, తనభక్తులకు అభయమిచ్చునదియు నగు శ్రీరామ భగవానునిహస్తపద్మమును ప్రాతఃకాలమున సేవించుచున్నాఁడను.

శ్లో. ప్రాతర్నమామి రఘునాథపదారవిందం
పద్మాంకుశాది శుభ రేఖ సుఖావహం మే,
యోగీంద్రమానసమధువ్రత సేవ్యమానం
శాపాపహం సపది గౌతమధర్మపత్న్యాః. ౭౭

తా. పద్మము అంకుశము మొదలైన శుభ రేఖలు గలదియు, నాకు సుఖమును గలుగఁ జేయునదియు, యోగీశ్వరుల మనస్సులనెడి తుమ్మెదలచే సేవింపఁబడుచుండు నదియు, వెంటనే గౌతముని భార్యయగు నహల్యకు శాపమును దొలఁగించినదియు నగు శ్రీరామ భగవానుని పాదపద్మమును ప్రాతఃకాలమున నమస్కరించుచున్నాఁడను.

శ్లో. ప్రాత ర్వదామి వచసా రఘునాథనామ
వాగ్దోషహారి సకలం శమలంకరోతి,
యత్పార్వతీ స్వపతినా సహభోక్తుకామా
ప్రీత్యా సహస్రహరినామసమం జజాప. ౭౮

తా. వాగ్దోషముల హరించునదియు, సకల సుఖములఁ గలిగించునదియు, పార్వతీ పరమేశ్వరులచే నానంద మనుభవించుకొఱకుఁ బ్రేమచే విష్ణుసహస్రనామములతో సమముగా జపింపఁబడుచుండునదియు నగు శ్రీరామ భగవానుని నామమును ప్రాతఃకాలమున వాక్కుచేఁ బలుకుచున్నాఁడను.

శ్లో. ప్రాతః శ్రయే శ్రుతినుతాం రఘునాథమూర్తిం
నీలాంబుజోత్పల సితేతర రత్న నీలామ్,

ఆముక్తమౌక్తిక విశేష విభూషణాఢ్యాం
ధ్యేయాం సమస్తమునిభిర్జనముక్తిహేతుమ్. ౪౯

తా. వేదములచే స్తుతిచేయఁబడుచుండునదియు, నల్లని పద్మముతోడను నల్లకలువతోడను ఇంద్రనీల మాణిక్యముతోడను సమానమైననల్లని కాంతిగలదియు, ముత్యాలహారములతో నొప్పుచుండునదియు, మునులందఱిచేతను ధ్యానింపఁదగినదియు, తనభక్తులకు మోక్షకారణము నగు శ్రీరామ భగవానుని మూర్తిని ప్రాతఃకాలమున నాశ్రయించుచున్నాఁడను.

శ్లో. యః శ్లోకపంచక మిదం ప్రయతః పఠేత్తు
నిత్యం ప్రభాతసమయే పురుషః ప్రబుద్ధః,
శ్రీరామకింకరజనేషు స ఏవ ముఖ్యో
భూత్వా ప్రయాతి హరిలోక మనన్యలభ్యమ్. ౫౦

తా. నిత్యము ప్రాతఃకాలమున మేలుకొని యేపురుషుఁడు నియమముగానీయైదుశ్లోకములనుపఠించునో అతఁడే శ్రీరామ భగవానుని భక్తులలో ముఖ్యుఁడై యితరులకు దొరకని హరిలోకమునుబొందును.

౧౧ త్రిమూర్త్యాదిస్మరణ.

శ్లో. బ్రహ్మా మురారి స్త్రిపురాంతకారీ
భానుః శశీ భూమిసుతో బుధశ్చ,
గురుశ్చ శుక్రః శనిరాహుకేతవః
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. ౫౧

తా. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సూర్యాది నవగ్రహములును నాకు సుప్రభాతమును జేయుదురుగాక.

శ్లో. భృగు ర్వసిష్ఠః క్రతు రంగిరాశ్చ
మనుః పులస్త్యః పులహశ్చ గౌతమః,
రైభ్యో మరీచి శ్చ్యవన శ్చ దక్షః
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. ౫౨

తా. భృగువు, వసిష్ఠుఁడు, క్రతువు, అంగిరస్సు, మనువు, పులస్త్యుఁడు, పులహుఁడు, గౌతముఁడు, రైభ్యుఁడు, మరీచి, చ్యవనుఁడు, దక్షుఁడు వీరందఱును నాకు సుప్రభాతమును జేయుదురుగాక.

శ్లో॥ సనత్కుమారః సనకః సనందనః
సనాతనో ప్యాసురిపింగళౌ చ,
సప్త స్వరాః సప్త రసాతలాని
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. ॥౧౪

తా. సనత్కుమారుఁడు, సనకుఁడు, సనందనుఁడు, సనాతనుఁడు, ఆసురి, పింగళుఁడు, షడ్జము మొదలయిన సప్తస్వరములు, రసాతలము లేడును నాకు సుప్రభాతమును జేయుదురుగాక.

శ్లో. సప్తార్ణవాః సప్త కులాచలాశ్చ సప్తర్షయోద్వీపవనాని సప్త,
భూరాదికృత్వా భువనాని సప్త కుర్వన్తుసర్వే మమసుప్రభాతమ్.

తా. సప్తసముద్రములు, సప్తకులపర్వతములు, సప్తర్షులు, సప్తద్వీపములు భూలోకాది సప్తలోకములును నాకు సుప్రభాతముఁ జేయునుగాక.

శ్లో. పృథ్వీ సగన్ధా సరసా స్తథాఽపః
స్పర్శీ చ వాయు ర్జ్వలన స్స తేజాః,
నభః సశబ్దం మహతా సహైవ
కుర్వంతు సర్వే మమ సుప్రభాతమ్. ॥౧౬

తా. గంధముతోఁగూడిన భూమి, రసముతోఁగూడిన జలము, స్పర్శముతోఁగూడిన వాయువు, తేజస్సుతోఁగూడిన అగ్ని, శబ్దముతోఁగూడిన ఆకాశము మహత్తత్త్వము నాకు సుప్రభాతమును జేయునుగాక.

శ్లో. ఇత్థం ప్రభాతే పరమం పవిత్రం
పఠేత్స్మరేద్వా శృణుయాచ్చ నిత్యమ్,
దుఃఖప్రణాశ స్త్విహ సుప్రభాతం
భవేచ్చ నిత్యం భగవత్ప్రసాదాత్. ॥౧౭

తా. ఇట్లు నిత్యమును ప్రాతఃకాలమందు పరమపవిత్రమైన దీనిని పఠించినను స్మరించినను విన్నను భగవంతునియనుగ్రహమున దుఃఖములు పోయి సుప్రభాత మగును.

౧౨ రాజర్ష్యాదిస్మరణ.

శ్లో. పుణ్యశ్లోకో నలో రాజాపుణ్యశ్లోకో యుధిష్ఠిరః
పుణ్యశ్లోకా చవైదేహీ పుణ్యశ్లోకో జనార్దనః. ॥౧౮

తా. నలచక్రవర్తి, ధర్మరాజు, సీతాదేవి, జనార్దనుఁడు వీరుపవిత్రకీర్తిగలవారు గావున వీరిని ప్రాతఃకాలమున స్మరింపవలె ననుట.

శ్లో. కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ,
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్. ౫౯

తా. కర్కోటక నాగముయొక్కయు దమయంతియొక్కయు నలకచక్రవర్తియొక్కయు రాజర్షియగు ఋతుపర్ణునియొక్కయు స్మరణము కలినాశనమని యెఱుఁగవలయును.

శ్లో. అశ్వత్థామా బలి ర్వ్యాసో హనూమాంశ్చ విభీషణః,
కృపః పరశురామ శ్చసప్తైతే చిరజీవినః ౬౦

శ్లో. సప్తైతాన్ సంస్మరే న్నిత్యం మార్కండేయ మథాష్టమమ్,
జీవే ద్వర్షశతం సాగ్ర మపమృత్యువివర్జితః ౬౧

తా. అశ్వత్థామ, బలిచక్రవర్తి, వ్యాసభగవానుఁడు, హనుమానుఁడు, విభీషణుఁడు, కృపాచార్యుఁడు, పరశురాముఁడు, అను నీయేడ్గురును మార్కండేయుఁడును చిరకాలజీవులు గనుక వీరిని నిత్యమును ప్రాతఃకాలమున స్మరించుచుండవలయును. అట్లు తప్పక స్మరించువారు అపమృత్యువర్జితులై నూఱుసంవత్సరములు జీవింతురు.

శ్లో. ప్రహ్లాదనారదపరాశరపుండరీక
వ్యాసాంబరీషశుకశౌనకభీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జునవసిష్ఠవిభీషణాదీన్
పుణ్యా నిమాన్ పరమభాగవతాన్ స్మరామి. ౬౨

తా. పవిత్రులును పరమభాగవతోత్తములును నగు ప్రహ్లాదుఁడు, నారదుఁడు, పరాశరుఁడు, పుండరీకుఁడు, వ్యాసభగవానుఁడు, అంబరీషుఁడు, శుకుఁడు, శౌనకుఁడు, భీష్ముఁడు, దాల్భ్యుఁడు, రుక్మాంగదుఁడు, అర్జునుఁడు, వసిష్ఠుఁడు, విభీషణుఁడు మొదలగువారిని ప్రాతఃకాలమున స్మరించుచున్నాఁడను.

శ్లో. ధర్మో వివర్ధతి యుధిష్ఠిరకీర్తనేన
పాపం ప్రణశ్యతి వృకోదరకీర్తనేన,

శత్రు ర్వినశ్యతి ధనంజయకీర్తనేన
మాద్రీసుతౌ కథయతాం న భవన్తి రోగాః. ౬౩

తా. ధర్మరాజును కీర్తించినచో ధర్మము వృద్ధియగును. భీముని కీర్తించిన పాపము నశించును, అర్జునుని కీర్తించిన శత్రునాశనమగును. నకులసహదేవులఁ గీర్తించినవారికి రోగములు రావు.

శ్లో. అహల్యా ద్రౌపదీ సీతా తారా మందోదరీ తథా,
పంచకం నా స్మరే న్నిత్యం మహాపాతకనాశనమ్. ౬౪

తా. అహల్య, ద్రౌపది, సీత, తార, మందోదరి యనునైదుగురిని మనుష్యుఁడు నిత్యముస్మరింపుచుండెనేని మహాపాపములునశించును.

శ్లో. కశ్యపోఽత్రి ర్భరద్వాజో విశ్వామిత్రోఽథ గౌతమః,
జమదగ్ని ర్వసిష్ఠ శ్చ సాధ్వీ చైవా ప్యరుంధతీ. ౬౫

తా. కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు పతివ్రతయగు నరుంధతి వీరిని ప్రాతఃకాలమున స్మరింపవలెనను.

౧౩ కాశీస్మరణ.

శ్లో. విశ్వేశో జనకో హ్యుమా చ జననీ గంగా చ మాతృష్వసా
ఢుంఢి-భైరవదండపాణిసదృశా జ్యేష్ఠా మమ భ్రాతరః,
శ్రీకాశీ మణికర్ణికా చ భగినీ భార్యా మమేయం మతిః.
సత్కర్మాణి సుతా స్తథైవ సుహృదః కాశ్యాం కుటుంబం మమ.

తా. నాకు విశ్వేశ్వరుఁడు తండ్రి, అన్నపూర్ణతల్లి, గంగపినతల్లి, ఢుంఢిభైరవుఁడు దండపాణి మొదలగువారు అన్నలు, కాశి, మణికర్ణిక అక్కలు, ఈనామతిభార్య, సత్కర్మములు కొడుకులు, వారే స్నేహితులు, కావున నాకుటుంబమంతయు కాశిలోనున్నది యనుట.

శ్లో. కాశీ! కాశీతి కాశీతి త్రివారం యః పఠే న్నరః,
సోఽపి దేశాంతరే వాసీ కాశీవాసఫలం లభేత్. ౬౬

తా! కాశీ! కాశీ! కాశీ! అనియెవఁడు మూఁడుమాఁటులు పఠించునోవాఁడు దేశాంతరమందున్నను కాశీవాసఫలమును బొందును.

శ్లో. అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహమ్,
ఇతి బ్రువాణః సతతం కాశీవాసఫలం లభేత్. ౬౭

తా. "నేను కాశినిగూర్చి వెళ్లెదను, అచ్చటనే వసింతును,, అని యెప్పుడును పలుకువాఁడు కాశీవాసఫలమును బొందును.

శ్లో. వారాణస్యా దక్షిణేఽంగే కుక్కుటో నామ వై ద్విజః,
తస్య స్మరణమాత్రేణ దుస్స్వప్న స్సుఖదో భవేత్. ౧౯

తా. వారాణసికి దక్షిణభాగమున కుక్కుటుఁ డను బ్రాహ్మణుఁడు గలఁడు. వానిని ప్రాతఃకాలమున స్మరించినమాత్రమున రాత్రి వచ్చిన దుస్స్వప్నము శుభప్రదమగును.

శ్లో. వారాణస్యుత్తరే భాగే సుమంతు ర్నామ వై ద్విజః,
తస్యస్మరణమాత్రేణ నిర్ధనో ధనవాన్ భవేత్. ౨౦

తా. వారాణసి కుత్తరభాగమున సుమంతుఁడను బ్రాహ్మణుఁడు గలఁడు. వానిని ప్రాతఃకాలమున స్మరించినమాత్రమున నిర్ధనుఁడు ధనవంతుఁడగును.

శ్లో. కాశ్యాం తు భైరవో దేవః సంసారభయనాశకః,
అనేకజన్మజం పాపం స్మరణేన వినశ్యతి, ౨౧

తా. కాశియందలి కాలభైరవుఁడు సంసారమువలని భయమును నశింపఁజేయువాఁడు. ఆదేవునిస్మరించినచోఅనేకజన్మములనుండి సంచితమైన పాపము నశించును.

శ్లో. విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణిం చ భైరవమ్,
వందే కాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికామ్. ౨౨

తా. విశ్వేశ్వరుని మాధవుని, ఢుంఢిని, దండపాణిని, భైరవుని, కాశిని, గుహను, గంగను, అన్నపూర్ణను, మణికర్ణికను నమస్కరించుచున్నాఁడను.

౧౪ భగవద్భక్తాదిస్మరణ.

శ్లో. బలిర్విభీషణో భీష్మః ప్రహ్లాదో నారదో ధ్రువః,
షడేతే వైష్ణవాః ప్రోక్తాః స్మరణం పాపనాశనమ్. ౨౩

తా. బలిచక్రవర్తి, విభీషణుఁడు, భీష్మాచార్యులు, ప్రహ్లాదుఁడు, నారదుఁడు, ధ్రువుఁడు నను నీయాఱుగురును విష్ణుభక్తులని చెప్పఁబడిరి గావున వీరిని స్మరించినచో పాపములు నశించును.

శ్లో. హరిం హరం హరిశ్చంద్రం హనూమంతం హలాయుధమ్,
ఏతేషాం స్మరణా త్ప్రాత ర్హాని స్తస్య నవిద్యతే. ౭౪

తా. హరిని, హరుని, హరిశ్చంద్రుని, హనుమంతుని, హలాయుధుని ప్రాతఃకాలమున స్మరించినచో వానికి హానిపలనిబాధ లేదనుట.

శ్లో. సోమనాథం వైజనాథం ధన్వంతరి మథాశ్వినౌ,
ఏతేషాం స్మరణా త్ప్రాత ర్వ్యాధి స్తస్య నవిద్యతే. ౭౫

తా. సోమనాథుని, వైజనాథుని, ధన్వంతరిని, అశ్వినీదేవతలను, ప్రాతఃకాలమున స్మరించిన వానికి వ్యాధి యుండదు.

శ్లో. కపిలాం కామధేనుంచ కల్పవృక్షం మణిం తథా,
సముద్రసహితాం లక్ష్మీం కుబేరం చోషసి స్మరేత్. ౭౬

తా. కపిలగోవును, కామధేనువును, కల్పవృక్షమును, కౌస్తుభమాణిక్యమును, క్షీరసముద్రునితోఁగూడ లక్ష్మిని, కుబేరుని ప్రాతఃకాలమునస్మరించునది.

శ్లో. నారాయణేతి వాగ్వల్లీ చతురక్షరపల్లవా,
ధర్మార్థకామమోక్షాఖ్యఫలదా నాత్ర సంశయః ౭౭

తా. నారాయణా అనువాగ్రూపమైన తీఁగ నాలుగక్షరములను చిగుళ్లుగలది, అది ధర్మార్థకామమోక్షములను పేరుగల ఫలముల నిచ్చును. ఇందు సందియములేదు.

శ్లో. యత్ర యోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీ ర్విజయో భూతిర్ధ్రువా నీతి ర్మతి ర్మమ. ౭౮

తా. యోగీశ్వరుఁడగు శ్రీకృష్ణభగవానులును ధనుర్ధరుఁడగు నర్జునుఁడును నెచట నుందురో అచ్చట లక్ష్మి, జయము, ఐశ్వర్యము, నీతి ఉండునని నానిశ్చయము.

౧౫ అనంతాదిస్మరణ.

శ్లో. అనంతో వాసుకిః శేషః పద్మనాభ శ్చ కంబళః,
శంఖపాలో ధృతరాష్ట్ర స్తక్షకః కాళియ స్తథా. ౮౧
ఏతేషాం నవ నామాని నాగానాం చ మహాత్మనామ్,
సాయంకాలే పఠే న్నిత్యం ప్రాతఃకాలే విశేషతః,
విషా త్తస్య భయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్. ౮౨

తా. అనంతుఁడు, వాసుకి, శేషుఁడు, పద్మనాభుఁడు, కంబళుఁడు, శంఖపాలుఁడు, ధృతరాష్ట్రుఁడు, తక్షకుఁడు, కాళియుఁడు, అను నీ మహాత్ములైన తొమ్మండ్రు పాములను నిత్యమును సాయంకాలమున విశేషముగా ప్రాతఃకాలమున స్మరించిన వానికెందుఁ బోయినను విషభయము లేదు. జయము గలుగును.

శ్లో. కోణస్థః పింగళో బభ్రుః కృష్ణో రౌద్రోఽంతకో యమః,
సౌరిః శనైశ్చరో మందః పిప్పలాదేన సంస్తుతః. ౮౩
ఏతాని దశ నామాని ప్రాత రుత్థాయ యః పఠేత్,
శనైశ్చరకృతా పీడా న కదాచి ద్భవిష్యతి. ౮౪

తా. కోణస్థుఁడు, పింగళుఁడు, బభ్రువు, కృష్ణుఁడు, రౌద్రుఁడు, అంతకుఁడు, యముఁడు, సౌరి, శనైశ్చరుఁడు, మందుఁడు, పిప్పలాదుఁడను మునిచే స్తుతింపఁబడు వాఁడు, అను నీ పదినామములను ప్రాతఃకాలమునఁ బఠించినవానికి శనైశ్చరుఁడుచేయుబాధ యెప్పుడును గలుగదు.

శ్లో. సౌరఠేసోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునమ్,
ఉజ్జయిన్యాం మహాకాళ మోంకారే త్వమరేశ్వరమ్ ౮౫
పరేల్యాం వైజనాథం చ డాకిన్యాం భీమశంకరమ్,
సేతుబంధేతు రామేశం నాగేశం దారుకావనే. ౮౬
వారాణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే,
హిమాలయేతు కేదారం ఘృష్ణేశంతు శివాలయే. ౮౭
ఏతాని జ్యోతిర్లింగాని ప్రాతరుత్థాయ యః పఠేత్.
బ్రహ్మహత్యాదికం పాపం నశ్యత్యేవ నసంశయః.

తా. సౌరఠి యనుచోటనున్న సోమనాథుని, శ్రీశైలమునందున్న మల్లికార్జునుని, ఉజ్జయినిలో నున్న మహాకాళేశ్వరుని, ఓంకారస్థానమందలి అమరేశ్వరస్వామిని, పరేలియందలి వైజనాథస్వామిని, డాకిని యను స్థలమందున్న భీమశంకరుని, సేతుబంధ (రామేశ్వర) మునందలి రామనాథస్వామిని, దారుకావనమందలి నాగేశ్వరస్వామిని, కాశీవిశ్వేశ్వరుని, గోదావరియొడ్డుననున్న త్ర్యంబకస్వామిని, హిమవత్పర్వతముపై నున్న కేదారేశ్వరుని, శివాలయమను చోట వెలసిన ఘృష్ణే

శ్వపని ప్రాతఃకాలమునందు పఠించినవానికి బ్రహ్మహత్యాది పాపము తప్పక నశించును. ఏమనఁగా నివిజ్యోతిర్లింగము లఁట.

శ్లో. హరే! రామ! హరే! రామ! రామ! రామ! హరే! హరే!
హరే! కృష్ణ! హరే! కృష్ణ! కృష్ణ! కృష్ణ! హరే! హరే! ౮౯

శ్లో. కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే,
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః. ౯౦

శ్లో. అచ్యుతం కేశవం రామ నారాయణం
కృష్ణదామోదరం వాసుదేవం హరిం
శ్రీధరం మాధవం గోపికావల్లభం
జానకీనాయకం రామచంద్రం భజే. ౯౧

తా. అతిసులభమని వ్రాయలేదు.

శ్లో. సాంద్రానంద మనంత మవ్యయ మజం యద్యోగినోఽపీక్షణం
సాక్షాత్కర్తుముపాసతే ప్రతిముహు ర్ధ్యానైకతానాః పరమ్,
ధన్యాస్తా మధురాపురీయువతయ స్తద్బ్రహ్మ యాః కౌతుకా
దాలింగంతి సమాలపంతి బహుధా కర్షంతి చుంబంతిచ. ౯౨

తా. ఆనందప్రచురమును, అంతము లేనిదియు, నాశము లేనిదియు, పుట్టువు లేనిదియు, నగు నే బ్రహ్మమును యోగీశ్వరులుగూడఁ బ్రతిక్షణముసు మాటిమాటికిని మిక్కిలిగా ధ్యానాసక్తులై ప్రత్యక్షము చేసికొనుటకై యుపాసించుచుందురో అట్టిబ్రహ్మమును సంతోషమువలన అనేకవిధములుగా మధురాపట్టణములో నుండు స్త్రీలు కౌగిలించుకొనుచున్నారు, సల్లాపము లాడుచున్నారు, ఇచ్చవచ్చిన నుచ్చిన విచ్చలవిడిగాఁ బెచ్చురేగిలాగుకొనుచున్నారు. ముద్దులాడుచున్నారు. అహాహా! అదృష్టవతులనఁగా వారు గదా!

శ్లో. సుకృతం నకృతం కించి ద్దుష్కృతం బహు ధాకృతమ్,
నజానే జానకీజానే యమాహ్వానే కిముత్తరమ్. ౯౩

తా. నేను పుణ్యమించుకయు చేయలేదు సరియే కదా అనేకవిధములైన పాపములఁ జేసితిని. జానకీవల్లభుఁడవగు ఓరామ! యముఁడు పిల్చి యడిగినప్పు డేమిచెప్పవలెనో నాకు తెలియదు. (తెలియనిచో నేను చెప్పెదనువినుము. నీవు పుణ్యము చేయకకాపలపెనన్ని పాప

ములుచేసినను ఒక్కమూరైనను రామా అని ఉచ్చరించితివి గనుక "శ్లో. రాశబ్దో చ్చారమాత్రేణ ముఖా న్నిర్యాంతి పాతకాః, పునః ప్రవేశాభావాయ మశబ్దస్తు కవాటవత్" అనఁగా రా అని ఉచ్చరించిన మాత్రముననే చేసిన పాపము లన్నియు నోటినుండి వెడలిపోవును. మరల ప్రవేశింప కుండుటకు మశబ్దము తలుపువంటిది అనుప్రమాణమును బట్టి యమునికి నిన్ను పిలుచుట కధికారమే లేదు గనుక "ఓరి యముఁడా! నన్ను పిలుచుటకు నీకధికారము లేదురా" అని బదులు చెప్పుము.

---

ఋగ్వేదములోని ప్రాతస్సూక్తములు

1. మూ. ప్రాతరగ్నిం ప్రాతరింద్రం హవామహే ప్రాత ర్మిత్రావరుణా ప్రాత రశ్వినా। ప్రాత ర్భగంపూషణం బ్రహ్మణస్పతిం ప్రాత స్సోమ ముతరుద్రం హువేమ॥

తా. మేము ఉషఃకాలమునందు అగ్నిని ఇంద్రుని (అహోరాత్రాభిమాని దేవతలగు) మిత్రావరుణులను (దేవవైద్యులగు) అశ్వినులను భగుని పూషను (మంత్రాభిమానియగు) బ్రహ్మణస్పతిని సోముని రుద్రుని (స్తుతిచేయుచు) పిలుచుచున్నారము.

2. మూ. ప్రాతర్జితం భగముగ్రం హువేమ వయంపుత్ర మదితేర్యో విధర్తా। ఆధ్రశ్చి ద్యం మన్యమాన స్తురశ్చి ద్రాజాచి ద్యం భగంభక్షీత్యాహ॥

తా. ఎవఁడీగసంబను జగంబును ధరించుచున్నాఁడో, ఎవఁడు (ఎల్లప్పుడు) జయించుచుండునో, స్వభావంబుగాఁగలవాఁడో, ఎవనిని దరిద్రుఁడైనను ధనవంతుఁడగు రాజైనను అభీష్టపెద్దికై యాచించుచుండునో అట్టిభగుని ఉషఃకాలమునందే (స్తుతిచేయుచు) పిలుచుచున్నారము.

3. మూ. భగ ప్రణేత ర్భగ సత్యరాధో భగేమాం ధియ ముదవా దద న్నః। భగప్రణో జనయ గోభి రశ్వై ర్భగ ప్రనృభి ర్నృవంత స్స్యామ॥3

తా. ఓభగుఁడా! నీవేప్రధానుఁడవు. నీవేసత్యధనుఁడవు. నీవు మేము కోరుచున్న వాంఛితముల నూఁకు నొసంగి మాస్తుతిని సఫలముగ

నొనర్పుము. నీవు గోవులు అశ్వములు మున్నగువానితో మమ్ములను సమృద్ధిగలవారలనుగ నొనర్పుము. నీయనుగ్రహముచేత మేము పుత్రపౌత్రాదులు కలిగి యుందుముగాక.

4. మూ. ఉతేదానీంభగవంతస్స్యామోత ప్రపిత్వ ఉత మధ్యేఅహ్నాం।
ఉతోదితా మఘవన్ త్సూర్యస్య వయం దేవానాం సుమతౌస్యామ॥

తా. ఓభగుఁడా! మఱియు మేమీయుషఃకాలమునందును పూర్వాహ్ణమునందును మధ్యాహ్నమునందును ధనవంతులమయి (లేక భగుని యనుగ్రహముకలిగినవారలమయి) యుందుముగాక. ధనవంతుఁడవగు ఓభగుఁడా ! సూర్యోదయ సమయమందు ఇంద్రాది దేవతలందఱు నీయనుగ్రహమువలన మాయందు దయగలిగియుందురుగాక.

5. మూ. భగ ఏవ భగవాఁ అస్తు దేవా స్తేన వయంభగవంత స్స్యామ।
తం త్వా భగ సర్వఇజ్జోహవీతి సనోభగపుర ఏతా భవేహ॥

తా. ఓ దేవతలారా ! భగుఁడే ధనవంతుఁడగుగాక. అతని (యనుగ్రహము) చేతనే మేమును ధనవంతులమయ్యెదము. ఓభగుఁడా! జనులందఱు నిన్నే ఎల్లప్పుడు (స్తుతిచేయుచు ఇష్టసిద్ధికై) పిలిచెదరు. ఓ భగుఁడా నీవిప్పుడు మాకు ఎదుట నిలుచుము.

6. మూ. సమధ్వరా యోషసో నమన్త దధిక్రా వేవ శుచయే పదాయ।
అర్వాచీనం వసువిదం భగం నో రథ మివాశ్వా వాజిన ఆవహంతు॥

తా. ఉషఃకాలదేవతపవిత్రమును గమనయోగ్యమునగు ప్రదేశమునకు అశ్వమువలె మాయాగప్రదేశమునకు వచ్చుగాక. ఉషఃకాల దేవత జవనశీలంబులగు అశ్వంబులు రథమునువలె ధనప్రాపకుఁడగు భగుని మాకభిముఖముగ తీసికొనివచ్చుగాక.

7. మూ. అశ్వావతీ ర్గోమతీర్న ఉషాసో వీరవతీ స్సద ముచ్ఛంతు భద్రాః । ఘృతం దుహానా విశ్వతః ప్రపీతా యూయం పాత స్వస్తిభి స్సదా నః॥

1—7 (ఋ. సం. అష్ట. 5. 4. 8. ఋ. సం. మం. 7. 3. 41.)

తా. కొనియాడఁదగిన యుషఃకాలదేవతలు ఉదకముచే తడుపుచు సకలగుణసమృద్ధికలవై అశ్వములు గోవులు పుత్రాది జనములు వీనితోడఁ కలిసి మాకుగల యంధకారమును పోగొట్టుగాక, (ఈసూక్తమునందు చెప్పఁబడిన) ఓ దేవతలారా! మీరందఱు మమ్ములను కల్యాణవంతులనుగ పరిపాలింపుఁడు.

8. మూ. ప్రాతర్యావాణా ప్రథమా యజధ్వం పురా గృధ్రా దరరుషః పిబాతః। ప్రాత ర్హి యజ్ఞ మశ్వినా దధాతే। ప్రశంసంతి కవయః పూర్వభాజః॥

తా. ఓ ఋత్విక్కులారా! ప్రాతఃకాలమునందే యజ్ఞములను గూర్చి పోవువారలెౌటచే ప్రథములుగా పరిగణింపఁబడు అశ్వినులను పూజింపుఁడు. అశ్వినులు ప్రాతఃకాలమునందే యజ్ఞమునకు వత్తురని షడంగవిదులగు ప్రాచీన మహర్షులు ప్రశంసించుచున్నారు.

9. మూ. ప్రాత ర్యజధ్వ మశ్వినా హినోత న సాయ మస్తి దేవయా అజుష్టం। ఉతా న్యో అస్మద్యజతే విచావః పూర్వః పూర్వో యజమానో వనీయాన్॥

తా. ఓమానవులారా! మీరు ప్రాతఃకాలమునందే అశ్వినులను పూజచేసి హవిస్సులను ఇవ్వఁడు. సాయంకాలమునందిచ్చిన హవిస్సు దేవతలకు చెందదు. ఎవఁడు ప్రథమమున పూజచేసి హవిస్సునిచ్చునో వానియందు దేవతలు మక్కువకలిగి యుందురు. కాన ఇతరుల కంటె ముందుగ మనమే దేవతలకు హవిస్సు నిచ్చెదము.

10. మూ. హిరణ్యత్వ జ్మధువర్ణో ఘృతస్నుః పృక్షో వహ న్నా రథో వర్తతే వాం। మనోజవా అశ్వినా వాతరంహా యేనాతి యాథో దురితాని విశ్వా॥

తా. ఓఅశ్వినులారా! బంగారు తొడుపు కలిగియుంటచే చూచుటకు కన్నులపండువుగ నున్నట్టియు, ఉదకమును స్రవించునట్టియు వాయువేగ మనోవేగములతో దుర్గమ ప్రదేశములనుకూడ అనాయాసముగ నతిక్రమించి పోవుచుండెడి మీరథము అమృతమును ధరించి మాకభిముఖముగ వచ్చుచున్నది.

11. మూ. యో భూయిష్ఠం నాసత్యాభ్యాం వివేష చనిష్టంపిత్వో రరతే విభాగే। స తోకమస్య పీపరచ్ఛమీభిరనూర్ధ్వభాసస్సదమిత్తుతుర్యాత్॥

తా. అశ్వినులకు హవిస్సునిచ్చెడి యాగములందే యజమానుఁడు విశేషముగ అన్నరూపమగు హవిస్సునిచ్చునో వాఁడు తనసంతానమునకు అన్నమునిచ్చి పోషించుకొనినట్లేయగు. అగ్నులు కర్మలనొనర్చు చు ఊర్ధ్వజ్వాలలుగ తమ్ముఁ బ్రజ్వలింపఁజేయనివారల నెల్లప్పుడు హింసించును. (అనగా హోమాదికము నొనర్పని యజమానులను అగ్నులు హింసించును).

12. మూ. స మశ్వినో రవసా నూతనేన మయోభువా సుప్రణీతీ గమేమ। ఆ నో రయిం వహత మోతవీరానా విశ్వాన్యమృతా సౌభగాని॥౫॥

౮—౧౨ (ఋ. సం. అష్ట. ౪. ౪. ౧౮. ఋ. మం. ౫ ౬. ౭౭.)

తా. మేము అశ్వినీదేవతలయొక్క నూతనమైన పరిపాలనముచేతను, సుఖమును కలుగఁజేయు ఆగమనముచేతను కూడుకొన్నవారలమగుదుముగాక. మాకొఱకు ధనమును మఱియు వీరులగు పుత్రాదులను ధరింతురుగాక. మరణధర్మములేని యోయశ్వినులారా! సకలమంగళములను ఇవ్వుఁడు.

"ప్రాతారథ" ఇతి నవర్చస్య సూక్తస్య గృత్సమద ఇంద్రః త్రిష్టుప్।

13. మూ. ప్రాతా రథో నవో యోజిసస్ని శ్చతుర్యుగ స్త్రికశ స్సప్తరశ్మిః। దశారిత్రో మనుష్యః స్వర్షా స ఇష్టిభి ర్మతిభీ రంహ్యో భూత్॥

తా. పరిశుద్ధమగు యజ్ఞము నిప్పుడే మేముప్రకటించితిమి. ఈ యజ్ఞము అధ్వర్యు, హోతృ, బ్రహ్మాగ్నీధ్రాది చతుష్టయయుక్తమును, ప్రాతర్మధ్యందిన సాయంసవనయుతమును, గాయత్ర్యాది సప్తవిధ ఛందోమయమును, దశసంఖ్యాక గ్రహసంయుతమును, స్వర్గప్రాపకమగుటచే మనుష్యులకు హితకరమును అయియున్నది. ఇట్టియజ్ఞము ప్రాయణీయాదీష్టులచేతను స్తోత్రములచేతనుకొనియాడఁబడుచున్నది.

14. మూ. సాస్మా అరం ప్రథమం స ద్వితీయ ముతో తృతీయం మనుష స్సహోతా। అన్యస్యా గర్భ మన్య ఊ జనన్త సో అన్యేభి స్సచతే జేన్యోవృషా॥ ౨॥

తా. ఓయింద్రుడా ఈయజ్ఞమునీకు ప్రాతస్సవనమునందు తృప్తికరమగుగాక. మధ్యందిన తృతీయసవనములందును తృప్తికరమగునది యగుగాక. యజ్ఞమే మనుష్యులయొక్క శుభములనుభరించుచున్నది.

15. మూ. హరీనుకం రథ ఇన్ద్రస్య యోజమాయై సూక్తేన వచసా నవేన। మోషు త్వా మత్ర బహవో హి విప్రా నిరీరమ న్యజమానాసో అన్యే॥ ౩॥

తా. ఇంద్రుని యొక్క రథమునందు సుఖముగను శీఘ్రముగను పోవుటకొఱకు ఇతరులెఱుంగని వేదమంత్రాభి మంత్రణపూర్వకముగ అశ్వములను పూన్చెదను. ఈయజ్ఞమునందు మేధావులగు విప్రులెందఱో స్తుతిచేయుదురు. అయినను నావలెవారు నిన్ను సంతోషపెట్టఁజాలరు కావున నాయజ్ఞమునకే నీవురమ్ము.

16. మూ. ఆద్వాభ్యాం హరిభ్యామింద్ర యాహ్యా చతుర్భి రా షడ్భి ర్హూయమానః। అష్టాభి ర్దశభి స్సోమపేయ మయం సుత స్సుముఖ మామృధస్కః॥ ౪॥

తా. ఓఇంద్రుడా! నీవు హోతలచే పిలువఁబడినవాఁడవై యజ్ఞమునందు సోమపానముచేయుటకు రెండుగుఱ్ఱములతోడను లేక నాలుగు ఆఱు ఎనిమిది పది గుఱ్ఱములతోడనురమ్ము. ఈసోమలతనీకొఱకే అభిషవము చేయఁబడుచున్నది. కావున దీనికివిఘ్నమును సలుపకుము.

17. మూ. ఆ వింశత్యా త్రింశతా యాహ్యర్వాఙ్ఛత్వారింశతా హరిభి ర్యుజానః। ఆ పఞ్చాశతా సురథేభి రింద్రా షష్ట్యా సప్తత్యా సోమపేయం॥ ౫॥

తా. ఓఇంద్రుడా! ఈసోమపానమును చేయుటకు మాకెదురుగ ఇరువదియశ్వములతో రమ్ము. మఱియు ముప్పది, నలువది, యశ్వము లతో కూడుకొని రమ్ము. చక్కని నడకగల ఏబదిగుఱ్ఱములతోడను లఱువది డెబ్బది యశ్వములతోడను సోమపానముకొఱకు రమ్ము

18. మూ. ఆశీత్యా నవత్యా యాహ్యర్వాఙాశతేన హరిభి రుహ్యమానః!
అయం హి తే శునహోత్రేషు సోమ ఇంద్రత్వాయా పరిషిక్తో
మదాయ॥౬॥

తా. (ఓఇంద్రుఁడా!) ఎనుబది గుఱ్ఱములచేత భరింపఁబడుచు సోమపానార్థము మాకభిముఖముగ రమ్ము. తొంబదినూరుసంఖ్యగల యశ్వములచేత వహింపఁబడుచు సోమపానార్థము రమ్ము. ఓఇంద్రుఁడా! నీ సంతోషము కొఱకు శునహోత్రము లనంబడు పాత్రలందు సోమరసము నింపబడినది.

19. మూ. మమ బ్రహ్మేంద్ర యాహ్యచ్ఛా విశ్వాహరీ ధురి ధిష్వా
రథస్య! పురుత్రా హివిహవ్యో బభూథాస్మి ఇన్ఛూర సవనే.
మాదయస్వ॥

తా. ఓఇంద్రుఁడా! నేచేయుస్తుతికి అభిముఖుఁడవై రమ్ము. వ్యాపించుఅశ్వములను రథము యొక్కయుగ్రప్రదేశమునకు కట్టుము. శూరుఁడవగునో ఇంద్రుడా! పలువురు యజమానులు నిన్నే పిలుతురు. ఈయజ్ఞమునకు వచ్చి సోమపానమొనర్చి సంతుష్టుఁడవుకమ్ము.

20. మూ. నమ ఇంద్రేణ సఖ్యం వియోషదస్మభ్యమస్య దక్షిణా దుహీత!
ఉప జ్యేష్ఠేవరూథే గభస్తౌ ప్రాయే ప్రాయే జిగీవాంస స్స్యామ॥

తా. ఇంద్రునితోడి నాకుగల సఖ్యమొకానొకప్పుడును విడిపోకుండును గాక. ఇంద్రుఁడిచ్చుదానము మాయభిమతముల నెఱవేర్చుగాక ప్రశస్యమయి ఆపన్నివారకంబగు ఇంద్రుని బాహువునకు సమీపమున నుందుముగాక. యుద్ధములందెల్లప్పుడు శత్రువుల జయించుదుము గాక॥

21. మూ. నూనం సా తే ప్రతివరం జరిత్రే దుహీయా దింద్ర దక్షిణా
మఘోనీ! శిక్షా స్తోతృభ్యో మాతిధ గ్భగో నో బృహద్వదేమ
విదథే సువీరాః॥

13-21 (ఋ. సం. అష్ట. 2. 6. 2?. 1. 9. ఋ. మ. 2. 2. 18. 1-9)

తా. ఓఇంద్రుఁడా స్తుతిచేయువారలకు ఇవ్వఁదగిన దక్షిణత్వత్సంబంధినియగు ధనముగలదై స్తోతకు అభిమతార్థము నొసంగుగాక కొనియాడఁదగిన నీవు మాకంటె ఇతరులకు దక్షిణను ఇవ్వకుము

లేక మాతలంపులను నాశనమొనర్చునము ) పుత్రపౌత్రాది సహిత
ముగ మేము యజ్ఞమునందు నిన్నే కొనియాడెదము.

22. మూ. ఏతా ఉ త్యా ఉషసః కేతు మక్రత పూర్వే అర్ధే రజసో
భాను మఞ్జతే। నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః ప్రతి
గావో ఒరుషీ ర్యన్తిమాతరః॥

తా. ఈయుషస్సులు అంధకారమును పారదోలి ప్రకాశమును కలి
గించెను. ప్రాగ్దిశయం దంతరిక్షలోకమునకు ప్రకాశమును కలుగఁ
జేయును. నిర్భీకులగు యోధులు తమయాయుధములను చికిలీచేయు
నట్లు యుషఃకాలదేవతలు తమప్రకాశముచేత జగంబును వెలిగింపఁజే
యుచు ప్రతిదినము సంచరించుచున్నవి. ఇట్టిదేవతలు మమ్మురక్షిం
చుగాక.

23. మూ. ఉ దపప్త న్నరుణా భానవో వృథా స్వాయుజో అరుషీ ర్గా
అయుక్షత। అక్ర న్నుషాసో వయునాని పూర్వథా రుశన్తం
భానుమరుషీ రశిశ్రయుః।

తా. ప్రకాశించుచున్న ఉషఃకాలకాంతులు అనాయాసముగ బ
యలువెడలుచున్నవి. సుఖముగరథమునందుకట్టుటకుతగిన కిరణము
లను రథమునకుపూన్చును. అట్టిరథమును ఎక్కిగడచినదినములందు
వలెనే ప్రాణులకు జ్ఞానమునుకలుగచేసి పిదపప్రకాశించు కిరణములు
సూర్యునాశ్రయించుచున్నవి.

24. మూ. అర్చన్తి నారీ రపసో న విష్టిభిః సమానేన యోజనేనా
పరావతః। ఇషం వహన్తీ స్సుకృతే సుదానవే విశ్వేదహ
యజమానాయ సున్వతే।

తా. పాలించు నుషఃకాలదేవతలు ఒక్కసమయమునందే కిర
ణములతోడ పశ్చిమదిక్కువఱకు వ్యాపించుచున్నారు. సత్కర్మలనొ
నర్చుచు యజ్ఞార్థముసోమలతను సంస్కరించుచు ఋత్విక్కులకు చ
క్కఁగదక్షిణనిచ్చు యజమానునికొఱకు అన్నాదికమునిచ్చుచున్నారు.

25. మూ. అధిపేశాంసి వపతే నృతూరివా పోర్ణుతే వక్ష ఉస్రేవ
బర్జహం।

జ్యోతి ర్విశ్వస్మై భువనాయ కృణ్వతీ గావో న వ్రజం వ్యుషా ఆవర్తమః॥

తా. ఉషఃకాలదేవత నర్తకివలె అందముచూడఁదగిన రూపములను తనయందిముడ్చుకొనుచున్నది. గోవు దోహనకాలమునందు పొదుగునువలె తనమధ్యభాగమును గనంబఱుచుచున్నది. గోవులుమందయందు వడిగవ్యాపించునట్టు లోకమునందు ప్రకాశమునువ్యాపింపఁజేసి అంధకారమును పోగొట్టుచున్నది.

26. మూ. ప్రత్యర్చీ రుశదస్యా అదర్శి వి తిష్ఠతే బాధతే కృష్ణ మభ్వమ్। స్వరుం న పేశో విదథే ష్వఞ్జఞ్చిత్రం దివో దుహితా భాను మశ్రేత్॥

తా. ఉషఃకాలకాంతిని అందఱు చూచుచున్నారు. ఈకాంతి నలుదిక్కుల వ్యాపించుచున్నది. పిదప గొప్పయంధకారమును పోగొట్టుచున్నది. అధ్వర్యుఁడు యజ్ఞములందు స్వరువుచేత యూపమునువలె స్వకీయకాంతిని ఆకాశమున వ్యాపింపఁజేయుచున్నది. అనంతరమునందు ద్యులోకజాతయగు ఉషస్సు విచిత్రముగనుండు సూర్యుని ఆశ్రయించుచున్నది.

27. మూ. అతారిష్మ తమస స్పార మస్యోషా ఉచ్ఛన్తీ వయునా కృణోతి। శ్రియే ఛన్దో న స్మయతే విభాతీ సుప్రతీకా సౌమనసా యాజీగః॥

తా. మేము అంధకారసముద్రమును దాటియొడ్డెక్కితిమి. ఉషఃకాలము అంధకారమును పోగొట్టుచు ప్రాణులకు తెలివినికలుగఁజేయుచున్నది. వశీకరణసమర్థుఁడగు పురుషుఁడు ఐశ్వర్యలయనుగ్రహార్థము చిరునగవునవ్వునటుల యుషఃకాలదేవత సంపూర్ణమై జనులకు మేలుకలుగఁజేయుటకు స్వచ్ఛకాంతిగలిగి చీఁకటినిమ్రింగెను.

28. మూ. భాస్వతీ నేత్రీ సూనృతానాం దివ స్తవే దుహితా గోతమేభిః। ప్రజావతో నృవతో అశ్వబుధ్యా నుషో గోఅగ్రా ఉప మాసి వాజాన్॥

తా. ప్రకాశించునదియు ప్రియమును సత్యమును అగు మాటలపలికించునదియు ద్యులోకమునుండి జన్మించినదియునగు ఉషఃకాలదేవతను గోతములను మేము కొనియాడుచున్నారము. ఓయుషఃకాలదే

తా! మాచేతకొనియాడబడినవానవై పుత్రపౌత్రాదియుతమునువ పరివారయుతమును అశ్వయుతమును గోసహితమును అగుఅన్నమును మాకు ఇవ్వుము.

29 మూ. ఉష స్తమశ్యాం యశసం సువీరం దాసప్రవర్గం రయిమశ్వ బుధ్యం। సుదంససా శ్రవసా య్యావిభాసి వాజప్రసూతా సుభగేబృహ స్తమ్।

తా. మంచిధనముగల ఓయుషఃకాలదేవతా! నీవుమాచేత కొనియాడ బడినదానవై కీర్తియుతమును పుత్రపౌత్రాది సహితమును. యానయుతమును, అశ్వములచే నూహింపఁబడినదియు, కీర్తికరమును దాసజ ధనమునుఇచ్చుచు ప్రకాశించుచున్నావు.

30 మూ. విశ్వాని దేవీ భువనాఽభిచక్ష్యా ప్రతీచీ చక్షు రుర్వియా విభాతి। విశ్వం జీవం చరసే బోధయ న్తీ విశ్వస్య వాచ మవిద స్మనాయోః॥

తా. ప్రకాశించుచున్న యుషఃకాలదేవత ప్రాణులసందఱను ప్రకాశింపఁజేసి పినప పశ్చిమముఖమై తేజస్సుచేత విశాలమై ప్రకాశించుచున్నది. మఱియు సకలప్రాణులను సంచరించుటకు మేలుకొలుపుచు మనుష్యసమూహమునకు వాక్కు-అను ప్రథనుపొందెను.

31 మూ. పునఃపునర్జాయమానాపురాణీసమానంవర్ణ మభిశుంభమానా! శ్వఘ్నీవకృత్నుర్విజఆమినానామర్తస్య దేవిజరయంత్యాయుః॥

తా. ప్రతిదినముపుట్టుచు చిరంతనమై ఒక్కరూపమునేపొంది ప్రకాశించుచున్న ఉషోదేవత (మనుష్యుల ఆయుష్షును నశింపఁజేయుచు హింసాశీలయగు కిరాతాంగన చలించుపక్షుల ఆయుష్షువలెనున్నది.

32 మూ. వ్యూర్ణ్వతీ దివో అన్తా అబోధ్యప స్వసారం సనుత ర్యుయోతి। ప్రమినతీ మనుష్యా యుగాని యోషా జారస్య చక్షసా విభాతి॥

తా. అంతరిక్షలోకముయొక్క సకలప్రాంతములను అంధకారరహితముగఁ జేయుచున్న ఉషఃకాలమునుఅందఱెఱింగిరి. ఈయుషఃకాలము రాత్రిని అంతర్ధానమొనర్చుచు మనుష్యసంబంధములగు కృతాదియుగములను క్షీణింపఁజేయుచు సూర్యునకు భార్యయగుచు కాంతిచేత ప్రకాశించుచున్నది.

33 మూ. పశూ న్న శ్చిత్రా సుభగా ప్రధానా సిన్ధు ర్న క్షోద ఉర్వియా వ్యశ్వైత్। అమినతీ దైవ్యాని వ్రతాని సూర్యస్య చేతి రశ్మిభి ర్దృశానా॥

తా. మంచిధనముకలిగి పూజనీయయగు యుషో దేవత గోపాలకుండరణ్యంబున పశువులనుమాడ్కి తేజమును వ్యాపింపఁజేయుచు విశాలముగల పల్లపునేలయందుదకమువలె వ్యాపించుచున్నది. ఆయుషో దేవతయే సూర్యకిరణములచేతఁ జూడఁబడుచున్నదై దేవతాసంబంధములగు (దర్శపూర్ణమాసాది) వ్రతములను నిర్బాధముగ ప్రవర్తిరపఁజేయుచున్నది.

34 మూ. ఉష స్త చ్చిత్ర మా భరా స్మభ్యం వాజినీవతి। యేన తోకం చ తనయం చ ధామహే॥

తా. అన్నప్రదాత్రివగు యోయుషఃకాలదేవతా! ఏధనముచేత పుత్రపౌత్రాదిధనమును పొందెదమో అట్టివిచిత్రధనమును మాకిమ్ము.

35 మూ. ఉషో అద్యేహ గోమ త్యశ్వావతి విభావరి। రేవ దస్మే వ్యుచ్ఛ సూనృతావతి॥

తా. గోవులును అశ్వములును విశేషకాంతియు కలిగి ప్రియసత్యవాక్కులుగల ఓయుషో దేవతా ఈప్రాతఃకాలమున ఇచటమాకు ధనవంతమగు కర్మయగునట్లు చీఁకటిని నివారింపుము.

36 మూ. యుక్ష్వా హి వాజినీవ త్యశ్వా అద్యారుణా ఉషః। అథా నో విశ్వా సౌభగా న్యావహ॥

ఋ. సం. అ. 1. 6. 23.

తా. అన్నములక్షణమగు అన్నముంగల ఓయుషఃకాల దేవతా! మాకిప్పుడు ఎఱ్ఱనిగోవులను కలిగింపుము. పిదపమాకు సకలసౌభాగ్యముల నొసంగూర్పుము.

---

ప్రాతఃకాలదర్శనీయములు.

శ్లో. శ్రోత్రియం సుభగం గాంచ అగ్నిం అగ్నిచితం తథా। ప్రాత రుత్థాయ యః పశ్యే దాపద్భ్యః స ప్రముచ్యతే॥

కాత్యాయన॥ అధ్యా 19. 9.

తా. ప్రాతఃకాలమునందు శ్రోత్రియుని, సజ్జనుని, గోవుని, అగ్నిని, అగ్నిహోత్రిని, చూచువానికి ఆపదలనుండి విముక్తి కలుగును.

అదర్శనీయాని (చూడఁదగనివి)

శ్లో. పాపిష్ఠం దుర్భగం చాన్ధం నగ్నం ముత్కృత్తనాసికమ్।
ప్రాతరుత్థాయ యఃపశ్యేత్ తత్కలేరుపలక్షణం॥

కాత్యా॥ 19. 10.

తా. పాపిని, దురదృష్టుని, గ్రుడ్డిని, దిగంబరుని కోయఁబడినముక్కు గలవానిని ప్రాతఃకాలమునఁగాంచువారలకు ఆపదలు సంభవించును.

భూప్రార్థనా (భూమిని ప్రార్థించుట)

శ్లో. సముద్రవసనే దేవి! పర్వతస్తనమండలే,
శ్లో. విష్ణుపత్ని! నమస్తుభ్యం పాదస్పర్శంక్షమస్వమే॥

మూత్రపురీషోత్సర్గవిధి.

౧. గ్రామమునకు ఉత్తరము, ఈశానము, నైరృతి, దక్షిణము, తూర్పు ఈదిక్కులలో జలము ఎక్కువగ ఉండు ప్రదేశమునంకు మలమూత్ర విసర్జనమునకు పోవలయును.

౨. తలకు వస్త్రము చుట్టుకొని ముక్కునోరు వీనిని వస్త్రముచేత ఆచ్ఛాదనముచేసి దేహమంతయు కప్పుకొని ఎండిన తృణకాష్ఠములచేత భూమిని కప్పి మలవిసర్జన మొనర్పవలయును.

ప్రమాణవచనములు.

శ్లో 1. తస్మాత్ పూర్వం సముత్థాయ ప్రాచీమేవోపనిష్క్రమేత్।
ఉదీచీం ప్రాగుదీచీం వా శౌచాచారక్రమాందిశం॥
యత్రోదకం ప్రభూతంతు తద్గత్వా శౌచమాచరేత్।
నైరృత్యాదిషువిక్షేప మతీత్యాభ్యధికంభవః।
గ్రామాదావసథాన్మూత్రపురీషంచ సమాచరేత్॥

2. అయుక్షీణై రనార్ద్రైశ్చ తృణై స్సంఛాద్య మేదినీం।
ఘ్రాణాస్యేవాససావేష్ట్య మలమూత్రం త్యజేద్బుధః॥ స్మృతిముక్తాఫలే

3. మలమూత్రములు విసర్జించునప్పుడు మౌనముగ నుండవలయును.

౪. యజ్ఞోపవీతమును కంఠమునందు వ్రేలాడవేసికొనియుండవలయును. ఏకవస్త్రుఁడైనయెడల కుడిచెవియందు యజ్ఞోపవీతమును వేసికొనవలయును.

౫. పగటియందు ఉత్తరముఖముగను, రాత్రియందు దక్షిణాభిముఖముగను, సాయంప్రాతఃకాలములందు ఉత్తరముఖముగను మూత్రపురీషోత్సర్జనమును చేయవలయును.

౬. కటికచీఁకటియందును, కొండలున్నగువాని అడ్డవలనసూర్యుఁడు గనంబడని తావులందును ప్రాణభీతియున్నగు సమయములందును వీలుననుసరించి యేముఖముగనైనను మూత్రపురీషోత్సర్జనము చేయువచ్చును.

౭ పగలు గృహంబునకు దూరముగను రాత్రిన్ని సమీపముగను మలమూత్రోత్సర్గనము నొనర్పవలయును.

తత్సమయ నిషేధకృత్యము.

౧. మార్గమునందును, భస్మమునందును, గోశాలయందును, దున్నిననేలయందును, నీటియందును, శ్మశానమునందును, పర్వతమునందును, జీర్ణదేవాలయమునందును, పుట్టయందును, జంతువు

3. వాచం నియమ్య యత్నేన ష్ఠీవనోచ్ఛ్వాసవర్జితః।
కుర్యాన్మూత్రపురీషే తు శుచౌ దేశే సమాహితః॥

4. కృత్వా యజ్ఞోపవీతం తు పృష్ఠతః కంఠలంబితం।
విణ్మూత్రం తు గృహీ కుర్యాద్యద్వా కర్ణే సమాహితః॥ స్మృతిముక్తాఫలే అంగిరా
యద్యేకవస్త్రో యజ్ఞోపవీతం కర్ణే కృత్వా మూత్రపురీషోత్సర్గం కుర్యాత్॥
౧. ము. సా౦. గృహీ॥

5. మూత్రోచ్చారసముత్సర్గం దివా కుర్యాదుదఙ్ముఖః।
దక్షిణాభిముఖో రాత్రౌ ఉభే సంధ్యే యథా దివా॥ స్మృ. ము. వసుః.

6. ఛాయాయామంధకారే వా రాత్రావహని వా ద్విజః।
యథాసుఖముఖః కుర్యాత్ ప్రాణబాధాభయేషు చ॥ స్మృ. ము. వసుః.

7. రాత్రౌ మూత్రపురీషే తు గృహాభ్యాసే సమాచరేత్॥ స్మృ॥ ము.

లుగలగుంటలందును, పోవుచును, నిలుచుండియు నదీతీరము నందును, పర్వతశిఖరములందును, గోబ్రాహ్మణాదిత్యాగ్నులం జూచుచును, దర్భలందును, పచ్చికపట్టునందును, గోమయము నందును, చెట్లనీడలందును, అంగారమునందును, కపాలములందును, రాజమార్గమునందును, ఉద్యానవనములందును, అపలందును, యజ్ఞభూములందును, మూత్రపురీషోత్సర్గము చేయం గూడదు.

౨. తనపురీషమును చూడఁగూడదు.

౩. మూత్రపురీషోత్సర్జన సమయమునందు అన్యచిత్తముతోడనుండఁగూడదు. చేతితో శిరమును తాకఁగూడదు. మాటలాడఁదగదు. దిక్కులనుచూడఁగూడదు.

## శౌచవిధి.

౧. మూత్రపురీషోత్సర్జనానంతరమునందు శౌచము నొనర్పవలయును. వామహస్తముచే మూత్రావయవమును గ్రహించి

---

ప్రమాణవచనములు.

౧ శ్లో. నమూత్రం పథికుర్వీత నభస్మని నగోవ్రజే।
నఫాలకృష్టే నజలే నచిత్యాం నచపర్వతే॥
,, నజీర్ణదేవాయతనే నవల్మీకే కదాచన।
నససత్వేషుగర్తేషు నగచ్ఛన్నాపిచస్థితః।
ననదీతీరమాసాద్య నచపర్వతమస్తకే।
వాయ్వగ్నివిప్రానాదిత్య మపఃపశ్యంస్తథైవగాః
నకదాచనకుర్వీత విణ్మూత్రస్య విసర్జనం॥ స్మృ॥ మను. 4. 45–48
దేవాలయే నదీతీరే దర్భపుష్పేతు శాద్వలే।
సేవ్యచ్ఛాయాసు వృక్షేషు మార్గేగోష్ఠాంబుభస్మసు॥
అగ్నౌచగచ్ఛన్ తిష్ఠంశ్చ విష్ఠాంమూత్రంచ నోత్సృజేత్,
రథ్యాచత్వరతీర్థేషు శ్మశానే గోమయే జలే।
నసస్యయుక్తే క్షేత్రే జలే సంసది వర్త్మని।
అంగారోద్యానదేశేషు యజ్ఞభూమౌచనోత్సృజేత్॥ స్మృత్యర్థసారే.
౨. ప్రత్యాదిత్యం నమేహేత నపశ్యేదాత్మనశ్శకృత్॥ స్మృ॥ యమః.
౩. నాన్యచిత్తశ్చిరం తిష్ఠేన్నస్పృశేదాత్మనశ్శిరః.
నభాషయాన్న దిశస్సర్వా విణ్మూత్రోత్సర్గే బుధః॥ స్మృ॥ బోధాయనః.

శౌచప్రదేశమునకువచ్చి పాత్రముచేత జలమును మృత్తికను గ్రహించి వామహస్తముచేత శౌచవిధిని సలుపవలయును.

౨. నదీతీరమునుండి ఇసుకతోగూడిన మృత్తికను శౌచార్థము తీసికొనవలయును. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు క్రమంబుగ శ్వేత, రక్త, హారిద్రా, నీలవర్ణమృత్తికలను శౌచార్థము గ్రహింపవలయును. ఇట్టిమృత్తిక సంభవింపనియెడల తానున్నచోట లభించుమృత్తికను శౌచార్థము గ్రహింపవలయును.

3. శౌచార్థము మూత్రావయవమునందు ౧. యు, పురీషావయవమునందు 3 ను వామహస్తమునందు ౧౦ను. హస్తద్వయమునందు ౧౦ను. మృత్పిండములను గ్రహించవలయునని మనువచించెను. ఇతరులు ఈషద్భేదముగ సంఖ్యను చెప్పియున్నారు.

. ఈపైనఁజెప్పినలెక్క ప్రకారము మృత్తికచే శుద్ధియొనర్చినను గంధలేపములున్నయెడల గంధలేపములు పోవునంతవఱకు శౌచము నొనర్పవలయును.

b. పైనఁజెప్పిన లెక్కకు తక్కువగ శౌచమొనర్చిననే శుద్ధియయినను సంఖ్యపూర్తియగునంత దనుక మృజ్జలముచేత శౌచమొనర్పవలయును.

ప్రమాణవచనములు.

1. ఉత్థాయ వామహస్తేన గృహీత్వాధ్వని మేహనం। శౌచదేశం సమాగత్య కుర్యాచ్ఛౌచం మృదంబుభిః॥ దేవలః

గృహీతశిశ్నశ్చోత్థాయమృద్భిరభ్యుద్ధృతైర్జలైః। గంధలేపక్షయకరం శౌచంకుర్యాదతంద్రితః॥ యాజ్ఞవల్క్యః.

2. ఆహరేన్మృత్తికాం ప్రాజ్ఞః కూలాత్ససికతాం తథా॥ మాధవీయే; యమః.
విప్రేశుక్లాతు మృచ్ఛౌచే రక్తాక్షత్రే విధీయతే।హారిద్రవర్ణా వైశ్యేతు శూద్రే కృష్ణాంవినిర్దిశేత్। మాధవీయే యమః.
యస్మిన్దేశేతు యత్తోయం యాచయత్రైవమృత్తికా। సైవతత్రప్రశస్తాస్యాత్తయాశౌచం విధీయతే॥ మనుః 10. 87.

౪. పైన జెప్పిన మృత్తికా సంఖ్యానియమము గృహస్థులకగు. ఇందులకు ద్విగుణంబుగ బ్రహ్మచారులకును, చతుర్గుణంబుగ యతులకును గ్రహించునది. స్త్రీలకు, అశక్తులకు, బాలురకు శూద్రులకు సంఖ్యానియమ మక్కఱలేదు. గంధలేపములు బోవునట్లు శౌచము నొనర్చుకున్న చాలును.

౫. శౌచవిధి పగటికంటె రాత్రులందు సగమాచరించిన చాలును. అశక్తునికి అందర్థము చాలును. మార్గమునందిందులో సగమాచరించిన చాలును.

* గండూషవిధి.

౧. మృజ్జలంబులచేత శౌచవిధిని చేసికొని శిఖను ముడివేసికొని బద్ధకచ్ఛుండై గండూషమును సలుపవలయును. (గండూషమనగ నోటియందు నీళ్ళుపోసికొని పుక్కిలించి ఉమియుట) తానుకూర్చున్న ప్రదేశమునకు వామభాగమునందే గండూషము నొనర్పవలయును.

---

3. ఏకాలింగే గుదే తిస్ర స్తథైకత్ర కరే దశ। ఉభయోః సప్త దాతవ్యా మృదశ్శుద్ధిమభీప్సతా॥ మను॥ 5. 136.

పంచాపానే మృదో దేయా ద్వాభ్యాం పాదే తథా కరే। తిస్రస్తిస్రః క్రమాద్యోజ్యా సమ్యక్ఛౌచం చికీర్షతా॥ బోధాయనః.

3 a. యావన్నాపైత్యమేధ్యాక్తాద్గంధో లేపశ్చ తత్కృతః। తావన్మృద్వారి దేయం స్యాత్సర్వాసు ద్రవ్యశుద్ధిషు. మను॥ 5. 126.

3 b. న్యూనాధికం న కర్తవ్యం శౌచశుద్ధిమభీప్సతా। ప్రాయశ్చిత్తేన యుజ్యంతే విహితాతిక్రమే కృతే॥ దక్షః.

4. ఏతచ్ఛౌచం గృహస్థానాం ద్విగుణం బ్రహ్మచారిణాం। త్రిగుణంతు వనస్థానాం యతీనాంతు చతుర్గుణమ్॥ మను॥.

5. దివా యద్విహితం శౌచం తదర్ధం నిశి కీర్తితం। 5. 137.
తదర్ధమాతురే ప్రోక్తమాతురార్ధంతు వర్త్మని॥

* ప్రమాణవచనములు.

౧. శ్లో॥ కృత్వా శౌచం ప్రక్షాళ్య పాదౌ హస్తౌ చ మృజ్జలైః।
సుబద్ధశిఖకచ్ఛస్తు గండూషాచమనం చరేత్॥
ప్రస్యదక్షిణభాగే దేవాస్తిష్ఠంతి సర్వదా।
ఆసీనశ్చాదగండూషాన్ వామపార్శ్వే వినిక్షిపేత్॥

పరాశరః.

౨. మూత్రోత్సర్జనానంతరము ౪ గండూషములను, పురీషోత్సర్జనానంతరము ౮ గండూషములను, భోజనానంతరమున ౧౨ గండూషములను, దంతధావనానంతరమున ౧౬ గండూషములను చేయవలయును.

3. గండూషసమయమున తర్జనితో వక్త్రచాలనము చేయఁగూడదు.

## దంతధావనవిధి.

స్మృతిరత్నమహోదధి, స్మృతిరత్నాకరము, పరాశరమాధవీయము, అపరార్కము, విజ్ఞానేశ్వరీయము మున్నగు ధర్మశాస్త్ర గ్రంథము ననుసరించి దంతధావనవిధి, దంతకాష్ఠ, త్యాజ్యదంతకాష్ఠములు, నిషిద్ధదినములు వీనినిగుఱించి క్రమముగ వ్రాయఁబడును.,

### దంతధావనకాష్ఠగ్రహణమంత్రము.

మూ. ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూనిచ।
బ్రహ్మప్రజ్ఞాం చ మేధాం చ త్వన్నో దేహి వనస్పతే॥

తా. ఓ వనస్పతీ! ఆయువును, బలమును, కీర్తిని, తేజమును, ప్రజలను, పశుధనాది సంపత్తిని, త్రికాలగోచరమగు ప్రజ్ఞను, మేధను నీవు మాకిమ్ము. అని యర్థము.

ఈమంత్రముచేత దంతధావనకాష్ఠమును గ్రహించి దంతధావనమును చేసికొనవలయును. దంతధావనము ప్రాఙ్ముఖముగనైనను ఈశానముఖముగనైనను కూర్చుండి చేసికొనవలయును. 1

దంతకాష్ఠమును విడిచి వ్రేలితో దంతధావనముచేయుట చాల నింద్యమని ఎఱుఁగవలయును. 2

దంతకాష్ఠప్రమాణము బ్రాహ్మణులకు ౧౨, లేక ౧౦ యంగుళముల ప్రమాణమును, క్షత్రియులకు ౯ యంగుళముల ప్రమాణమును, వైశ్యులకు ౮ లేక ౬ అంగుళముల ప్రమాణమును, శూద్రులకు

---

౨. మూత్రే పురీషే భుక్త్యంతే తథైవ ద్విజ ధావనే।
చతురష్ట ద్విషడ్షోడశ గండూషైశ్శుద్ధి రిష్యతే॥
స్మృ॥ ము.

౩. గండూషస్యైవ సమయే తర్జన్యా వక్త్రచాలనం।
కరోతి యది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్॥
స్మృ॥ ము. గౌతమః.

లేక ౪ అంగుళములు ప్రమాణమును, స్త్రీలకు ౪ అంగుళముల ప్రమాణమును అని తెలిసికొనవలయును. 3

౧. దంతధావనకాష్ఠము కనిష్ఠికాంగుల సమాన స్థూలముగాని లేక మధ్యమాంగుళ సమానస్థూలముగాని ఉండవలయును.

ప్రమాణవచనములు:

(1) శ్లో॥ పూర్వాముఖే ధృతిం వింద్యాత్ శరీరారోగ్యమేవచ।
దక్షిణేన తథా క్రౌర్యం పశ్చిమేన పరాజయం॥
ఉత్తరేణ గవాం నాశం స్త్రీణాం పరిజనస్యచ।
పూర్వోత్తరేషు దిగ్భాగే సర్వాన్కామా నవాప్నుయాత్॥ కాత్యాయనః.

తా. పూర్వముఖమునందు ధైర్యము, శరీరారోగ్యమును; దక్షిణముఖమున క్రౌర్యమును, పశ్చిమముఖమున పరాజయమును, ఉత్తరముఖమున గోవులకు, స్త్రీలకు పరిజనమునకు నాశనమును; ఈశానదిక్కున సకలాభీష్ట సిద్ధిప్రాప్తియు కలుగును.

(2) శ్లో. అంగుల్యా దంతకాష్ఠంచే ప్రత్యక్షలవణంతథా।
మృత్తికా భక్షణంచైవ తుల్యాంగోమాంస భక్షణే॥ అత్రిః
నాంగుళీభిఃదంతాన్ ప్రక్షాళయేత్॥ ఉశనాః॥

తా. అంగుళులచే దంతధావనము, ప్రత్యేకముగ లవణమును భుజించుట, మృత్తికా భక్షణము ఇయ్యవి గోమాంస భక్షణముతో సమానమని అత్రిముని యభిప్రాయము. అంగుళులచేత దంతధావనము చేయకూడదని ఉశనుని యభిప్రాయము.

(3) శ్లో॥ ద్వాదశాంగులికం విప్రేః కాష్ఠమాహుర్మనీషిణః।
క్షత్ర విట్శూద్రజాతానాం నవషట్ చతురంగులం॥
దశాంగులంతు విప్రాణాం క్షత్రియాణాం నవాంగులం।
అష్టాంగులంతు వైశ్యానాం శూద్రాణాం సప్తసమ్మితం॥
చతురంగులమానంతు నారీణాం నాత్రసంశయః। విష్ణుః।

తా. అర్థము సులభమని వ్రాయలేదు.

(1.) శ్లో॥ కనిష్ఠికాగ్రవత్ స్థూలం పూర్వార్ధకృతకూర్చకం।
దంతధావనముద్దిష్టం జిహ్వోల్లేఖినికా తథా॥ స్మృ. ము. యాజ్ఞవల్క్యః.
ప్రాతఃశ్యదంతకాష్ఠంవై భక్షయేత్తు విధానతః।
మధ్యాంగుళిసమస్థౌల్యం ద్వాదశాంగుళి సమ్మితం॥ స్మృ. ము. అంగిరాః.

౨. దంతధావనకాష్ఠమును కుడిచేతితో గ్రహించి మోకాళ్ళకులోప ల చేతినుంచుకొని దంతధావన మాచరింపవలయును.

3. దంతధావనకాష్ఠము తనకు తెలిసిన వృక్షమునకు సంబంధించి యుండవలెను. దుర్గంధరహితముగను, ఋజువుగను, బెరడుతోడను, ఉండవలయును. దానియగ్రమును నలుగఁగొట్టిదంత ధావనము చేసికొనవలయును.

౪. జిహ్వాలేఖనిక (నాలుగగీచుకొనునది) నిషిద్ధదినములందును గ్రాహ్యదినములందును కాష్ఠముతోనుండవచ్చును. లేదా బంగారువెండి వీనిలో దేనితోనైనను చేసికొనవచ్చును.

౫. దంతధావనానంతరమున కాష్ఠమును కడిగినైర్‌ఋతి దిక్కున పడవేయవలయును.

---

గ్రాహ్యదంతకాష్ఠములు.

ఆమ్ర పున్నాగ బిల్వానా మపామార్గశిరీషయోః।
భక్షయేత్ ప్రాతరుత్థాయ వాగ్యతో దంతధావనం॥

స్మృ. ము. అంగిరాః.

---

(2.) బాహూజాన్వంతరం కృత్వా కుక్కుటాసన సంస్థితః।
తర్పణాచమనోల్లేఖ్య దంతధావనమాచరేత్॥

స్మృ.ము. శాండిల్యః.

(3.) విజ్ఞాతవృక్షం క్షుణ్ణాగ్ర మృజు దుర్గంధవర్జితమ్।
సత్వక్తు దంతకాష్ఠంస్యా త్తదగ్రేణ ప్రధావయేత్॥

స్మృ.ము. శౌనకః

(4.) ప్రతిపద్దర్శషష్ఠీషు నవమ్యాం దంతధావనం।
వర్జ్యైరన్యత్ర కాష్ఠైస్తు జిహ్వోల్లేఖస్తు సర్వదా॥

స్మృ.ము. వ్యాసః..

జిహ్వానిర్లేఖనం రౌప్యం సౌవర్ణంవార్క్ష మేవవా।
తన్మలాపహారం శస్తం మృదు శ్లక్ష్ణందశాంగులం॥

(5) నైర్ [illegible]ం శినిరస్యాపఉపస్పృశ్య.

ఆప. స్మృ. అనుక్రమణిక

అపామార్గంచబిల్వంచ కరవీరంవిశేషతః।
తిక్తం కషాయసహితం సుగంధికటుకాన్వితం।
క్షీరిణో వృక్షగుల్మాదీన్ భక్షయే ద్దంతధావనే॥

స్మృ. ము. వ్యాస॰

**తా.** మామిడి, సురపొన్న, బిల్వము, ఉత్తరేణి, వాడగన్నేరు వృక్షముల సంబంధమయినట్టియు, చేదు, వగరు, సుగంధము, పాలు, గలవృక్షములకు చేరినట్టియు కాష్ఠములు దంతధావనమునకు చాలప్రశస్తములు. కంటకి వృక్షములన్నియు ప్రశస్తములేకాని వానిలో తుమ్మపుల్ల మాత్రము నింద్యము.

దంతకాష్ఠగుణములు.

శ్లో. సర్జేధైర్యం, వటేదీప్తిః, కరజే విజయోరణే।
ప్లక్షే చైవార్థసంపత్తి ర్బదర్యాం మధురస్వనః॥ ౧
ఖదిరేచైవసౌగంధ్యం, బిల్వేతు విపులంధనం।
ఔదుంబరేణవాక్సిద్ధి ర్బంధూకేచదృఢాశ్రుతిః॥ ౨
వజ్రేచ కీర్తిసౌభాగ్యే పాలాశే సిద్ధిరుత్తమా।
కదంబేచ సదాలక్ష్మీ రామ్రేచారోగ్యమేవచ॥ 3
అపామార్గేధృతిర్మేధా ప్రజ్ఞాశక్తిర్వపుశ్శుచిః।
ఆయుశ్శీలం యశోలక్ష్మీస్సౌభాగ్యం చోపజాయతే॥ ४
అర్కేణదంతరోగాంస్తు బీజపూరేణతు వ్యథాం।
కకుభేన తథాఽఽయుష్యం తథా పలితవర్జితః॥ ౫
దాడిమేసింధువారేచక్షుల్లకే కటకేతథా।
జాత్యాచకరమర్దేచ దుస్స్వప్నంచైవనాశయేత్॥ ౬

స్మృ. ము. వ్యాసః

శ్లో. సర్వేకంటకినః పుణ్యాః క్షీరిణశ్చయశస్కరాః।
ఉదుంబరేణవాక్సిద్ధిం లభేత్ప్లక్షేణవై ధనమ్॥ ౧
అర్జునేననిరోగత్వం వటేన మహతీంశ్రియం।
అపామార్గేసర్వసిద్ధిం స్త్రీవశ్యం చప్రియంగుభిః॥ ౨
వేణునాఽవాప్నుయాద్గాశ్చ రాజవృక్షాజ్జయంలభేత్।

చూతేన స్పృహపూజాస్యాత్సౌభాగ్యంపనసేనతు॥ 3
అయం కంటకవృక్షాత్తు వశ్యం వైకంకటాల్లభేత్।
ఆరోగ్యంకర్ణికారేణ శానంత్యాశౌర్యముత్తమం॥ ౪
అశోకేన విశోకస్స్యాల్లవంగాద్బ్రహ్మవర్చసం।
ఖాదిరా దఖిలాన్కామాన్ లభేదతిశయం మహత్॥ ౫

స్మృ. ము. మార్కండేయః.

తా. ఏగిస చెట్టుధైర్యమును, మఱ్ఱి ప్రకాశమును, కానుగ రణవిజయమును, జువ్వి ధనసంపత్తిని, రేగు మధురస్వనమును, చండ్ర సౌగంధ్యమును, బిల్వముధనమును, మేడి వాక్సిద్ధిని, మంకెన దూరశ్రవణమును, నల్లమద్ది కీర్తిసౌభాగ్యములను, మోదుగ ఉత్తమసిద్ధిని, నీపము లక్ష్మిని, మామిడి ఆరోగ్యమును, ఉత్తరేణి ధృతి, మేధ, ప్రజ్ఞాశక్తి, దేహసౌష్ఠవము, ఆయువు, శీలము, కీర్తి, సంపత్తుమున్నగువానిని, మద్ది ఆయుష్యమును పలితవిహీనతను కలుగజేయును. దానిమ్మ సిందువారము, త్రుల్లకము, కుంకుడు, జాజి, ఓకచెట్టు వీనికాష్ఠములు. దుస్స్వప్ననాశనమును చేయును.

తా. కంటకములు కలిగినట్టియు, పాలుకలిగినట్టియు వృక్షములు దంతధావనమునకు తగినవి. మఱల నైవృక్షములను గూర్చియే చెప్పియుండుటచేత తాత్పర్యము వ్రాయలేదు.

## నింద్యదంతకాష్ఠములు.

౧. న పాలాశం దంతధావన మద్యాన్నచైవ శ్లేష్మాతకారిష్ట విభీతక ధవ ధన్వనజం; నకోవిదార శమీపీలుపిప్పలేంగుద గుగ్గులుజం, నబంధూకనిర్గుండీశిగ్రుబిల్వాకతింధుకజం, నపారిభద్ర వాల్మీకమోచకశ్లేష్మలీశణజం నమధురం నామ్లంనోర్ధ్వశుష్కంనసుశిరం నపూతిగన్ధిన పిచ్ఛిలమ్॥ అపరార్కే విష్ణుః.

తా. మోదుగ, విరిగిచెట్టు, కుంకుడు, తాడిచెట్టు, నారింజ, తెల్లదేవకాంచనము, జమ్మి, గోగు, రావి, గారచెట్టు, గుగ్గిలపుచెట్టు, ఏగిస, వావిలిచెట్టు, మునగచెట్టు, బిల్వము, నల్లతుమికి, దేవదారువు, పెద్దనిమ్మ, అరటి, బూరగజనుము, వీనిదంతకాష్ఠములును, తీపుగాని, పులుపుగానిగల వృక్షముల దంతకాష్ఠములును, కొన ఎండియున్న

ట్టియు, రంధ్రములు గలట్టియు, దుర్గంధము గలదియు, నుసుగు గలిగి నట్టియు దంతకాష్ఠములను గ్రహించకూడదు.

మూ. కుశంకాశం పలాశంచ శింశపాం యస్తు భక్షయేత్ ।
తావద్భవతి చండాలో యావద్గాం నైవపశ్యతి ॥ స్మృ. ము. గర్గః.

తా॥ దర్భ, రెల్లు, మోదుగ ఇరుగుడు, వీనితో దంతధావనము చేయందగదు. తెలియక చేయునేని వెంటనే గోవును చూచినగాని ఆపాపము పోదు.

మూ. తృణరాజసముత్పన్నై ర్నకుర్యాద్దంతధావనం ।
సకృచ్చండాలయోనిస్స్యా ద్యావద్గాం నైవపశ్యతి ।
గుడకం తాళహింతాల కేతక్యశ్చ మహావటః ।
ఖర్జూరో నారికేళశ్చ సప్తైతేతృణరాజకాః ॥

తా॥ గుడకము, తాడి, గిరుకతాడు, మొగలి, మహావటము, ఖర్జూరము, కొబ్బెర ఈఏడు తృణరాజములని పేరు. వీనితో దంతధావనము చేసికొనందగదు.

వికల్పకాష్ఠములు.

మూ॥ కోవిదార శమీకార శ్లేష్మాతక పలాశకాః ।
నిర్గుండీ శింశపా శాఖాః కదంబక కుశావటాః ।
విహితాః ప్రతిషిద్ధాస్సు రిమేతస్మా ద్వికల్పితాః ॥
స్మృత్యర్థసారము.

తా॥ దేవకాంచనము, జమ్మి, విరిగిచెట్టు, మోదుగ, వావిలి, సీపము, దర్భ, మఱ్ఱి, ఇవి గ్రాహ్యములని కొందఱును, నింద్యములని కొందఱును చెప్పియున్నారు కావున ఇవి వికల్పములు ॥

కాష్ఠదంతధావన నిషిద్ధతిథులు.

౧ పాడ్యమి, షష్ఠి, అష్టమి, నవమి, దశమి, చతుర్దశి, పూర్ణిమ,

ప్రమాణవచనములు.

శ్లో ౧. ప్రతిపత్పర్వషష్ఠీషు చతుర్దశ్యష్టమీషుచ।

అమావాస్య తిథులందును; భానువారము నందును, శ్రాద్ధదినమందును, జన్మదినమందును, వివాహదినమందును, ఉపవాసదినమందును, అజీర్ణముగ నున్నదినమందును, వ్రతతిథియందును దంతకాష్ఠములతో దంతధావనము చేసికొనకూడదు.

నిషిద్ధతిథులందు దంతధావనవిధి.

౧. నిషిద్ధతిథులందు తృణములచేతగాని నేరేడు, జువ్వి, మామిడి, ఆకులచేతగాని, మధ్యమానామికాంగుష్ఠములతో దంతధావనము చేయవలయును.

౨. అమావాస్య, ఏకాదశి ఈతిథులందు నేరేడు, జువ్వి, మామిడి, ఈయాకులతో తోముకొనవచ్చును.

3. కాష్ఠములతో దంతధావనము చేయకూడదని నిషేధించిన దినములందును, లేక దంతకాష్ఠములు లభించని దినములందును, తృణపర్ణములచేత దంతధావన మాచరింపవలయును.

౪. వ్రేళ్ళతో దంతధావనము చేయునప్పుడు చూపుడువ్రేలుతక్క తక్కిన మధ్యమానామి కాంగుష్ఠములతో దంతధావనము చేయవలయును.

నవమ్యాం భానువారేచ దంతకాష్ఠం వివర్జయేత్ స్మృ. ము. విష్ణుః.
శ్రాద్ధే జన్మదినే చైవ వివాహేఽజీర్ణదూషిత,
వ్రతే చైవోపవాసేచ వర్జయేద్దంతధావనం॥ చంద్రిక.

ప్రమాణవచనములు.

1. ప్రతిపద్దర్శషష్ఠీషు నవమ్యాం దంతధావనం।
పర్ణైరన్యత్ర కాష్ఠైస్తు జిహ్వోల్లేఖస్సదైవతు॥ స్మృ. ము. వ్యాసః.

2. తృణపర్ణైస్సదా కుర్యాదమామేకాదశీం వినా।
తయోరపిచకుర్వీత జంబుప్లక్షామ్రపర్ణకైః॥ స్మృత్యంతరే.

3. అలాభేవా నిషిద్ధేవా కాష్ఠానాం దంతధావనం।
పర్ణైనైవ విశుద్ధేన జిహ్వోల్లేఖంచ కారయేత్॥ కాలదర్శః.

4. అంగుల్యా ధావయేద్దంతాన్ వర్జయిత్వా ప్రదేశినీం।
మధ్యమానామికాంగుష్ఠైర్దంతధావో భవత్యపి॥ స్మృతర్థ్యసారః.

## స్నానార్హజలాది నిర్ణయము.

౧. నదులందును, నదములందును, తటాకములందును, మనుష్యులు త్రవ్వని సరోవరములందును, కొండవాగులందును, సంధ్యాదినిత్యకర్మల నొనర్చుటకు స్నానముచేయుట ముఖ్యము.

౨. అట్టివిలేని తావులందు ఇతరులు త్రవ్వించిన తటాకాదులందైనను స్నానమొనర్పవలయును.

3. ఇతరులు త్రవ్వించిన తటాకాదులందు స్నానము చేయవలసిన యెడల 3 మృత్పిండములను తీసివైచి స్నానమొనర్పవలయును. పరులబావియందు స్నానము చేయవలసినప్పుడుమూడుకడవలనీరు తోడిపారఁబోసి స్నానమొనర్పవలయును.

౪. నదీతటాక కూపాద్యభావసమయము నందును, రోగాదికము కలవాఁడును ఉష్ణోదకముచేత స్నానము చేయవచ్చును. ఆస్నా

---

### ప్రమాణవచనములు.

(1.) శ్లో॥ నదీషుదేవఖాతేషు తటాకేషు సరస్సు చ।
స్నానంసమాచరే న్నిత్యం గర్తప్రస్రవణేషు చ॥
నదీనదతటాకేషు దేవఖాత జలేషు చ।
నిత్యక్రియార్థం స్నాయీ త గిరిప్రస్రవణేషు చ॥ స్మృ. ము. విష్ణుపురాణే.

(2.) శ్లో॥ అలాభే దేవఖాతానాం సరసాం సరితాం తథా।
ఉద్ధృత్యచతురః పిండాన్ పారక్యేస్నానమాచరేత్॥
స్మృ. ము. మనుః.

(3.) ఉద్ధృత్యవాపిత్రీన్పిండాన్ కుర్యాదాపత్సు నో సదా।
నిరుక్తాసుచమృత్పిండాన్ కూపాత్త్రీన్ఘటాన్ తథా॥
అనుద్ధృత్యకుయత్స్నానం పరకీయే జలాశయే।
వృథా భవతి తత్స్నానం కర్తుః పాపేన లిప్యతే॥
స్మృ. ము. శౌనకః.

(4.) నిత్యం నైమిత్తికం చైవక్రియాంగం మలకర్షణం।
తీర్థాభావేతుకర్తవ్యముష్ణోదకపరోదకైః॥
ఆదిత్యస్యకరైః పూతాః పునః పూతాస్తువహ్నినా।
ఆమ్నాతమాతురస్నానే ప్రశస్తంతు తదంబుని॥ స్మృ. ము. యమః.

నమొనర్చునపుడు ఉష్ణోదకమును శీతలోదకమునందు పోసి స్నానము చేయవలయును.

౫. సంధ్యాది నిత్యకర్మల నొనర్చుటకుఁగాను లభించు నెడల నదులు మున్నగుచోటగాని, లేక కూపాదులందుగాని, లేక వేడినీళ్ళచేతగాని మృత్తికమున్నగునవి లేకపోయినను ఒకపర్యాయమైనను స్నానమొనర్పవలయును.

౬. జాతము, మృతము సంభవించినప్పుడును, సంక్రాంతి దినములందును, శ్రాద్ధదినమునందును, జన్మదినమునందును, ఛండాలాదిస్పర్శనమునందును, గ్రహణమునందును, భానువారమునందును, పూర్ణిమ, అమావాస్య, సప్తమి ఈ తిథులందును, ఉష్ణోదకస్నానము చేయకూడదు.

౭. స్నానాంగములగు సంకల్పము, సూక్తపఠనము, మార్జనము, అఘమర్షణము, తర్పణము మొదలైనవాచరించుచు స్నానమొనర్చిన స్నాన ఫలము లభించును గాని ఊరకే స్నానము మాత్రముచేసిన యెడల స్నానఫలముకలుగదు.

శీతాస్వప్సు నిషిద్ధోష్ణా మంత్రసంభారసంభృతాః।
గేహేఽపి శస్యతే స్నానం తద్ధ్యసంవిఫలం బహిః॥

స్మృ. ము. వ్యాసః

(౫.) సర్వదా నిత్యకర్మార్థం స్నాయాద్దేవ కథంచన।
వినా మృత్తికయా వాపి సకృదుష్ణేన వాంబునా॥

స్మృత్యర్థసారే.

(6.) మృతే జన్మని సంక్రాంతౌ శ్రాద్ధే జన్మదినే తథా।
అస్పృశ్యస్పర్శనే చైవ న స్నాయాదుష్ణవారిణా॥
సంక్రాంత్యాం భానువారే చ సప్తమ్యాం రాహుదర్శనే।
ఆరోగ్యపుత్రమిత్రార్థీ న స్నాయాదుష్ణవారిణా।
పౌర్ణమాస్యాం తథా దర్శే యః స్నాయాదుష్ణవారిణా।
స గోహత్యాకృతం పాపం ప్రాప్నోత్యేవ న సంశయః॥

స్మృ. ము. వృద్ధమనుః

(7) శ్లో. సంకల్పః సూక్తపఠనం మార్జనం చాఘమర్షణం।
దేవతాతర్పణం చైవ స్నానం పంచాంగముచ్యతే.

శ్లో. మంత్రపూతైర్జలైః స్నానం ప్రాహుః స్నానఫలప్రదం।
న వృథా వారి మగ్నానాం యాదసామివ తత్ఫలం॥ స్మృ. ము. వ్యాసః.

౮. ప్రాతఃకాలమునందును మధ్యాహ్నమునందును స్నానమొనర్పవలయును. అశక్తుఁడగు వాడు మధ్యాహ్నసమయమున కాపిల స్నానమొనర్చిన (అనఁగా తడిగుడ్డతో తుడుచుకొనుట) చాలును.

౯. ప్రాతఃకాల స్నానము అల్పమంత్రయుతముగను, మధ్యాహ్నకాల స్నానము సమంత్రకముగను చేయవలయును.

౧౦. గృహమునందు స్నానము చేయునపుడు స్నానమునందు సంకల్పాదికము అక్కఱలేదు.

౧౧. శ్రావణమాసమునందు గంగ, యమున, ప్లక్ష, సరస్వతి, గోదావరి, కృష్ణవేణి, మున్నగు సముద్రగలగు నదులందు తప్ప ఇతరనదులందు స్నానముచేయఁగూడదు.

౧౨, ఉపాకర్మోత్సర్జన కర్మలందును, ఆశౌచస్నానము నందును చంద్రసూర్య గ్రహణములందును శ్రావణమాసము నందుకూడ

---

(8) శ్లో॥ ప్రాతస్స్నాత్వా౽పి విధివత్స్నానం మధ్యందినేచరేత్।
శక్తశ్చేదన్యథాకోపి శాటీ సమ్మార్జనం చరేత్॥ స్మృ. ము. విష్ణుః

(9) శ్లో॥ యథాహని తథాప్రాతర్నిత్యం స్నాయాదతంద్రితః।
దంతాన్ ప్రక్షాళ్య నద్యాదౌ గృహే చేత్తదమంత్రకం॥
అత్రసంక్షేపో౽భిప్రేతః- యతస్స ఏవాహ:—
అల్పత్వాద్ధోమకాలస్య బహుత్వాత్ స్నానకర్మణః॥
స్మృ. ము. కాత్యాయనః

(10) శ్లో॥. సంకల్పం సూక్తపఠనం మార్జనం చాఘమర్షణం।
దేవాది తర్పణంచైవ గృహే పంచ వివర్జయేత్॥ ధర్మఖండే.

(11) శ్లో॥. పక్షద్వయం శ్రావణాది సర్వానద్యో రజస్వలాః।
తాసుస్నానం నకుర్వీత వర్జయిత్వా సముద్రగాః।
శ్లో॥. గంగాచయమునాచైవ ప్లక్షగాచ సరస్వతీ,
గోదావర్యా, కృష్ణవేణీ మహానద్యః ప్రకీర్తితాః। స్కాందే ధర్మఖండే

(12) ఉపాకర్మణి చోత్సర్గే ప్రేతస్నానే తథైవచ।

నదీస్నానము చేయవచ్చును.

స్నానకాలనిషిద్ధములు.

౧. దిగంబరుఁడై స్నానము చేయఁగూడదు. ఏకవస్త్రుఁడై స్నానము చేయఁగూడదు.

౨. స్నానానంతరమున తదంగములగు దేవ, ఋషి, పితృతర్పణములు చేసి స్నానవస్త్రమును పిడువవలయునుగాని తర్పణము చేయక పిడువఁగూడదు.

౩. స్నానము చేసిన వస్త్రముతోడనే స్నానానంతరమున దేహము తుడుచుకొనఁగూడదు.

౪. స్నానాంతరమున మడివస్త్రము కట్టుకొనునపుడు స్నానము చేసిన వస్త్రమును ఊర్ధ్వముగ తీసి వేయవలయును.

౫. స్నానము చేయునపుడు మంత్రాది స్మరణము తప్ప తక్కిన ఇతరసంభాషణము చేయకూడదు.

---

చంద్ర సూర్యగ్రహే చైవ రజోదోషో న విద్యతే॥ ఛందోగపరిశిష్టే

ప్రమాణవచనములు.

(1) శ్లో. అవగాహ్య జలే నగ్నః వస్త్రం యః పరిశోధయేత్।
కృద్ధాస్తత్ర నివర్తంతే దేవతాః పితృభిస్సహ॥ స్మృత్యర్థసారే.

శ్లో. స్నానం దానం జపం హోమం స్వాధ్యాయపితృతర్పణం।
నైకవస్త్రో ద్విజః కుర్యాత్ శ్రాద్ధభోజనసత్క్రియాః॥
స్మృ. ము. యోగయాజ్ఞవల్క్యః

(2) శ్లో. యావద్దేవా నృషీంశ్చైవ పితౄంశ్చైవ న తర్పయేత్।
తావన్న పీడయేద్వస్త్రం యేన స్నాతో భవేన్నరః॥

(3) శ్లో. స్నానవస్త్రేణ యో విప్రః స్వమంగం పరిమార్జతి।
స్నానం వృథైవ భవతి పునస్స్నానేన శుద్ధ్యతి॥
స్మృ. ము. శౌనకః

(4) శ్లో. స్నానం కృత్వార్ద్రవాసస్తు ఊర్ధ్వముద్ధృత్య నిక్షిపేత్।
స్నానవస్త్రమధస్తాచ్చేత్పునస్స్నానేన శుద్ధ్యతి॥
స్మృ. ము. సంగ్రహః

(5) ,, స్నాస్యతో వరుణశ్శక్తిం పుష్యతోఽగ్నిశ్శ్రియం హరేత్।

హరి ర్నారాయణోగంగా గంగానారాయణో హరిః।
హరి ర్విశ్వేశ్వరో గంగా గంగావిశ్వేశ్వరో హరిః॥ ౮

ఋగ్వేదినాం ప్రాతస్స్నానవిధిః.

౧. సంకల్పః

ఆచమ్య। ప్రాణానాయమ్య। పూర్వోక్తైవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్స్నానం కరిష్యే:-- (అని సంకల్పించి)

పరిశుద్ధమగు గోమయమును వామహస్తమునందు గ్రహించి "భూః, భువః, సువః" యనువ్యాహృతులతో ఉదగంతముగ 3గ విభజించి దక్షిణభాగమును "ఓం" అని ప్రణవము నుచ్చరించుచు పది దిక్కులందువైచి; ఉత్తరభాగమునందలి గోమయమును ఊరకతీర్థమునందువైచి; మధ్యభాగమునందలి గోమయమును ఈక్రింది మంత్రముతో అభిమంత్రించ వలయును:---

ప్రయోగః:- మానస్తోక ఇత్యస్య కుత్సోరుద్రో జగతీ, గోమయాభిమంత్రణేవినియోగః :---

మూ. మం. ఓం మానస్తోకే తనయే మాన ఆయౌ మానోగోషు మానో అశ్వేషురీరిషః। వీరాన్మానో రుద్రభామితో వధీ ర్హవిష్మన్తస్సద మిత్వాహవామహే॥ ఋ. సం. అ. 1. 8. 6.

తా. ఓ రుద్రుడా! మాపుత్రులను పౌత్రులను మాఇతర జనులను గోవులను అశ్వములను హింసింపకుము . శౌర్యవంతులగు మాసంబధింజనులందు కోపముగలవాడవై వారలను హింసింపకుము. మేముహవిస్సుగలవారలమయి ఎల్లప్పుడు నిన్ను యాగములందు పిలుచుచుందుము.

ప్రయోగము:- ఈ క్రిందిమంత్రములచేత గోమయమును దేహమునందు పూసికొ నవలయును.

మూ. మం. గంధద్వారాందురాధర్షాంనిత్యపుష్టాం కరీషిణీం।

ఈశ్వరీంసర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్॥

శ్లో. అగ్రమగ్రం చరంతీనా మోషధీనాం వనేవనే।
తాసామృషభపత్నీనాం పవిత్రం కాయశోధనమ్॥

త్వమేరోగాంశ్చ శోకాంశ్చ నుదగోమయసర్వదా॥

తా. ప్రతివనమునందును ఓషధులకగాను ముమ్ముందుకు సంచరించు గోవులసంబంధమగు గోమయము కాయశోధనార్థము పవిత్రమని ఎఱుంగవలయును. ఓగోమయమా! నీ వెల్లప్పుడు నాకుగలశోకంబులనురోగములను పోగొట్టుము.

తీర్థప్రార్థనా.

మూ.శ్లో॥ త్వంరాజాసర్వతీర్థానాం త్వమేవజగతఃపితా।
యాచితం దేహిమేతీర్థంతీర్థరాజనమోఽస్తుతే। ౧

శ్లో. సితాసితేయత్రతతరంగచామరేనద్యావిభాతే మునిభానుకన్యకే।
లీలాతపత్రంవటఏవసాక్షాత్సతీర్థరాజోజయతిప్రయాగః॥ ౨

శ్లో. తిథిర్విష్ణుస్తథావారో నక్షత్రంవిష్ణురేవచ।
యోగశ్చకరణంచైవ సర్వం విష్ణుమయంజగత్॥ ౩

శ్లో. యోఽసౌ సర్వగతోవిష్ణుశ్చిత్స్వరూపీ నిరంజనః।
స ఏవద్రవరూపేణ గఙ్గాంభో నాత్రసంశయః॥ ౪
గఙ్గాగఙ్గేతి యోబ్రూయా ద్యోజనానాం శతైరపి।
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి॥ ౫
నన్దినీ నలినీసీతా మాలినీచ మలాపహా।
విష్ణుపాదాబ్జసంభూతా గంగాత్రిపథగామినీ॥ ౬
భాగీరథీ భోగవతీ జాహ్నవీత్రిదశేశ్వరీ।
ద్వాదశైతాని నామాని యత్రయత్రజలాశయే।
స్నానయుక్తః స్మరేన్నిత్యం తత్రతత్ర వసేద్ధినా॥ ౭

భుంజ గోమృత్యురాయుష్యం తస్మాత్మానం త్రిషుస్మృతమ్॥
పరా. మాధ. అధ్యా. ౧. శ్లో. ౫౯. వ్యాఖ్యాయాంపురాణవచనం

పుష్కరాద్యాని తీర్థాని గంగాద్యా స్సరిత స్తథా।
ఆగచ్ఛన్తుపవిత్రాణి స్నానకాలేసదామమ॥ ౬.

తా. నీవు సర్వతీర్థంబులకును ప్రభుండవు. నీవే జగంబునకు తండ్రివి. నిన్ను నేను యాచించితిని. నేచేసిన సకల పాపముల పోగొట్టుకొనుటకు (స్నానార్థము) రేవును నాకొసంగుము. ౧.

ప్రయాగయను తీర్థరాజమునకు తెల్లని నల్లని రూపములుగల గంగా యమునలయొక్క తరంగములు చామరంబులుగ ప్రకాశించుచున్నవి. అచటఉండు వటవృక్షమే విలాస ఛత్రమయి ధరించు గొడుగు. ౨.

తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణముమున్నగునవియు, ఈజగంబును సర్వము విష్ణుస్వరూపము. ౩.

యోగిజనంబులకు ప్రత్యక్షంబయి జ్ఞానమేయాకృతిగాఁగలిగి (రాగద్వేషాది) మలినములనంటని సర్వవ్యాపకుండగు విష్ణువే ఈద్రవ రూపంబున గంగాజలంబయియున్నవాఁడు. ఇందు సందియము లేదు. ౪.

గంగకు అనేక శతయోజనముల దూరమునఁ బడియు నెవఁడు "గంగా! గంగ!" యనిపలుకుచుండునో వాఁడుపాపములచే విడువఁబడి విష్ణు లోకమునందును. ౫.

నందిని, నలిని మున్నగు ౧౨ భాగీరథీ నామములను స్నానమెచ్చటఁ జేసినను స్నానకాలమున పఠించవలయును. ఇట్లు పఠించు నెడల గంగ అచ్చటనే నివసించును. ౬. ౭.

జలాంతర్యామియగు హరియే గంగా స్వరూపము. గంగయే జలాంతర్యామియగు విష్ణుస్వరూపము. విష్ణువే గంగా తీరవాసియగు విశ్వేశ్వరునిరూపము. గంగయే విశ్వేశ్వరరూపమగు విష్ణువు. ౮.

పావన తమములగు పుష్కరాది తీర్థములును, గంగాది నదులును స్నానకాలమునందు నాసమీపమునకు వచ్చుగాక. ౯.

౨. సూక్త పఠనం.

**మూ.** మం. హిరణ్యశృఙ్గంవరుణంప్రపద్యేతీర్థ మే దేహియాచితః।
యన్మయా భుక్తమసాధూనాం పాపేభ్యశ్చ ప్రతిగ్రహః॥
యన్మే మనసా వాచా కర్మణా వా దుష్కృతం కృతమ్।
తన్న ఇన్ద్రోవరుణోబృహస్పతిస్సవితాచపునన్తు పునఃపునః॥

**తా.** బంగారు వికారంబగు (పర్వత) శృంగమువలె పయినుండు

కిరీటంబుగల (జలాధిపతియగు) వరుణదేవుని యనుగ్రహంబు వేడి (అతని) దరిం జేరెదను. ఓవరుణదేవా! (నాచే) వేడికొనంబడి స్నానంబునకు దేవునునాకు ఒసంగుము. పాపాత్ములయింట నాచే భుజింపఁబడినట్టియు, పాపాత్ములవలన పొందిన ప్రతిగ్రహమువలన కలిగినట్టియు, మనోవాక్కాయకర్మములచేకలిగినట్టి సకలదురితంబును ఇంద్రుఁడును, వరుణుండును బృహస్పతియు, సవితయు అప్పటికప్పుడే తొలిగించి నన్నుపరిశుద్ధుని చేయుదురు గాక.

## 3. మార్జనమ్.

ప్రయోగః:- ఆపోహిష్ఠేతి తృచస్యాంబరీషః సింధుద్వీప ఆపోగాయత్రీ మార్జనేవినియోగః—(వీనితో మార్జనముచేసికొనవలయును.)

మూ. మం. ౧. ఓం ఆపోహిష్ఠా మయోభువస్తాన ఊర్జేదధాతన।
మహేరణాయ చక్షసే।

౨. ఓం యోవశ్శివతమోరసస్తస్య భాజయతేహనః।
ఉశతీరివ మాతరః।

3. ఓం తస్మా అరం గమామ వో యస్యక్షయాయ జిన్వథ।
ఆపోజనయథాచనః॥ ఋ. సం. అ. 7. 6. 5.

తా. ఓజలములారా! మీరు స్నానపానాది సకలకర్మలకు హేతుభూతములగుటచేత సుఖమును పొందించువారగుచున్నారు. కావున ముక్తియను గొప్ప ప్రయోజనమునకైయి మమ్ము పోషింపుఁడు. ౧. ఓ జలములారా! కల్యాణతమమును మాధుర్యయుతమును అగు మీరసమునకు మమ్ములను పాత్రులనుగఁ జేయుఁడు. ౨. ఓజలములారా! మేమొనర్చిన పాపజాలములనాశంబునకై మీశరణుఁజొచ్చుచున్నారము. మీరు భక్తులందు దయగలవారు కావున మాపాపములను పోగొట్టుఁడు

## జలాలోడనమ్.

ప్రయోగః:-"ఇమంమేగంగ" ఇత్యస్య ప్రైయమేధః సింధుర్నద్యోజగతీజలాలోడనే వినియోగః. (జలాలోడనముచేయవలయును.)

మూ. ఇమంమేగఙ్గేయమునే సరస్వతి శుతుద్రి స్తోమంసచతాపరుష్ణ్యా।
అసిక్న్యామరుద్వృధే వితస్తయార్జీకీయే శృణుహ్యాసుషోమయా॥

తా. ఓగంగ! ఓయమున! ఓసరస్వతి! ఓశుతుద్రి! ఓయార్జికీయ! ఓమరుద్వృధ! మీరందఱును మీతోడివారగు పరుష్ణీదేవితోడను అసిక్నీదేవితోడను వితస్తాదేవితోడను (దయచేసి) నాచే పఠింపఁబడుచుండు స్తుతిరూపంబగు మంత్రసముదాయమును వినుఁడు.

౮. అఘమర్షణమ్.

ప్రయోగః:— ఋతంచేతి తృచస్యాఘమర్షణో భావవృత్తమనుష్టుప్, జలాఘమర్షణేవినియోగః:—

మూ. మం. ఋతంచ సత్యం చాభీద్ధాత్తపసోధ్యజాయత। తతోరాత్ర్యజాయత తతస్సముద్రో అర్ణవః॥ ౧॥ సముద్రా దర్ణవా దధిసంవత్సరో అజాయత। అహోరాత్రాణి విదధద్విశ్వస్యమిషతోవశీ! ౨॥ సూర్యాచంద్రమసౌధాతాయథాపూర్వమకల్పయత్। దివంచపృథివీంచాన్తరిక్షమథోస్వః॥ 3 ॥ ఋ. సం. అష్ట. 8. 8. 48

ఓం భూర్భువస్సువః। తద్విష్ణోః పరమంపదం సదాపశ్యంతిసూరయః। దివీవ చక్షు రాతతం॥ ఋ. సం. అష్ట. 1. 2. 7.

తా. ఋతము (అనగా మానసికమగు యథార్థ సంకల్పము) సత్యము (వాచిక సత్యసంభాషణము) శాస్త్రీయ ధర్మములు మున్నగునవి సృష్టికంటె ముందు పరబ్రహ్మమునుండియే పుట్టెను. ఆపరబ్రహ్మమునుండియే రాత్రియు పగలు, ఉదకపూర్ణమగు సముద్రము పుట్టెను. సముద్రము పుట్టినతర్వాత సంవత్సరాది రూపమగు కాలముజనించెను. ఆఈశ్వరుఁడు అహోరాత్రములను సకలభూతములను సృజించుచు నిమేషము మున్నగు కాలభేదయుతమగు ప్రపంచమున కంతయు ప్రభుపు అయియున్నాఁడు. ఈపరబ్రహ్మమే గతకల్పమునందువలె ఈ కల్పమునందును సూర్యచంద్రులను సుఖరూపమగు దివము, అంతరిక్షము, భూలోకము మున్నగు లోకములను కల్పించెను.

ప్రయోగము:–ఇటుల జపించిముమ్మారు స్నానమొనర్చి యజ్ఞోపవీతి ప్రాఙ్ముఖము గసాక్షతోదకములతో దేవాదితర్పణము చేయవలయును.

౯. దేవాదితర్పణమ్.

౧. బ్రహ్మాదయోయేదేవాఃతాన్ దేవాన్ తర్పయామి.

౨. భూర్దేవాన్ తర్పయామి,

౩. భువర్దేవాన్ తర్పయామి.
౪. స్వర్దేవాన్ తర్పయామి.
౫. భూర్భువస్స్వర్దేవాన్ తర్పయామి.

ఋషితర్పణమ్.

నివీతీ;---

౧. కృష్ణద్వైపాయనాదయో యే ఋషయః తాన్ ఋషీన్ తర్పయామి॥ ౨.
౨. భూః ఋషీన్ తర్పయామి॥ ౨.
౩. భువః ఋషీన్ తర్పయామి॥ ౨.
౪. స్వః ఋషీన్ తర్పయామి॥ ౨.
౫. భూర్భువస్స్వః ఋషీన్ తర్పయామి। ౨.

పితృతర్పణమ్.

ప్రాచీనావీతీ, దక్షిణాభిముఖః సతిలాభిరద్భిః:---

౧. సోమః పితృమాన్ యమో౽ంగిరస్వానగ్నిష్వాత్తాః కవ్యవాహనాదయో యే పితరః తాన్ పితౄన్ తర్పయామి॥ ౩.
౨. భూః పితౄన్ తర్పయామి॥ ౩.
౩. భువః పితౄన్ తర్పయామి॥ ౩.
౪. స్వః పితౄన్ తర్పయామి॥ ౩.
౫. భూర్భువస్స్వః పితౄన్ తర్పయామి। ౩.

భూమౌ జలాంజలిప్రక్షేపణమ్.

మూ. శ్లో॥ అగ్నిదగ్ధాశ్చ యేజీవా యేప్యదగ్ధాః కులేమమ,
భూమౌదత్తేన తోయేన తృప్తాయాన్తు పరాంగతిమ్॥ ౧.

అనిజలాంజలినిభూమియందువిడువవలయును.

పిదప యజ్ఞోపవీతియై ఈక్రింది మంత్రముతో యక్ష్మతర్పణము చేయవలయును. అనగా ఒడ్డునజలాంజలిని విడువవలయును.

యక్ష్మతర్పణమ్.

మూ. శ్లో. యన్మయా దూషితం తోయం శారీరమలసంభవాత్।
తద్దోషపరిహారార్థం యక్ష్మాణం తర్పయామ్యహమ్॥ ౨.

తా. నావంశమున పుట్టి మృతిఁజెందినవారిలో అగ్ని సంస్కారమునందినవారును, (సంస్కరించువారు లేనందున) అగ్ని సంస్కారము నందనివారును అగు జీవులందఱు నేనిప్పుడు భూమియందుంచిన జలముచేత తృప్తినంది పరలోకమును పొందుదురుగాక. ౧

నా దేహ మాలిన్యముచేత నీయుదకమును కలుషముచేసితిని. ఈదోషమును పోగొట్టుకొనుటకొఱకుగాను యక్ష్మతర్పణము చేయుచున్నాను. ౨

ప్రయోగము:--- పిడప (దేహమారు నంతనఱకు నిలుచుండిగాని లేక) పొడివస్త్రముచేత దేహమును తుడుచుకొని పైనఁజెప్పఁబోవురీతిగ మడివస్త్రములనుగాని లేక పట్టువస్త్రమునుగాని ధరించి తడివస్త్రమును విడిచి పిండి తరువాత పాదములను కడిగికొనవలయును.

ఋగ్వేదీయస్నానవిధి సమాప్తము.



## యజుర్వేదీయ స్నానవిధి.

౧. * ఈగంగా ధ్యానము పఠించుచు బొడ్డులోతు నీటనిలిచి సిగను రెండుగావిడదీసి ముక్కు చెవులు మూసికొని ముమ్మారు మునిగి శిఖను ముడివేసికొని ఆచమనముచేసి ప్రాణాయామమునసలిపి సంకల్పించి సూక్తపఠనము చేయవలయును.

### గంగాధ్యానమ్.

మూ. శ్లో. గఙ్గా గఙ్గేతి యో బ్రూయా ద్యోజనానాం శతైరపి,
ముచ్యతే సర్వపాపేభ్యో విష్ణులోకం సగచ్ఛతి॥౧॥
,, అంబత్వద్దర్శనాన్ముక్తి ర్నజానే స్నానజంఫలం,
స్వర్గారోహణ సోపాన మహాపుణ్యతరఙ్గిణి॥౨॥
,, విశ్వేశం కేశవం ధుణ్ఢిం దణ్డపాణిఞ్చ భైరవం,
వన్దే కాశీం గుహాంగఙ్గాం భవానీం మణికర్ణికామ్॥౩॥
,, అతితీక్ష్ణ మహాకాయ కల్పాంత దహనోపమ,
భైరవాయ నమస్తుభ్యమనుజ్ఞాం దాతుమర్హసి॥౪॥
,, త్వంరాజా సర్వతీర్థానాం త్వమేవ జగతఃపితా,
యాచితో దేహిమే తీర్థం సర్వపాపాపనుత్తయే॥౫॥
,, యోఽసౌ సర్వగతో విష్ణు శ్చిత్స్వరూపీ నిరంజనః,
స ఏవ ద్రవరూపేణ గఙ్గాంభో నాత్రసంశయః॥౬॥
,, నన్దినీ నలినీసీతామాలినీచ మహాపగా,
విష్ణుపాదాబ్జ సంభూతా గంగా త్రిపథ గామినీ॥౭॥
,, భాగీరథీ భోగవతీ జాహ్నవీ త్రిదశేశ్వరీ,
ద్వాదశైతాని నామాని యత్రయత్ర జలాశయే॥౮॥
స్నానకాలే పఠేన్నిత్యం మహాపాతక నాశనం॥

(1) శ్లో॥ తతో నదీంసమాగత్య గఙ్గాధ్యాన పురస్సరం।
నాభిమాత్రే జలేస్థిత్వా త్రివారం స్నానమాచరేత్॥ విశ్వామిత్రః॥
,, నాభిమాత్రే జలేస్థిత్వా కృత్వాకేశాన్ ద్విధా ద్విజః।
నిరుద్ధ కర్ణనాసస్తు త్రివారం మజ్జనం చరేత్॥ విష్ణుః॥
,, త్రిరాప్లుత్యసమాచమ్య శిఖాంబధ్వాసమాచమేత్।
ప్రాణానాయమ్య సంకల్ప్య త్రివారంమజ్జయేత్పునః॥ ఆశ్వలాయనః॥

తా. ౧-౫-౬-౭-౮-౯ శ్లోకములకు తాత్పర్యము ౫౩ వ పుట యందు వ్రాసియున్నాము.

తల్లీ నీదర్శనమువలన ముక్తికలుగును. నీయందు స్నానమొన రించిన నెట్టిపుణ్యము కలుగు నో నేనెఱుంగను. నీవు స్వర్గము నెక్కుటకు మెట్లవంటిదానవు॥౨॥ కాశియందుండు విశ్వనాధుని, మాధవుని, ధుండీశ్వరుని, దండపాణిని, భైరవుని, కాశీదేవిని, భవానీదేవిని, మణికర్ణికా దేవిని నమస్కరించెదను॥౩॥ మిగుల కఱుకయిన గొప్ప శరీరముగలవాఁడా! ప్రళయ కాలాగ్నివలె వెలుంగువాఁడా! కాలభైరవా! నీకు నమస్కారము. (గంగయందుస్నానముచేయుటకు) సెలవిమ్ము. ४.

౧ సంకల్పః.

ఆచమ్య॥ ప్రాణానాయమ్య॥ ఏవంగుణ విశేషణ విశిష్టాయాంశుభతిథౌ శ్రీపరమేశ్వరప్రీత్యర్థం ప్రాతః(మధ్యాహ్న)స్నానమహంకరిష్యే॥

౨. సూక్తపఠనము.

మూ. హిరణ్యశృఙ్గం వరుణం ప్రపద్యే తీర్థంమే దేహియాచితః।
యన్మయాభుక్త మసాధూనాంపాపేభ్యశ్చ ప్రతిగ్రహః॥
,, యన్మేమనసావాచా కర్మణావాదుష్కృతం కృతమ్।
తన్న ఇన్ద్రో వరుణో బృహస్పతిస్సవితాచ పునన్తుపునఃపునః॥
తై. ఆ. 10. 1.

తా. ౫౭ వ పుటయందు చూడుఁడు.

౧. సూక్తపఠనముచేసి పిదప ఆపోహిష్ఠాది మంత్రములచేత మార్జనము చేసికొనవలయును. మార్జనము, అఘమర్షణ సూక్త పఠనము, ఈ రెండును ప్రవాహాభిముఖముగనుండి చేయవలయును.

మూ. ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జేదధాతన।
మహేరణాయచక్షసే॥౧॥
యోవశ్శివతమో రసస్తస్యభాజయతేహనః।
ఉశతీరివమాతరః॥౨॥
తస్మా అరంగమామవో యస్యక్షయాయ జిన్వథ।
ఆపోజనయథాచనః॥౩॥ తై. ఆ. 10. 1.

తా. ౫౭ వ పుటయందు చూడుఁడు.

మూ. మం. హిరణ్యవర్ణాశ్శుచయఃపావకాయాసుజాతఃకశ్యపోయాస్విం

ద్రః అగ్నింయాగర్భం దధిరేవిరూపా స్తానఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు॥౧॥
యాసాగ్ంరాజావరుణోయాతిమధ్యేసత్యాన్నృతేఅవపశ్యఞ్జనానాం।
మధుశ్చుతశ్శుచయో యాఃపావకా స్తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు॥
యాసాందేవా దివికృణ్వన్తి భక్షంయాఅంతరిక్షే బహుధాభవన్తి।
యాఃపృథివీం పయసోన్దన్తి శుక్రాస్తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు॥3॥
శివేనమా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోపస్పృశతత్వచమ్మే।
సర్వాగ్ంఅగ్నీగ్ంరప్సుషదోహువేవోమయివర్చోబలమోజోనిధ
త్తర॥ తై. సం. 5. 6. 1.

తా. జలములు నిర్మలంబులును ప్రకాశమానములగుటచేత (ము. ఖ్యముగ సాయంకాలమునందు) బంగారు వర్ణమువంటి వర్ణము కలిగి యుండును. వానియందు కశ్యపుండను ప్రజాపతి ఉదయించెను. అందే ఇంద్రుఁడుదయించెను. జలంబు లగ్నిని గర్భంబున ధరించెను. సుఖమును కలుగఁజేయునట్టి ఈజలంబులు మాకు సుఖమిచ్చుగాక. ౧ జలాధిపతియగు వరుణరాజు స్నానపానాదులు యథాశాస్త్రముగఁ జేయుచున్నారా లేదాయని పరిశీలించుటకుగాను నీటియందు చరించుచుండును. మధుర రసమును స్రవింపఁజేయుచు స్వతశ్శుద్ధములయి స్నానపానాదులచేత జనులశుద్ధికి హేతుభూతములగు జలములు సుఖకారిణులయి మాకు సుఖము నిచ్చునుగాక. ౨. స్వర్గమునందు దేవతలు ఏజలసారరూపమగు అమృతమును తమకు భోజ్యముగ నొనర్చుకొన్నారో ఏజలము లంతరిక్షమున వృష్టిధారారూపముచేత బహువిధముగ నుండునో ఏజలములు భూమినెల్ల తమద్రవముచేత తడుపుచుండునో అట్టినిర్మలములును సుఖకారిణులును అగు జలములు మాకు సుఖము నిచ్చునుగాక. 3. ఓజలములారా! మీరు నన్ను చల్లని చూపుతో చూడుఁడు. మంగళమగు చల్లని దేహముతో నన్ను స్పృశింపుఁడు. నేను మీయందుండు అగ్నులను హోమముచేతతృప్తినందించెదను. మీరు మీయందుండు కాంతి, బలము, బలహేతువగు ఓజమును నాయందుంచుఁడు. ౪.

మూ. మం. ఇద మాపః ప్రవహతా వద్యంచ మలంచయత్।
యచ్చాభిదుద్రోహానృతం యచ్చశేపే అభీరుణమ్॥
శుక్ల. య. 6. 17.

తా. జలములారా! నేనుచేయుపాపమును పోగొట్టుఁడు. మఱియు నోట పలుకదగని శాపములు మున్నగునవి పలుకుటవలని పాపమును శరీరగతమగు మాలిన్యమును పోగొట్టుఁడు. అసత్యమాడి నేజేసినపాపమును అనపరాధుల దూషించినపాపమును మర్మచ్ఛేదకములగు దురుక్తు లుచ్చరించుటచే కలిగిన పాపమును పోగొట్టుఁడు.

మూ. మం. ఆపోమాతస్మా దేనసో విశ్వాన్ముంచత్వగ్ం హసః।
నిర్మాముంచామి శపథా న్నిర్మా వరుణాదధి।
నిర్మాయ మస్య పడ్బీశాత్సర్వస్మా ద్దేవకిల్బిషా దుతో
మ॒ష్య కిల్బిషాత్ ॥ తై. ఆ. 1. 01

తా ఓజలములారా! ప్రసిద్ధములగు మహాపాతకోప పాతకముల నుండి నన్ను విముక్తునిచేయుఁడు. స్వస్వవర్ణాశ్రమాచారధర్మములను విడుచుటవలన కలిగిన పాపమునుండియు వరుణదేవుని విషయమునందజ్ఞానముచేత నేనొనర్చిన యపరాధమునుండియు, పాపిజనుల పాపములకుగాను వారిని శిక్షించు యముని బొండకొయ్యలు ఉరిత్రాళ్ళనుండియు విముక్తిని చేయుఁడు. నిత్య యజ్ఞముల నొనర్పని యపరాధమునుండియు అతిథిపూజ సలుపని యపరాధమునుండియు నన్ను విముక్తుని చేయుఁడు.

## పవమానసూక్తమ్.

మూ. మం. 3. పవమానస్సువర్జనః। పవిత్రేణ విచర్షణిః।యఃపోతా సపునాతుమా॥౧॥ పునన్తుమా దేవజనాః। పునన్తుమనవోధియా।పునన్తువిశ్వ ఆయవః॥౨॥ జాతవేదః పవిత్రవత్ । పవిత్రేణ పునాహిమా శుక్రేణదేవదీద్యత్ । అగ్నే క్రత్వా క్రతూగ్ంరను॥3॥ యత్తే పవిత్ర మర్చిషి। అగ్నే వితత మన్తరా।। బ్రహ్మ తేనపునీమహే॥౪॥ ఉభాభ్యాన్దేవసవితః। పవిత్రేణ సవేనచ। ఇదం బ్రహ్మ పునీమహే॥౫॥ వైశ్వదేవీపునతీదేవ్యాగాత్ । యస్యైబహ్వీస్తనువో వీతపృష్ఠాః। తయామదన్తస్సధమాద్యేషు। వయగ్గ్ స్యామ పతయో రయీణామ్॥౬॥ వైశ్వానరో రశ్మిభిర్మాపునాతు। వాతః ప్రాణే నేషిరో మయోభూః। ద్యావాపృథివీపయసాపయోభిః। ఋతావరీ యజ్ఞియేమా పునీతామ్॥౭॥ బృహద్భిస్సవితస్తృభిః। వర్షిష్ఠైర్దేవమన్మభిః। అగ్నేదక్షైఃపునాహిమా॥౮॥ యేనదేవాఅపునత।

యేనాపోదివ్యంకశః। తేన దివ్యేన బ్రహ్మణా । ఇదం బ్రహ్మ పునీమహే॥
౯॥ యః పావమానీరధ్యేతి । ఋషిభిస్సంభృతగ్ం రసః। సర్వగ్ం సపూ
తమశ్నాతి । స్వదితమ్మాతరిశ్వనా॥౧౦॥ పావమానీర్యో అధ్యేతి । ఋషి
భిస్సమ్భృతగ్ం రసం। తస్మై సరస్వతీదుహే। క్షీరగ్ం సర్పిర్మధూదకమ్॥
౧౧॥పావమానీస్స్వస్త్యయనీః।సుదుఘాహిపయస్వతీః।ఋషిభిస్సంభృతో
రసః। బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్॥౧౨॥ పావమానీర్దిశన్తు నః। ఇమం
లోకమథో అముం। కామాన్ త్సమర్ధయన్తు నః। దేవీర్దేవైస్సమాభృ
తాః॥ 3॥పావమానీస్స్వస్త్యయనీః।సుదుఘాహిఘృతశ్చుతః।ఋషిభిస్సం
భృతో రసః। బ్రాహ్మణేష్వమృతగ్ం హితం॥౧౪॥ యేన దేవాః పవిత్రేణ।
ఆత్మానం పునతే సదా। తేన సహస్రధారేణ। పావమాన్యః పునన్తు మా॥
౧౫॥ ప్రాజాపత్యం పవిత్రం। శతోద్యామగ్ం హిరణ్మయం। తేన బ్రహ్మ
విదో వయం। పూతం బ్రహ్మ పునీమహే॥౧౬॥ ఇన్ద్రస్సునీతీ సహమాపు
నాతు। సోమస్స్వస్త్యావరుణస్సమీచ్యా। యమో రాజా ప్రమృణాభిః పునా
తు మా। జాతవేదా మోర్జయన్త్యా పునాతు॥౧౭॥

తై. బ్రా. 1. 4. 8.

తా. ఎవఁడు ఎల్లరను (పాపములనుండి) శోధించునో ఎవఁడు (పాప) శోధనమునకు శీలుఁడో ఎవఁడు సువర్లోకమున జనించెనో ఎవఁడు బహువిధశోధన ప్రకారముల నెఱింగెనో అట్టిదేవుఁడు మేమొనరించు జపము తపము మున్నగు శుద్ధిసాధనములతో నన్ను శుద్ధుని జేయుగాక. ౧.

ఎవరు కల్పాదియందు స్వర్గలోకమున జనించుటచేత దేవరూపులో, ఎవరు స్వాయంభువమనువు మున్నగు ఋషులో, ఎవరు కర్మానుసారము మనుష్యలోకమునందు సదాచారసంపత్తి కలిగి యున్నారో వారందఱు ననుగ్రహించి నన్ను శుద్ధుని జేయుదురుగాక. ౨.

ఓయగ్నీ! నీవు ఈజగమునంతయు, నెఱుంగుదువు. ప్రకాశించు కాంతిచే వెలుఁగువాఁడవు. అట్టినీవు మేముచేయు కర్మలను పవిత్రతమంబగు నీసంకల్పముచేత శుద్ధములయినవానిగ చేయుము. 3.

ఓయగ్నీ! నీజ్వాలయందు వ్యాపించినట్టియు, గొప్పదియు అగు నే శుద్ధిసాధనము కలదో దానిచేత మేము శుద్ధిని జెందుచున్నారము. ౪.

ఓసవిత్రుదేవా! నీసంబంధమయిన శుద్ధిసాధనముచేతను, మేము

సత్కర్మలను గుఱించి చేయు ప్రేరణావిశేషముచేతను మాసత్కర్మలను పరిశుద్ధములనుగ చేసికొందుము. ౫.

సర్వదేవసంబంధినియగు దేవి మమ్ములను పరిశుద్ధులను జేయుచు నిచటకు వచ్చుఁగాక. ఏదేవి దేహవిశేషములు రమ్యంబులయి స్తుతింపఁబడుచుండునో అట్టిదేవిచేత అనుగ్రహింపఁబడిన మేము ఋత్విజులతోడ హర్షయోగ్యములగు కర్మలనొనర్చుచు ధనవంతులమయి యుందుము గాక. ౬.

సకలజనులకు హితుఁడగు నాదిత్యుఁడు స్వకీయకిరణముల(నాపయి ప్రసరింపచేయుట) చేతనన్ను పరిశుద్ధునిచేయుగాక. వాయుదేవుఁడు ప్రాణరూపముచేత దేహమునందు వ్యాపించి సుఖకరుఁడగుగాక. ద్యావాపృథ్వులు రెండును సత్యవతులును (నేజేయు) యజ్ఞమునకు హితముచేయునవియు అగుచు (వర్ష)జలముచేతను (గో) క్షీరాదికముచేతను నన్ను పరిశుద్ధునిచేయుగాక. ౭.

(ఎల్లరను) కర్మలందు ప్రవేశింపఁజేయు నో అగ్నీ! గొప్పవియు, పాపముల తరింపఁజేయునవియు, చిరకాలమునుంచి యుండుటచేత వృద్ధతమములును, శోధనకుశలములునునగు నమ్మనుగ్రహించువిషయముల చేత నన్ను పరిశుద్ధునిఁ జేయుము. ౮.

విశుద్ధి సాధనంబుచేత దేవతలు తొల్లింటియజమానులను పరిశుద్ధులను చేసిరో, విశుద్ధి సాధనముచేత దేవతలు స్వర్గలోక విషయమగు గతిని బరిశోధించిరో, స్వర్లోకయోగ్యమును గొప్పదియునగునట్టి సాధనముచేత మేము చేయుచున్న గొప్పసత్కర్మను శుద్ధి చేసికొనుచున్నారము. ౯

ఏ పురుషుఁడు (పాపపరి) శోధక దేవతా సంబంధములగు నీ ఋక్కులను పఠించివాని యర్థమును స్మరించునో వాఁడు (సకలసూక్తులకును) సారభూతంబును మంత్రములచేతను, తదర్థపరిజ్ఞానులగు మునులచేతను లోకానుగ్రహార్థము సంపాదింపఁబడినది కనుకనే శుద్ధమును వాయువుచేత స్వాదూకృతంబు (మంత్రార్థానుభవంబునకనుకూలంబగు రుచిని గలుగఁజేయునట్టిదియు) నునగు పరమార్థఫలంబును భుజించును. ౧౦

ఎవఁడు పాపపరిశోధక దేవతాసంబంధములగు నీపవమానఋక్కుల చదువుచు తదర్థంబు స్మరించుచుండునో అతనికిమంత్రములచేతను వానినెఱింగిన ఋషులచేతను మనయందలి అనుగ్రహముచేతసంపాదింపఁబడిన తత్సారభూతఫలమును సరస్వతీదేవి పిదికిఇచ్చును. ఆసారము పామరులకు క్షీరము ఘృతము, మధువు, జలమువలె పరమార్థము కోరువారికి రుచించును. ౧౧

పాపపరిశోధక దేవతా సంబంధములగుఋక్కులు క్షేమకరంబులు. లెస్సగ ఫలంబు నొసంగునవి. క్షీరాదిరసప్రాప్తికి కారణంబులు అట్టి ప్రసిద్ధంబులగుపావమానులు(పవమానసూక్తమునందలిఋక్కులు) మమ్ము ననుగ్రహించుగాక. మంత్రద్రష్టలగుఋషులు మంత్రార్థఫలసారమునుమాకు ఇత్తురుగాక. మంత్రములఁబఠించుటచేత బ్రాహ్మణులనఁబడినమాకు అవినాశియగు ఫలము కలుగుగాక. ౧౨

ఇంద్రాది దేవతలచేత సంపాదితలగు నీపవమాన మంత్రాభిమానినులగు దేవతలుమాకిపరలోకంబుల (సద్గతుల) నొసంగుదురుగాక. అచటి కామితార్థములఁ జక్కఁగ నిత్తురుగాక. ౧౩

క్షేమమును కలుగఁజేయు పావమానిఋక్కులు లెస్సగ ఫలంబు నొసంగునవియు ఘృతంబు స్రవించునవియునగుచు మమ్ముల ననుగ్రహించుగాక. మంత్రద్రష్టలగు ఋషిపుంగవులచేత ఫలసారంబు మాకొఱకు సంపాదింపఁబడుగాక. తన్మంత్రముల పఠించుటచేత బ్రాహ్మణులమగు మాకు అవినాశియగు ఫలంబుకలుగుగాక. ౧౪

ఇంద్రాది దేవతలు ఏశుద్ధిసాధనముచేత తమదేహమును పరిశుద్ధమును చేసికొందురో పలువిధంబులగు భేదములచే వ్యాపించిన ఆ శుద్ధిసాధనముచేత ఈపావమానఋక్కులు నన్ను పరిశుద్ధుని జేయుగాక. ౧౫

పాపపరిశుద్ధికి సాధనంబగు నేయది ప్రజాపతి సంబధియై, దర్భలతో నిర్మించుటవలన శతసంఖ్యాకములగు నాడులుకలిగి పాపహరణము చేయుద్రవ్యముతో నిర్మింపఁబడెనో అట్టిపవిత్రముచేత వేదార్థము నెఱింగిన మేము స్వతఃపవిత్రమగు నీకర్మను మఱల పరిశుద్ధంబుగఁగావించుకొందుము. ౧౬

శోభనఫలములనిచ్చు సునీతీదేవితోఁగూడి ఇంద్రుఁడును, క్షేమమునిచ్చు స్వస్తిదేవితోఁగూడి సోముఁడును, అనుకూలయగు సమీచీదేవితోఁగూడి వరుణుఁడును, అత్యంత మరణకారికలగు ప్రమృణా దేవులతోనుండు రాజగుయముఁడును క్షీరాదిరసప్రాపికయగు ఊర్జయంతీదేవితోడనుండు జాతవేదసుఁడును నన్ను పరిశుద్ధుని చేయుదురుగాక. ౧౭.

ప్రయోగము—: ఈపావమాన సూక్తము పఠించి మజల స్నానమొనర్చి "నమోఽగ్నయే,, అనుమంత్రముచేత నమస్కరింపవలయును:—

మూ. మం. నమోఽగ్నయేఽప్సుమతేనమఇన్ద్రాయ నమోవరుణాయనమోవారుణ్యైనమోఽద్భ్యః॥

తై. ఆ. 10. 1.

తా. జలంబునగల(అనఁగా జలమధ్యంబున నిగూఢంబుగ నుండు) అగ్నికిని, ఇంద్రునకును, వరుణదేవునకును తత్పత్నియగు వారుణీదేవికిని జలాధి దేవతలకును నమస్కారము.

ప్రయోగము—:"యదపాంక్రూరం"అను మంత్రముపఠింపుచుసాంగుష్ఠయజ్ఞసూత్రము చేత ఉదకములందు వలయాకారముగ ప్రదక్షిణముగత్రిప్పి ముమ్మారు స్నానముచేయవలయును.

మూ. మం. యదప్రాంక్రూరంయదమేధ్యంయదశాన్తంతదపగచ్ఛతాత్।అత్యాశనా దతీపానాద్యచ్చ ఉగ్రాత్ప్రతిగ్రహాత్।
తన్నోవరుణోరాజా పాణినాహ్యవమర్శతు॥ ౨॥
సోఽహమపాపో నరుణో నిర్ముక్తో ముక్తకిల్బిషః।
నాకస్యపృష్ఠమారుహ్య గచ్ఛేద్బ్రహ్మసలోకతాం॥ ౩॥
యశ్చాప్సువరుణ స్సపునాత్వఘమర్షణః॥ ౪॥

తై. ఆ. 10.1.

తా. నీటియందు సుశిగుండము మున్నగు మరణకారణ క్రూరరూపములను ఉమియుట మున్నగువానిచేత కలుగు దోషంబును, వాతశ్లేష్మాదుల కలుగఁజేయుఅశాంతియు ఈప్రదేశంబు నుండి తొలంగుఁగాక. ౧.

దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మయజ్ఞంబులను చేయక భుజించినది అత్యాశనము. దేవర్షి పితృతర్పణంబులను చేయక చేసినపానము అతిపానము. శాస్త్రాచారము నతిక్రమించి చరించువాని వలన చేయఁబడిన ప్రతిగ్రహము ఉగ్రము. ఈత్రివిధములచే సంపాదింపఁబడిన పాతకంబును జలస్వామియగు వరుణుఁడు తనచేతితో తీసివైచుగాక. అందువలన పాపరహితుఁడనై రజోగుణ రహితుఁడనై సంసారకారణములగు రాగద్వేషాదికముచేత విడువఁబడి పాపరహితుఁడనై స్వర్గమును పొంది హిరణ్యగర్భలోకమునకు పోయెదను. ౨. 3।

సముద్రమునందును పలుతెఱంగులగు మహానదీ,నద, దీర్ఘికా, కూపాది జలములందునుఅధిష్ఠానుఁడై యుండువరుణదేవుఁడు నన్నుఁబరిశుద్ధుని చేయుగాక॥ ౪.

ప్రయోగము:— "ఇమంమేగంగ" అను మంత్రముచేత జలముల నభిమంత్రించవలయును.

మూ. మం. ఇమంమే గంగేయమునే సరస్వతి శుతుద్రి స్తోమగ్ం సచతాసరుష్ణియా।.అసిక్నియా మరుద్వృధే వితస్తయార్జికీయెశృణుహ్యా సుషోమయా॥

తా. ౫౮ వ పుటయందు చూడుము.

తై ఆ. 10. 1.

అఘమర్షణసూక్తేనావగాహనమ్.

ప్రయోగము:— ఈక్రిందియఘమర్షణసూక్తము పఠింపుచు స్నానము చేయవలయును.

మూ. మం. ఋతంచ సత్యం చాభీద్ధాత్తపసోఽధ్యజాయత।
తతో రాత్రిరజాయత తతస్సముద్రో అర్ణవః॥ ౧॥
సముద్రా దర్ణవాదధిసంవత్సరో అజాయత।
అహోరాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ॥ ౨॥
సూర్యాచంద్రమసౌ ధాతాయథా పూర్వమకల్పయత్।
దివంచ పృథివీం చాన్తరిక్ష మథోసువః॥ 3॥
యత్పృథివ్యాగ్ం రజస్స మాన్తరిక్షే విరోదసీ।
ఇమాగ్ స్తదాపోవరుణః పునాత్వఘమర్షణః॥ ౪॥
పునన్తు వసవః పునాతువరుణః పునాత్వఘమర్షణః।

ఏష భూతస్య మధ్యేభువనస్య గోప్తా॥ ౫॥
ఏషపుణ్యకృతాం లోకానేష మృత్యోర్హిరణ్మయం।
ద్యావాపృథివ్యో ర్హిరణ్మయగ్ం సగ్ంశ్రితగ్ం సువః॥ ౬॥
సన స్సువస్సగ్ం శిశాధి॥ ౭॥

తై. ఆ. 10. 1.

తా. ౧, ౨, 3 మంత్రములకు ౫3 పుటయందు చూడుడు)

తా. స్వర్గమర్త్య పాతాళలోకములం దెల్లెడల జనియించి ఆయా జన్మంబుల మేమొనర్చిన సకల పాపములను పాపవినాశకుఁడగు వరుణుడు పోగొట్టుగాక.౪. మఱియు అష్టవసువులును, వరుణుడును, అఘమర్షణ ఋషియు మమ్ములను పరిశుద్ధులను చేయుదురుగాక. ఈవరుణుఁడే భూతభవిష్యద్వర్తమానకాలములందు ప్రపంచమును పరిపాలించువాఁడు. ఈవరుణుఁడే జ్యోతిష్టోమము మున్నగు సత్కర్మల నొనర్చువారికి ఆయాం కర్మలకు తగిన లోకముల నిచ్చువాఁడు. ఈవరుణుఁడే పాపులకు సర్వప్రాణులను హింసింపఁజేయు "హిరణ్మయ" మను మృత్యులోకము నిచ్చువాఁడు. ఓవరుణుఁడా! నీవుద్యులోక భూలోకముల నాశ్రయించియుండునదియు స్వర్గమనుపేరుగలదియునగు లోకమును మాకు చక్కఁగనివ్వుము. ౫. ౬. ౭.

ప్రయోగము:—"ఆర్ద్రంజ్వలతి" యనుమంత్రముచేతఆచమనము చేయవలయును:—

మూ. మం. ఆర్ద్రంజ్వలతి జ్యోతిరహమస్మి।జ్యోతిర్జ్వలతిబ్రహ్మాహ మస్మి।
యోఽహమస్మి బ్రహ్మాహమస్మి। అహమస్మిబ్రహ్మాహమస్మి।
అహమేవాహం మాం జుహోమి స్వాహా॥

తై. ఆ. 10. 1.

తా. (ఉదకరూపమగుటచే తడిదియగు) నీయార్ద్రము ప్రకాశించుచున్నది. ఈజ్యోతియే నేనగుదును. ప్రకాశించు జ్యోతియే బ్రహ్మము. అహంకారసాక్షియగునేనేబ్రహ్మను. [illegible]నేను జలరూపముగునన్ను నాఉదరాగ్ని యందుంచుచున్నాఁడను.

ప్రయోగము:-ఇటుల ఆచమించి సంకల్పించి జలస్థుఁడై ప్రాఙ్ముఖము గసాక్షతోదకములతో దేవాదితర్పణము చేయవలయును.

౫. దేవాదితర్పణమ్.

౧. బ్రహ్మాదయో యే దేవాః తాన్ దేవాన్ తర్పయామి.
౨. భూర్దేవాన్ తర్పయామి,
౩. భువర్దేవాన్ తర్పయామి.
౪. సువర్దేవాన్ తర్పయామి.
౫. భూర్భువస్సువర్దేవాన్ తర్పయామి.

ఋషితర్పణమ్.

నివీతీ;---

౧. కృష్ణద్వైపాయనాదయో యే ఋషయః తాన్ ఋషీన్ తర్పయామి॥ ౨
౨. భూః ఋషీన్ తర్పయామి॥ ౨.
౩. భువః ఋషీన్ తర్పయామి॥ ౨.
౪. సువః ఋషీన్ తర్పయామి॥ ౨.
౫. భూర్భువస్సువః ఋషీన్ తర్పయామి। ౨.

పితృతర్పణమ్.

ప్రాచీనావీతీ, దక్షిణాభిముఖః సతిలాభిరద్భిః:---

౧. సోమః పితృమాన్ యమోఽఙ్గిరస్వానగ్ని ష్వాత్తాః కవ్యవాహనాదయో యే పితరః తాన్ పితౄన్ తర్పయామి॥ ౩.
౨. భూః పితౄన్ తర్పయామి॥ ౩.
౩. భువః పితౄన్ తర్పయామి॥ ౩.
౪. సువః పితౄన్ తర్పయామి॥ ౩.
౫. భూర్భువస్సువః పితౄన్ తర్పయామి। ౩.

భూమౌ జలాంజలిప్రక్షేపణమ్.

మూ. శ్లో॥ అగ్నిదగ్ధాశ్చ యే జీవా యేప్యదగ్ధాః కులేమమ,
భూమౌదత్తేన తోయేన తృప్తాయాన్తు పరాంగతిమ్॥ ౧.
అని జలాంజలిని భూమియందు విడువవలయును.

పిదప యజ్ఞోపవీతియై ఈక్రింది మంత్రముతో యక్ష్మతర్పణము చేయవలయును. అనగా ఒక్కనజలాంజలిని విడువవలయును.

యక్ష్మతర్పణమ్.

మూ. శ్లో. యన్మయా దూషితం తోయం శారీరమలసంభవాత్।
తద్దోషపరిహారార్థం యక్ష్మాణం తర్పయామ్యహమ్॥ ౨.

ప్రయోగము:--పిదప (దేహమారు నంతవఱకు నిలుచుండిగాని లేక) పొడివస్త్రముచేత దేహమును తుడుచుకొని పైనఁజెప్పఁబోవురీతిగ మడివస్త్రములనుగాని లేక పట్టువస్త్రమునుగాని ధరించి తడివస్త్రమును విడిచి పిండి తరువాత పాదములను కడిగి కొనవలయును.

యజుర్వేదీయస్నానవిధి సమాప్తము.

వస్త్రధారణమ్.

౧. ప్రయోగము:—“శుచీవోహవ్యేతి” ధౌతవస్త్రమద్భిః ప్రోక్ష్య:—“శుచీవోహవ్యా” యనుమంత్రము చెప్పుచు ధౌతవస్త్రమును జలముచేత ప్రోక్షించవలయును.

మూ. మం. శుచీవోహవ్యామరుతశ్శుచీనాగ్ం శుచిగ్ం హినోమ్యధ్వరగ్ం శుచిభ్యః। ఋతేనసత్యమృతసాప ఆయఞ్ఛుచిజన్మాన శ్శుచయః పావకాః॥

తై. బ్రా. 2. 8. 5.

తా. ఓ దేవతలారా! పరిశుద్ధులగుమీకు పరిశుద్ధములయిన హవిస్సుల నిచ్చుచున్నాఁడను. పరిశుద్ధులగు మీకు హింసావిహీనమగు కర్మమొనర్చుచున్నాఁడను. యజ్ఞసమయమునందు సమావేశమగునట్టి దేవతలకు యథార్థమగు యజ్ఞఫలము నిచ్చితిని. ఈదేవతలు పవిత్రమగు జన్మకలిగి సదాచారము కలిగి ఇతరులనుకూడ పవిత్రులనుగ చేయువారు.

౨. ప్రయోగము:— దేవస్యత్వేతివస్త్రమాదాయ:— ఈమంత్రముపఠింపుచు వస్త్రమును గ్రహింపవలయును.

మూ. మం. దేవస్యత్వా సవితుః ప్రసవే।అశ్వినోర్బాహుభ్యాం।
పూష్ణోహస్తాభ్యామాదదే॥ తై. సం. 1. 3. 1.

తా. ఓవస్త్రమా! ప్రభువగుసవిత ప్రేరేపింపఁగా అశ్వినీదేవతాసంబంధములగు బాహువులచేతను పూషదేవతాసంబంధములగు హస్తములచేతను నిన్ను గ్రహించుచున్నాడను.

అవధూననమ్.

3. ప్రయోగము:—“అవధూత” మిత్యవధూయ:— ఈమంత్రము చెప్పుచువిదిలించవలయును.

మూ. మం. అవధూతగ్ం రక్షోఽవధూతాఅరాతయః॥ తై. సం. 1. 1. 5.

తా. రాక్షసులును నాశత్రువులును నశించుదురుగాక.

ఆదిత్యదర్శనమ్.

౪. ప్రయోగము:—“ఉదుత్యంజాతవేదస” మిత్యాదిత్యాయ దర్శయిత్వా. ఈమంత్రము చెప్పుచు సూర్యునకు గనంబరచవలయును.

మూ. మం. ఉదుత్యంజాతవేదసం దేవంవహన్తికేతవః।
దృశేవిశ్వాయసూర్యం॥ తై. సం. 4. 1. 7.

తా. సూర్యకిరణములు ప్రపంచమునంతయు చక్కఁగనెఱింగినసూర్యుని జనులందఱు చూచుటకుగాను ఊర్ధ్వప్రదేశమును పొందింపుచున్నవి.

వస్త్రధారణమ్.

౫. ప్రయోగము:— "ఆవహన్తీతి" పరిధాయః— ఈమంత్రము పఠింపుచు ధరించవలయును.

మూ. మం. ఆవహన్తీ వితన్వానా।కుర్వాణాచీరమాత్మనః।వాసాగ్ంసి మమగావశ్చ।అన్నపానేచసర్వదా।తతోమేశ్రియమావహ।లోమశాంపశుభిస్సహస్వాహా॥

తై. ఆ. 7. 4.

తా. ఓ పరమేశ్వరా! వస్త్రములను, గోవులను, అన్నపానములను. నాకు ఎల్లప్పుడు ఇచ్చునట్టియు, ఇచ్చినవానిని వృద్ధినందింపఁజేయుచు చిరకాలము స్థాయిగా నుండునటుల చేయునట్టియు, లక్ష్మినినాకు ఇవ్వుము. పశువులు అశ్వములు అజములు మున్నగు రోమయుత ప్రాణి యుతమగు సంపదనిచ్చు పరమేశ్వరుని కొఱకు ఇయ్యాదిఅగుగాక.

౬. ప్రయోగము:— పిదప ద్విరాచమనముచేసి ఈశ్లోకము పఠింపుచు దర్భాసనమునుపఱిచి (అందుకూర్చుండి) ఆయాకర్మల నొనర్పవలయును.

మూ. శ్లో॥ ఉత్క్రామన్తు భూతపిశాచా యేభూతాశ్చ నిశాచరాః।
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మసమారభే॥

తా. భూతములు పిశాచములును, రాత్రిళ్ళు సంచరించు భూతములును ఇచటినుండి తొలఁగిపోవుగాక. వీనికి విరోధములేకుండునటుల నేనిప్పుడు వేదములందు చెప్పఁబడిన సత్కర్మల నారంభించుచున్నాఁడను.

వస్త్రధారణవిధి సమాప్తము.

## వాసుదేవోపనిషత్.

నమస్కృత్య భగవన్తంనారదః సర్వేశ్వరం వాసుదేవం పప్రచ్ఛ శ్రీభగవన్నూర్ధ్వపుండ్రవిధిం ద్రవ్య మంత్రస్థానాది సహితం మేబ్రూహీతి।తం హోవాచ భగవన్వాసుదేవో వైకుణ్ఠస్థానోద్భవం మమప్రీతికరం మద్భక్తైర్బ్రహ్మాదిభి ర్ధారితం విష్ణుచన్దనం వైకుణ్ఠస్థానాదాహృత్య ద్వారకాయాం మయాప్రతిష్ఠితం।చన్దనంకుంకుమాదిసహితం విష్ణుచన్దనం మమాఙ్గే ప్రతిదినమాలిప్తం గోపీభిః ప్రక్షాళనాత్ గోపీచన్దనమాఖ్యాతం।మదంగలేపనం పుణ్యం చక్రతీర్థాన్తఃస్థితం చక్రసమాయుక్తం పీతవర్ణం ముక్తి సాధనంభవతి॥ ౧॥

అథగోపీచన్దనం నమస్కృత్యోద్ధృత్య:—

శ్లో॥ గోపీచన్దన పాపఘ్న విష్ణుదేహసముద్భవ।
చక్రాఙ్కితనమస్తుభ్యం ధారణాన్ముక్తిదోభవ॥

ఇతిప్రార్థయ “ఇమంమేగంగే” ఇతిజలమాదాయ “విష్ణోర్నుకం” ఇతిమర్దయేత్। “అతోదేవాఅవన్తున” ఇత్యేతాభిః ఋగ్భిః విష్ణుగాయత్ర్యాచత్రివార మభిమన్త్ర్య.

శ్లో॥ శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత।
గోవిన్దపుణ్డరీకాక్ష మాంపాహి శరణాగతమ్॥

ఇతిమాంధ్యాత్వా; గృహస్థోలలాటాది ద్వాదశసుస్థలేష్వనామికాంగుల్యావిష్ణుగాయత్ర్యా కేశవాదిద్వాదశనామభిర్వాధారయేత్। బ్రహ్మచారీ వానప్రస్థోవా లలాటకంఠహృదయ బాహుమూలేషువిష్ణుగాయత్ర్యా కృష్ణాదిపంచనామభిర్వా ధారయేత్। యతిస్తర్జన్యాశిరోలలాటహృదయేషు ప్రణవేనధారయేత్; బ్రహ్మాదయస్త్రయోమూర్తయః, త్రయోవ్యాహృతయః, త్రీణిఛందాంసి; త్రయోవేదాః; త్రయస్స్వరాః, త్రయోఽగ్నయః, జ్యోతిష్మన్తస్త్రయః, కాలాస్త్రిస్త్రః, అవస్థాస్త్రయః ఆత్మనః పుండ్రాస్త్రయఊర్ధ్వాః అకారోకారమకారాఏతే సర్వేప్రణవమయోర్ధ్వపుండ్రత్రయాత్మకాః॥

తదేతద్యోమిత్యేకధాసమభవత్। పరమహంసోఽలాటే ప్రణవే నైకమూర్ధ్వపుండ్రంవాధారయేత్। తత్రతదీపప్రకాశం స్వమాత్మానం శ్యాంబ్రహ్మానాహమస్మీతిభావయన్ యోగీ మత్సాయుజ్య మవాప్నోతి॥.

## ఊర్ధ్వపుండ్రవిధి.

౧. ఊర్ధ్వపుండ్రత్రిపుండ్రములు రెండును బ్రాహ్మణుఁడు ధరించవలయును. వీనిలో నొకదానినైనను విడువఁగూడదు.

౨. స్నానము చేసి మృత్తికచేత ఊర్ధ్వపుండ్రమును, హోమానంతరమున భస్మముచేత త్రిపుండ్రమును, దేవతార్చనానంతరమున గంధముచేత (తిర్యక్) త్రిపుండ్రమును ధరించవలయును.

౧. ప్రయోగము:— ఈ క్రింది శ్లోకము పఠింపుచు మృత్తికను గ్రహించవలయును:-

మూ. శ్లో. గోపీచన్దన పాపఘ్న విష్ణుదేహసముద్భవ।
చక్రాఙ్కిత నమస్తుభ్యం ధారణాన్ముక్తిదో భవ॥

తా. పాపమును పోగొట్టునట్టియు, విష్ణుమూర్తి దేహమున పుట్టినట్టియు, చక్రముచేత అంకితమయినట్టియు ఓగోపీచందనమా! నీకు నమస్కారము. నిన్ను ధరించుచున్నాఁడను. నాకుముక్తి నిమ్ము.

౨. ప్రయోగము:— ఈ క్రిందిమంత్రము పఠింపుచు జలమును గ్రహించవలయును:—

మూ. మం. ఇమమ్మే గఙ్గేయమునే సరస్వతి శుతుద్రిస్తోమగ్ం
సచతా పరుష్ణియా। అసిక్నియా మరుద్వృధే వితస్త
యార్జీకీయే శృణుహ్యాసుషోమయా॥

తై. ఆ. 10. 1.

తా. ఈ మంత్రమునకు తాత్పర్యమును 23 పుటయందుచూడుఁడు.

3. ప్రయోగము:— ఈ క్రింది మంత్రము పఠింపుచు ఊర్ధ్వపుండ్రమును మర్దనము చేయవలయును:—

మూ. మం. విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని
విమమే రజాగ్ంసి యో అస్కభాయ దుత్తరగ్ం
సధస్థం విచక్రమాణస్త్రేధోరుగాయః॥

తై. సం. 1-2-13.

తా. విష్ణువుచేసిన పరాక్రమ కృత్యములను చెప్పెదను. భూసంబంధములగు పరమాణువులను నిర్మించెను. దేవతా నివాస స్థానమగు ద్యులోకము క్రింద బడకుండధరించెను. ప్రవృద్ధిని పొంది ముల్లోకములందు పాదత్రయమునుంచెను. అనిమహాత్ములు వచించిరి.

౪. ఈ క్రింది మంత్రములచేత మర్దించిన ఊర్ధ్వపుండ్రము నభిమంత్రించవలయును:—

మూ. మం. అతో దేవాఅవన్తునో యతోవిష్ణుర్విచక్రమే।పృథివ్యాస్సప్తధామభిః॥ ౧

ఇదం విష్ణుర్విచక్రమే త్రేధానిదధే పదం।సమూఢమస్య పాగ్ంసురే॥ ౨

త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః।తతోధర్మాణి ధారయన్॥ 3॥

విష్ణోః కర్మాణిపశ్యతయతోవ్రతాని పస్పశే।ఇన్ద్రస్యయుజ్యస్సఖా॥ ౪.

తద్విష్ణోః పరమం పదగ్ంసదాపశ్యన్తి సూరయః। దివీవ చక్షురాతతమ్॥ ౫॥

తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమిన్ధతే విష్ణోర్యత్పరమంపదమ్॥ ౬॥

ఋ. సం. అ. 1-2-7.

నారాయణాయవిద్మహే వాసుదేవాయ ధీమహి।తన్నోవిష్ణుః ప్రచోదయాత్॥ ౭॥

తా. ఏప్రదేశమునుండి విష్ణువు (గాయత్ర్యాది) సప్తఛందస్సులచేత వివిధ పాదవిన్యాసము చేసెనో అట్టిప్రదేశమునుండి దేవతలు నన్ను రక్షింతురుగాక. ౧. త్రివిక్రమావతార ధారియగు విష్ణువు ఈమూండడుగులతో నుండునపుడు ఈజగము ధూళిధూసరముగ ఒకఅడుగు క్రింద నుంచెను. ౨ ఇతరులచే హింసింపఁబడక జగద్రక్షకుండగు విష్ణువు అగ్నిహోత్రాది ధర్మముల రక్షించుచు పృథివ్యాదిస్థానములందు 3 అడుగుల నుంచెను. 3. ఓమానవులారా! ఈవిష్ణుమూర్తియొక్క జగద్రక్షణాది వ్యాపారముల జూడుఁడు. ఇతని యనుగ్రహము చేతనే అగ్నిహోత్రాదిధర్మములను మనమాచరించుచున్నారము. ఇతఁడు ఇంద్రు

నికి ముఖ్య మిత్రము. ౪. విద్వాంసులు శాస్త్రసిద్ధమును శ్రేష్ఠమును అగు విష్ణుసంబధమగు పదమును నేత్రములఆకాశమునందలి పదార్థమును వలె చక్కఁగ చూచుచున్నారు. ౫. కొనియాడునట్టియు, శబ్దార్థములను చక్కఁగ నెఱింగిన విద్వాంసులు విష్ణువుయొక్క శ్రేష్ఠస్థానమునులోకమున కెఱింగించుచున్నారు. ౬. సముద్ర జలమునందు శయనించిన నారాయణుని తెలిసికొనుచున్నారము. వాసుదేవుఁడగు పరమాత్మను ధ్యానించుచున్నాము. అందువలన నారాయణుఁడు అట్టి ధ్యానమునందు మమ్ములను ప్రేరేపించుగాక. ౭.

ధ్యానమ్.

మూ. శ్లో. శంఖచక్రగదాపాణే! ద్వారకానిలయాచ్యుత।
గోవిన్ద పుణ్డరీకాక్ష రక్షమాంశరణాగతమ్॥

వాసుదేవోపనిషత్.

గృహస్థధారణవిషయః.

| | నామోచ్చారణము. | | స్థానము. |
|---|---|---|---|
| ౧. | కేశవాయనమః | అనుచు | లలాటమునందును |
| ౨. | నారాయణాయనమః | ,, | ఉదరమునందును |
| ౩. | మాధవాయనమః | ,, | హృదయమునందును |
| ౪. | గోవిన్దాయనమః | ,, | కంఠమునందును |
| ౫. | విష్ణవేనమః | ,, | కుడిపార్శ్వమునందును |
| ౬. | మధుసూదనాయనమః | ,, | కుడిబాహువునందును |
| ౭. | త్రివిక్రమాయనమః | ,, | కుడిస్కన్ధమునందును |
| ౮. | వామనాయనమః | ,, | ఎడమపార్శ్వమునందును |
| ౯. | శ్రీధరాయనమః | ,, | ఎడమబాహువునందును |
| ౧౦. | హృషీకేశాయనమః | ,, | ఎడమస్కన్ధమునందును |
| ౧౧. | పద్మనాభాయనమః | ,, | వీపునందును |
| ౧౨. | దామోదరాయనమః | ,, | మెడయందును |

ఊర్ధ్వపుండ్రమును ధరించవలయును.

పిదప హస్తప్రక్షాళన జలమును "వాసుదేవాయనమః" అనుచు శిరమున చల్లుకొనవలయును.

బ్రహ్మచారివానప్రస్థయోఃధారణవిషయః.

| | | |
|---|---|---|
| ౧. కృష్ణాయనమః | అనుచు | లలాటమునందును |
| ౨. వాసుదేవాయనమః | ,, | కంఠమునందును |
| ౩. దేవకీనన్దనాయనమః | ,, | హృదయమునందును |
| ౪. నన్దగోపకుమారాయనమః | ,, | కుడిబాహువునందును |
| ౫. గోవిన్దాయనమః | ,, | ఎడమబాహువునందును |

౧. ఇట్లు బ్రహ్మచారి, వానప్రస్థుడు ఊర్ధ్వపుండ్రము ధరించ వలయును.

౨ కొందఱు, కృష్ణాయనమః, సత్యాయనమః, సాత్వతాయనమః, శౌరయేనమః, శూరాయనమః, అను ౫నామములతో ధరిం చవలయునని వచించెదరు.

౩. యతి తర్జన్యంగులి చేత ప్రణవము నుచ్చరించుచు శిరము, లలాటము, హృదయము వీనియందు ధరించవలయును.

౪. పరమహంస ప్రణవముచేత లలాటమునందు మాత్రము ధరిం చవలయును.

ఊర్ధ్వపుండ్రధారణ ప్రమాణవచనాని.

శ్లో. స్నాత్వా మృత్తికయాచోర్ధ్వపుండ్రంకుర్యాత్ప్రయత్నతః।
జపకాలే మృదాకుర్యాత్సంధ్యాకాలేచవారిణా।
భస్మనాహోమకాలేతు చన్దనంసార్వకాలికమ్॥

ముక్తాఫలేగర్గః

తా. స్నానముచేసి (శుభ్రవస్త్రమును ధరించి) ఊర్ధ్వపుండ్రమిా చెప్పఁబోవు తీరున తప్పకధరించవలయును. సంధ్యయందు జలము చేనూర్ధ్వపుండ్రమును ధరించి గాయత్రీ తర్పణమువఱకుచేసి పిదప మృత్తికచేత నూర్ధ్వపుండ్రము ధరించి గాయత్రీ ఉపాదికము సలిపి ఔపాసనహోమానంతరమున భస్మముచే త్రిపుండ్రమును దాల్చి దేవతార్చనము చేసిన తరువాత చందనముతో త్రిపుండ్రమును ధరిం చవలయును.

శ్లో॥ శ్యామం శాన్తికరం ప్రోక్తంవశ్యకరం తథా।
శ్రీకరంపీతమిత్యాహుః శ్వేతంమోక్షప్రదంశుభం॥ స్మృత్యంతరే

,, బ్రాహ్మణస్యవిశేషేణ కల్పితా ఽ నామికాస్మృతా।
అఙ్గుష్ఠశ్చైవ రాజ్ఞాన్తు తర్జనీ విశఏవచ!
శూద్రస్య మధ్యమాప్రోక్తా సర్వేషాం వాహ్యనామికా॥ ౨॥
స్మృతిరత్నమహోదధౌ.

తా. నల్లమన్ను శాంతికరము. ఎఱ్ఱమన్ను వశ్యకరము. గోపీచన్దనము (పచ్చమన్ను) లక్ష్మీకరము తెల్లమన్ను మోక్షప్రదము. (కావుననే స్మార్తులు శ్వేతమృత్తికనుధరింతురు॥ ౧॥

బ్రాహ్మణుఁడనామికాంగులిచేతను, క్షత్రియుఁ డంగుష్ఠముచేతను, వైశ్యుఁడు తర్జనిచేతను, శూద్రుఁడు నడిమివ్రేలిచేతను ఊర్ధ్వపుండ్రమును ధరింపవలయును. అన్నివర్ణములవారును అనామికాంగులిచేత ఊర్ధ్వపుండ్రమును ధరించవచ్చునని పక్షాంతరము.

పుండ్రస్థానప్రమాణశ్లోకాః.

౧ శ్లో॥ లలాటే కేశవంధ్యాయే న్నారాయణ మథోదరే।
వక్షస్థలేమాధవంచ గోవిన్దం కణ్ఠకూబరే॥
౨ ,, విష్ణుఞ్చ దక్షిణే కుక్షౌ బాహౌచ మధుసూదనం।
త్రివిక్రమంస్కన్ధదేశే వామనం వామపార్శ్వకే॥
౩ ,, శ్రీధరం వామబాహౌతు హృషీకేశంతు కంధరే।
పృష్ఠేచ పద్మనాభంచ త్రికే దామోదరం న్యసేత్।
తత్ప్రక్షాళనతోయన్తు వాసుదేవేతిమూర్ధని॥

కాలాగ్నిరుద్రోపనిషత్

భస్మధారణవిధానమ్

అథకాలాగ్నిరుద్రంభగవదన్తంసనత్కుమారః పప్రచ్ఛఅధీహి భగవన్ త్రిపుండ్రవిధిం సతత్వం. కింద్రవ్యంకింస్థానం కతిప్రమాణం కారేఖాః కిందైవతం కేమన్త్రాఃకాఃశక్తయః కింఫలమితి। తంహోవాచ భగవాన్ యద్ద్రవ్యం తదాగ్నేయంభస్మ,సద్యాదిపంచబ్రహ్మమంత్రైః పరిగృహ్యాగ్నిరితిభస్మేత్యనేన చాభిమన్త్ర్యమానస్తోకేత్వతిసముద్ధృత్య,త్ర్యంబకంయజామహఇతిశిరోలలాటవక్షస్కన్ధేష్వితి త్రిభిస్త్ర్యాయుషైః స్త్ర్యంబకైస్త్రిశక్తిభిస్తిర్యక్తిస్రోరేఖాః ప్రకుర్వీత॥ వ్రతమేత చ్ఛాన్మ్భవంసర్వవేదేషు వేదవాదిభిరుక్తమ్.

ప్రమాణవచనములు

శ్లో. సర్వ్యభస్మాగ్నిహోత్రాత్స్యాద్ధార్యమేవాగ్నిహోత్రిభిః।
అనాహితాగ్నేర్బ్రాహ్మం స్యా న్మహోపాసనసముద్భవమ్॥౧॥
" ఔపాసనాగ్నిజంబ్రాహ్మంసర్వ్యభస్మతువైష్ణవం।
సర్వ్యభస్మపరంబ్రహ్మద్వయంసంసారతారకమ్।
తయోరన్యతరత్సేవ్యంసంసారభయభీరుణా॥౨॥
" ధార్యంభస్మత్రిసంధ్యన్తుగృహిణాజలసంయుతం।
పర్వకాలేభవేత్స్త్రీణాంయతీనాంజలవర్జితమ్॥౩॥

బృహస్పతిః

తా.. ఆహితాగ్నులగువారు అగ్నిహోత్రములయిన తరువాత సర్వ్యమను పేరుగల ఆభస్మమునుధరించవలయును. అనాహితాగ్నులగు వారునిత్యోపాసనానంతరమున బ్రాహ్మమను పేరుగల ఆభస్మమును ధరించవలయును.1.

ఔపాసనాగ్నివలన కలిగిన భస్మముబ్రహ్మము. సర్వ్యభస్మవైష్ణవము. సర్వ్యభస్మ పరబ్రహ్మము. ఈరెండును సంసార తారకములు. కనుక సంసారభయభీరువగునతఁడు ఈరెంటిలో నేదేనిధరించవలయును. 2. గృహస్థుడుమూఁడుసంధ్యలందును జలసంయుతముగ భస్మమును ధరించవలయును. యతులును, స్త్రీలును, పర్వకాలమున గృహస్థులును జలవర్జితముగ ధరించవలయును. 3.

త్రిపుండ్రాయామాదివిచారము.

శ్లో. షడంగులాయతంమానమథవాఽధికమానకం।
౧ నేత్రయుగ్మప్రమాణంవాఫాలేదీప్తంత్రిపుండ్రకమ్॥౧॥
" మధ్యమానామికాంగుష్ఠైర్లలాటేయత్త్రిపుండ్రకం।
తత్త్రిపుండ్రంభవేచ్ఛ్రేష్ఠం మహాపాతకనాశనం।
మధ్యమానామికాంగుష్ఠైరనులోమవిలోమతః॥ ౨॥
" షడంగుల ప్రమాణన్తు బ్రాహ్మణానాం త్రిపుండ్రకం।
నృపాణాంచతురంగుల్యం వైశ్యానాంచద్వ్యంగులం।
శూద్రాణామథసర్వేషా మేకాంగుల్యం త్రిపుండ్రకం॥౪॥

తా. త్రిపుండ్రము ఆఱంగుళములపొడవుగాని అంతకధికముగాని రెండుకనుకొనలవఱకు నుండునంతటిదిగాని ఉండవలయును॥౧॥ నడిమివ్రేలు, అనామిక, బొటనవ్రేలు ఈమూఁటితోను త్రిపుండ్రము ధరించునది. అది ప్రశస్తము. మహాపాతక నాశనమనియు చెప్పెదరు. (తర్జని తగులరాదు) మధ్యమానామికలలో అనులోమముగ నూర్ధ్వాధోరేఖలను, ఆనడుమను అంగుష్ఠముతో విలోమముగ మ

ధ్యరేఖను ధరించునది॥౨॥ బ్రాహ్మణులకు 6 అంగులముల పొడవును, క్షత్రియుల కు 4 అంగులముల పొడవును, వైశ్యులకు 2 అంగులముల పొడవును, శూద్రులకు 1 అంగులము పొడవును భస్మధారణ ముండవలయునని మతాంతరమున వర్ణవిభాగానుసారముగ చెప్పియున్నారు.

శ్లో. ఊర్ధ్వపుండ్రే త్రిపుండ్రంస్యాత్ త్రిపుండ్రేనోర్ధ్వపుండ్రకమ్॥

స్మృతితత్వప్రదీపిక.

" భస్మనా చోర్ధ్వపుండ్రంతు తిర్యక్పుండ్రం మృదాతథా।
బ్రహ్మహత్యాసమంప్రోక్తం మునిభి ర్వేదపారగైః॥

ధర్మప్రవృత్తి.

తా. ఊర్ధ్వపుండ్రముమీద త్రిపుండ్రముంచవలయునుగాని త్రిపుండ్రముమీద మాత్రము ఊర్ధ్వపుండ్రము నుంచగూడదు.

భస్మముతో ఊర్ధ్వపుండ్రము నుంచినను, మృత్తికతో త్రిపుండ్రము నుంచినను కలుగు పాతకము బ్రహ్మహత్యతో సమమగునని వేదపారంగతులగువారు పలుకుదురు.

౧. ప్రయోగము:—"సద్యోజాతం" అను ౫ మంత్రములుపఠింపుచు భస్మను గ్రహించవలయును:—

మూ. మం. ౧. సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః। భవేభవేనాతి భవేభవస్వమాం భవోద్భవాయ నమః॥

౨. వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమశ్శ్రేష్ఠాయనమో రుద్రాయనమః కాలాయనమః కలవికరణాయనమో బలవికరణాయనమో బలాయనమో బలప్రమథనాయ నమస్సర్వభూతదమనాయన మోమనోన్మనాయనమః॥

3. అఘోరేభ్యోఽథ ఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। స ర్వేభ్యస్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తురుద్రరూపేభ్యః॥

౪. తత్పురుషాయవిద్మహేవామదేవాయధీమహి। తన్నోరు ద్రః ప్రచోదయాత్॥

౫. ఈశానస్సర్వవిద్యానా మీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోఽధిపతిర్బ్రహ్మ శివోమేఅస్తు సదాశివోమ్॥ తై. ఆ. 10. 21. 39

తా. ఈ ౫ మంత్రములందు చెప్పఁబడిన సద్యోజాతాదినామములు ఈశ్వరుని ౫ ముఖములయొక్క పేరులు. వానిస్తోత్రమీ ౫ మంత్రములందును చేయఁబడుచున్నది:--సద్యోజాతరూపమగుపరబ్రహ్మమునుశరణుపొందుచున్నాఁడను. సద్యోజాతరూపుఁడగు పరబ్రహ్మమునకే నానమస్కారమగుగాక. ఓసద్యోజాతరూప పరబ్రహ్మమా! నాకుపుట్టుకనివ్వకుము. జన్మరాహిత్యమునుకలుగఁజేయుతత్త్వజ్ఞానమును కలుగఁజేయుము. సంసారోద్ధర్తవగునీకునమస్కారమగుగాక ౧.

వామదేవరూపమగు పరబ్రహ్మమునకు నమస్కారమగుగాక. సర్వజగదుత్పత్తికంటె పూర్వుఁడగుటచేత జ్యేష్ఠుఁడును, కొనియాడదగినవాఁడగుటచేత శ్రేష్ఠుఁడును, ప్రళయకాలమున నందఱిని రోదింపఁజేయుటచేత రుద్రుఁడును, అందఱిప్రాణముల నశింపఁజేయుటచేత కాలుఁడును, సుఖముచేయువాఁడును వివిధజగంబులనుసృజించువాఁడును, అగుటచేతకలవికరణుఁడును, రాక్షసులబలమును నాశనముచేయుటచేత బలవికరణుఁడును, సకలభూతములశిక్షించుటచేత సర్వభూతదమనుఁడును, సర్వజ్ఞుఁడగుటచేత మనోన్మనుఁడును అగుపరబ్రహ్మమునకు నమస్కారము. ౨.

ఓదేవా! సాత్త్వికములగుటచేత సౌమ్యరూపములును, రాజసములగుటచేత ఉగ్రరూపములును తామసములగుటచేతభయంకరములును, అతిభయంకరములును, లయకాలమునప్రాణులను హింసించునవియునగు నీసకలరూపములకు ఎల్లప్పుడు నమస్కరించెదను. ౩.

తత్పురుషముఖరూపుఁడగు దేవుని గురూపదేశమువలనను శాస్త్రశ్రవణమువలనను తెలిసికొనుచున్నారము. తెలిసికొనిఅట్టి మహాదేవుని ధ్యానించుచున్నారము. కావునయేకాగ్రధ్యానము నిమిత్తమునమ్మా దేవుఁడు ప్రేరేపించుగాక॥ ౪.

ఈశానముఖరూపుఁడగు దేవుఁడేసర్వవిద్యలకు ప్రభువు. అతఁడేసకలభూతములకు అధిపతి. వేదమునకతఁడే పాలకుఁడు. జగత్సృష్టిని చేసిన హిరణ్యగర్భునకు కూడ నతఁడేప్రభువు. అట్టిపరబ్రహ్మమునన్ననుగ్రహించుటకుఁగానుశాంతముయినవాఁడగుఁగాక. అట్టిసదాశివస్వరూపుఁడనునేనైతిని. ౫.

భస్మమునుపరబ్రహ్మరూపముగ ధ్యానించుటచేత పరబ్రహ్మప్ర తిపాదకమంత్రములిచట వాడఁబడినవి.

౨. ప్రయోగము:—ఈక్రిందిమంత్రముచేత (గ్రహించిన) భస్మము నభిమంత్రించవలయును:—

మూ.మం. అగ్నిరితిభస్మ! వాయురితిభస్మ। జలమితిభస్మ।స్థలమితిభస్మ। వ్యోమేతిభస్మ।సర్వగ్ంహవాఇదంభస్మ। మనఏతానిచక్షూ గ్ంషిభస్మాని॥

3. ప్రయోగము:— "మానస్తోకే" యను మంత్రముచేత (అభి మంత్రించిన భస్మమును) గ్రహించి జలము కలిపి మర్దించవ లయును.

మూ.మం. మానస్తోకే తనయే మానఆయుషి మానోగోషుమానో అశ్వేషురీరిషః। వీరాన్మానోరుద్రభామితోవధీ ర్హవిష్మ న్తో నమసావిధేమతే॥ తై. ఆ. 10. 53. 71.

తా. ఓరుద్రుడా! మేము తెలియక నీయందు అపరాధమును చే సితిమేని దానిచేత అలిగినవాఁడవై మాపుత్రులు మాఆయువులు మాగోవులు అశ్వములు మొదలుగాఁగల సకలమును హింసింపకు ము. మేము యథాశాస్త్రముగ హవిస్సునిచ్చుచు నమస్కారపూ ర్వకముగ నీపూజను సలిపెదము.

౪. ప్రయోగము:— ఈక్రింది మంత్రములు పఠింపుచు అడ్డముగ 3 నిరేఖలుగ లలాటాదిస్థానములందు ధరించవలయును.

మూ.మం. ౧. త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం యద్దే వానాం త్ర్యాయుషం తన్మే అస్తు త్ర్యాయుషం॥

౨. త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనం।ఉర్వారు క మివబన్ధనా న్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

3. యే తే సహస్ర మయుతం పాశా మృత్యోమర్త్యాయహ న్తవే।తాన్ యజ్ఞస్యమాయయా సర్వానవయజామహే॥

౪. మృత్యవే స్వాహామృత్యవే స్వాహా।

తా జమదగ్ని, కశ్యపుఁడు, దేవతలు వీరియొక్క బాల్య, యౌ వన వృద్ధత్వము లెట్లుండెనో నాయొక్క బాల్యయౌవన వృద్ధత్వములు

ను అశ్లేయగుగాక. అనఁగా వారేవిధముగ తేజస్సు కలిగియుండిరో అశ్లేనాకును తేజస్సు కలుగుగాక. ౧.

ఓరుద్రుఁడా! మూఁడు నేత్రములు గలవాఁడవును, పరిమళించు దేహము గలవాఁడవును, లౌకికవైదిక సంతోషములను వృద్ధి చేయువాఁడవును అగు నిన్ను పూజించుచున్నాఁడను. ఓరుద్రుఁడా! దోసపండు తొడిమెనుండి వదలిపోవునట్లు మేము మృత్యువునుండి వదిలిపెట్టఁబడుదుముగాక. మోక్షమునుండి వదిలిపెట్టబడక యుండుదుముగాక. ౨.

ఓమృత్యుదేవతా! ప్రాణులను హింసించుటకుగా నేర్పడిన వేల కొలఁది సంఖ్యలుగల నీపాశములను మేముచేయు సత్కర్మానుష్ఠానబలముచేత నివారించుకొనుచున్నారము. ౩.

ప్రాణులను హింసింపఁజేయు (మృత్యు) దేవతకుగాను ఇయ్యది హుతమగుగాక. ౪.

## బ్రహ్మచారిధారణవిషయము.

౧. ప్రయోగము:— అగ్నికార్య మేయగ్నియందు చేయునో అచటిభస్మమును ఊరకఅభిమంత్రించి తాఁకి ఈక్రింది మంత్రముతో గ్రహించి జలము కలిపి మర్దించవలయును.

మూ.మం. మానస్తోకే తనయే మాన ఆయుషి మానోగోషుమానో అశ్వేషురీరిషః।వీరాన్మానో రుద్రభామితో వధీర్హవిష్మన్తో నమసావిధేమతే॥

తా. ౧౧ వపుటయందు చూడుఁడు.

| | | |
|---|---|---|
| ౧. మేధావీభూయాసం | అనుచు | లలాటమునందును |
| ౨. తేజస్వీభూయాసం | ,, | కుడిబాహువునందును |
| ౩. వర్చస్వీభూయాసం | ,, | ఎడమబాహువునందును |
| ౪. బ్రహ్మవర్చస్వీభూయాసం | ,, | హృదయమందును |
| ౫. ఆయుష్మాన్ భూయాసం | ,, | కంఠమునందును |

బోధాయనః

భస్మముతో త్రిపుండ్రములను ధరించవలయును.

తృచాకల్పనమస్కారాః

ఆచమ్య. ప్రాణానాయమ్య. శ్రీపరమేశ్వరముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం సవితృసూర్యనారాయణ ప్రీత్యర్థంచ తృచాకల్ప విధినానమస్కారాఖ్యంకర్మకరిష్యే:--

కలశపూజాంకృత్వా॥

పాత్రేజలంగృహీత్వా। తన్మధ్యేగంధాక్షతపుష్పాణిక్షిప్త్వా

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమణ్డలమధ్యవర్తీ
నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః।
కేయూరవా న్మకరకుండలవా న్కిరీటీ
హారీహిరణ్మయవపుర్ధృతశంఖచక్రః॥ ఇతిధ్యాత్వా.

తా. శ్రీమన్నారాయణుని సూర్యమండలమధ్య భాగమునందున్నవానిగను, పద్మాసనాసీనునిగను, కేయూరములు కలవానిగను, మకరకుండలములు కలవానిగను, హారములు ధరించినవానిగను, సువర్ణమయ శరీరముగలవానిగను శంఖచక్రధారిగను ఎల్లప్పుడుధ్యానించునది.

నమస్కారాః

౧. ఓంహ్రాం ఉద్యన్నద్య మిత్రమహః హ్రాంఓం మిత్రాయ నమః॥
౨. ఓంహ్రీం ఆరోహన్నుత్తరాందివం హ్రీంఓం రవయే నమః॥
3. ఓంహ్రూంహృద్రోగంమమసూర్యహ్రూంఓంసూర్యాయనమః॥
౪. ఓం హ్రైం హరిమాణంచ నాశయ హ్రైంఓం భానవేనమః॥
౫. ఓంహ్రౌం శుకేషుమేహరిమాణం హ్రౌంఓం ఖగాయనమః॥
౬. ఓం హ్రః రోపణాకాసుదధ్మసి హ్రఃఓం పూష్ణేనమః॥
౭. ఓంహ్రాం అథోహారిద్రవేషుమే హ్రాంఓం హిరణ్యగర్భాయనమః॥
౮. ఓంహ్రీం హరిమాణం నిదధ్మసి హ్రీంఓం మరీచయేనమః॥
౯. ఓంహ్రూం ఉదగాదయమాదిత్యః హ్రూంఓం ఆదిత్యాయనమః॥
౧౦. ఓంహ్రైం విశ్వేనసహాసాసహ హ్రైంఓం సవిత్రేనమః॥
౧౧. ఓంహ్రౌం ద్విషన్తంమహ్యంరన్ధయన్ హ్రౌంఓం అర్కాయనమః॥
౧౨. ఓంహ్రః మోఅహంద్విషతేరధం హ్రఃఓం భాస్కరాయనమః॥

౧. ఓం హ్రాం హ్రీం ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాందివం హ్రాం హ్రీం ఓం మిత్రరవిభ్యాం నమః॥
౨. ఓం హ్రూం హ్రైం హృద్రోగం మమసూర్య హరిమాణంచ నాశయ హ్రూం హ్రైం ఓం సూర్యభానుభ్యాం నమః॥
3. ఓం హ్రౌం హ్రః శుకేషుమే హరిమాణం రోపణాకాసుదధ్మసి హ్రౌం హ్రః ఓం ఖగపూషభ్యాంనమః.॥
౪. ఓం హ్రాం హ్రీం అథోహారిద్రవేషుమే హరిమాణం నిదధ్మసి హ్రాం హ్రీం ఓం హిరణ్యగర్భమరీచిభ్యాంనమః.
౫. ఓం హ్రూం హ్రైం ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసాసహ హ్రూం హ్రైం ఓం ఆదిత్యసవితృభ్యాం నమః.
౬. ఓం హ్రౌం హ్రః ద్విషన్తం మహ్యంరన్ధయన్మో అహంద్విషతోరధం హ్రౌం హ్రః ఓం అర్కభాస్కరాభ్యాం నమః.

౭. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం ఉద్యన్నద్యమిత్రమహ ఆరోహన్నుత్తరాందివం। హృద్రోగం మమసూర్య హరిమాణంచ నాశయ। హ్రాం హ్రీం హ్రూం హ్రైం ఓం మిత్రరవిసూర్యభానుభ్యోనమః॥
౮. ఓం హ్రౌం హ్రః హ్రాం హ్రీం శుకేషుమేహరిమాణం రోపణాకాసు దధ్మసి। అథోహారిద్రవేషుమే హరిమాణం నిదధ్మసి॥ హ్రౌం హ్రః హ్రాం హ్రీం ఓం ఖగపూష హిరణ్యగర్భమరీచిభ్యోనమః॥
౯. ఓం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసాసహ। ద్విషన్తం మహ్యంరన్ధయన్మోఅహం ద్విషతోరధం॥ హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓం ఆదిత్యసవితర్కభాస్కరేభ్యోనమః॥

౧౦. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఉద్యన్నద్యమిత్రమహ ఆరోహన్నుత్తరాందివం। హృ

హృద్రోగంమమ సూర్యహరిమాణంచనాశయ॥ శుకేషుమేహరిమాణం రోపణాకాసుదధ్మసి। అథోహారిద్రవేషుమే హరిమాణం నిదధ్మసి॥ఉదగాదయమాదిత్యో విశ్వేనసహసాసహ। ద్విషన్తం మహ్యంరన్ధయన్మో అహం ద్విషతోరధం ॥ ఓంహ్రాంహ్రీం హ్రూంహ్రైంహ్రౌంహ్రః హ్రాంహ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓంమిత్రరవిసూర్య భానుఖగపూష హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవితర్కభాస్కరేభ్యోనమః ॥ ఏవంత్రిః.

౧౧. పూర్వవత్

౧౨. ,,

అరుణనమస్కారః

మూ. వినతాతనయోదేవః కర్మసాక్షీ సురేశ్వరః।
సప్తాశ్వః సప్తరజ్జుశ్చ అరుణోమే ప్రసీదతు॥

తా. వినతాపుత్రుఁడును, దేవుడును, కర్మసాక్షియు, దేవతాధిపతియు, సప్తాశ్వుఁడును, సప్తరజ్జువును అగు అరుణుఁడు నన్ననుగ్రహించుఁగాక.

ఓం కర్మసాక్షిణే అరుణాయనమః.

మూ. ఆదిత్యస్య నమస్కారం యేకుర్వంతిదినేదినే।
జన్మాంతరసహస్రేషు దారిద్ర్యంనోపజాయతే॥

తా. అకాలమృత్యువును హరించిసకలరోగములను నాశనముచేయునట్టి సూర్యునియొక్కపాదోదకమును ప్రాశనముచేయుచున్నాను

అనేనద్వాదశ నమస్కారాఖ్యేన కర్మణా భగవాన్ సవితృసూర నారాయణః ప్రీయతాం నమమ॥

తీర్థగ్రహణమ్.

మూ. అకాలమృత్యుహరణం సర్వవ్యాధి వినాశనమ్।
సూర్యపాదోదకం తీర్థం జఠరేధారయామ్యహమ్॥

తా. ప్రత్యహము సూర్యునకునమస్కరించువారికి వేలకొలఁదిజన్మములకైనను దారిద్ర్యమురాదు.

ఇతి సూర్యద్వాదశనమస్కారాః.

# అథ సౌరసూక్తాని.

ఉదుత్య మితి త్రయోదశర్చస్య సూక్తస్య కణ్వః ప్రస్కణ్వః సూర్యో, నవాద్యా గాయత్ర్యోఽన్త్యాశ్చతస్రోఽనుష్టుభోఽన్త్యస్తృచో రోగఘ్న ఉపనిష దంత్యార్ధర్చో ద్విషఘ్నః.

చిత్రం దేవానా మితి షడర్చస్యసూక్తస్య ఆంగిరసః కుత్సః సూర్యః, త్రిష్టుప్.

ఇంద్రంమిత్రమితిద్వయో రౌచథ్యో దీర్ఘతమా సూర్యః, త్రిష్టుప్ హంసశ్శుచిష దిత్యస్య గౌతమో వామదేవః సూర్యో జగతీ.

యత్త్వేతి భౌమోఽత్రిః సూర్యః అనుష్టుప్.

యదద్య త్వేకా,ఉత్సూర్య ఇతి తిస్రః, ఉద్వేతీతి చతస్రోఽర్ధపంచమాః ఏతాసాంమైత్రావరుణిః వసిష్ఠ సూర్యః త్రిష్టుప్,

ఉదుత్యద్దర్శత మితి తృచస్య మైత్రావరుణిః వసిష్ఠః సూర్యః ఆద్యా బృహతీ ద్వితీయా సతో బృహతీ తృతీయా పుర ఉష్ణిక్.

బణ్మహా నితి ద్వయో ర్భార్గవో జమదగ్నిః సూర్యః బార్హత ప్రగాథః.

నమోమిత్రస్యేతి ద్వాదశర్చస్యసూక్తస్య సూర్యోఽభితపాః సూర్యో జగతీ దశమ్యా త్రిష్టుప్.

సూర్యోన ఇతి పంచర్చస్య సూక్తస్య సూర్యశ్చక్షుః సూర్యః గాయత్రీ.

విభ్రాడ్బృహ దితి చతుర్ఋచస్య సూక్తస్యాభితపాః సూర్యో సౌర్యః జగతీ అన్త్యా ప్రస్తారపంక్తిః.

ఆయం గౌరితి తృచస్య సర్పరాజ్ఞీ సూర్యోగాయత్రీ.

ఋతంచేతి తృచస్య మాధుచ్ఛందసోఽఘమర్షణో భావవృత్త మనుష్టుప్.

శ్రీసవితృ సూర్యనారాయణ ప్రీత్యర్థే జపే వినియోగః.

# సౌరమంత్రపాఠః.

ఋగ్వేదతః సంగృహీతః.

ప్రథమాష్టక చతుర్థాధ్యాయ సప్తమేవర్గే త్రయోదశ ఋచః.

మూ. మం. ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః।
దృశే విశ్వాయ సూర్యం॥ ౧

1. తా. సూర్యకిరణములు ప్రపంచమునందుండు జనులందఱు సుప్రసిద్ధుఁడును జాతప్రజ్ఞుఁడును ప్రకాశించువాఁడును ప్రేరకుఁడును అగు సూర్యుని అందఱు చూచుటకుఁగాను ఊర్ధ్వభాగమును పొందింపుచున్నవి.

మూ. మం. అప త్యే తాయవో యథా నక్షత్రా యం త్యక్తుభిః।
సూరాయ విశ్వచక్షసే॥ ౨

2. తా. (సూర్యోదయానంతరమున తత్కాంతిచేత నక్షత్రకాంతి తిరోహితమగుట స్వభావము. ఆవిషయమిచట చమత్కరించి చెప్పఁబడుచున్నది) నక్షత్రములు లోకప్రకాశకుఁడగు సూర్యుని రాకనుచూచి రక్షకభటుని చూచిన దొంగలవలె రాత్రులదోడ తొలఁగిపోవుచున్నవి.

మూ. మం. అదృశ్ర మస్య కేతవో వి రశ్మయో జనా అను।
భ్రాజంతో అగ్నయో యథా॥ 3

3. తా. ఈసూర్యకిరణములు ప్రకాశించు అగ్నులవలె జగమునంతయు ప్రకాశింపఁజేయుచున్నవి.

మూ. మం. తరణి ర్విశ్వదర్శతో జ్యోతిష్కృ దసి సూర్య।
విశ్వ మా భాసి రోచనం॥ ౪

4. తా. ఓసూర్యుఁడా! నీవు (ఇతరులు దాటలేని మార్గమును) దాటువాఁడవు. నీవే అందఱిచేతఁ జూడఁదగినవాఁడవు. నీవేలోకమునంతయు ప్రకాశింపఁ జేయువాఁడవు. నీవేఅంతట వ్యాపించియుండు ఆకాశమును సైతము ప్రకాశింపఁ జేయుచున్నాఁడవు.

మూ. మం. ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్య ఙ్ఙుదేషి మానుషాన్।
ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే॥ ౫

5. తా. ఓసూర్యుఁడా! నీవు మరుద్దేవతలు, మనుష్యులు, స్వర్గలోక వాసులు, వీరందఱు తమకే యభిముఖముగ ఉదయించుచున్నాఁడు అని తలంచురీతిగ ఉదయించుచున్నాఁడవు.

మూ. మం. యేనా పావక చక్షసా భురణ్యంతం జనా అను ।
త్వం వరుణ పశ్యసి ॥ ౬

6. తా. లోకమునంతయు పవిత్రముగ నొనర్చి దానికికలుగు అనిష్టములను నివారింపఁజేయునట్టి ఓసూర్యుఁడా! నీవీప్రాణులను కాంతిచేత పోషించుచున్నాఁడవు. (అనఁగా నీకాంతిలేనియెడల లోకములుండఁజాలవు) కావున మహిమగల అట్టినీ తేజమును కొనియాడెదము

మూ. మం. విద్యా మేషి రజ స్పృథ్వహా మిమానో అక్తుభిః ।
పశ్య న్జన్మాని సూర్య ॥ ౭

7 తా. ఓసూర్యుఁడా! నీవు అపారమయిన అంతరిక్షలోకమున సంచరింతువు. నీసంచారముచేత రాత్రింబగళ్ళలను భేదముగల కాలము కలుగుచున్నది. భూతజాతమునంతయు నీవే ప్రకాశింపఁజేయుచున్నాఁడవు.

మూ. మం. సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య ।
శోచిష్కేశం విచక్షణ ॥ ౮

8. తా. అంతటఁప్రకాశించు నట్టియు, సర్వమును ప్రకాశింపఁజేయు నట్టియు కాంతిగల ఓసూర్యుఁడా! సప్తసంఖ్యాకములగు అశ్వములు రథమునందు కూర్చుండి కేశములవలె గనంబడు తేజస్సుగలనిన్నుఁ గమ్యస్థానమును పొందించుచున్నవి.

మూ. మం. అయుక్త సప్త శుంధ్యువ సూర్యో రథస్య న ప్త్రీః ।
శోచిష్కేశం విచక్షణ ॥ ౯

9. తా. సూర్యుఁడు జగమును పవిత్రమొనర్చునట్టియు, రథమునుచక్కఁగ వహించునట్టి సప్తసంఖ్యగల ఆడగుఱ్ఱములను తన రథమునకు కట్టెను.

మూ. మం. ఉద్వయం తమస స్పరి జ్యోతి ష్పశ్యన్త ఉత్తరం ।
దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమం ॥ ౧౦

10. తా. మేము రాత్రిపోయిన పిదప ఉదయించువాఁడును, (లోక పాపరహితుఁడును,) తేజోరూపుఁడును, శ్రేష్ఠుఁడును, దేవతలలోపల కొనియాడ దగినవాఁడును అగు సూర్యుని ఉపాసించుచు గొప్పజ్యోతిస్స్వరూపమును పొందెదము.

మూ. మం. ఉద్య న్నద్య మిత్రమహ ఆరోహ న్నుత్తరాం దివం।
హృద్రోగం మమసూర్య హరిమాణం చ నాశయ॥ ౧౧

11. తా. జనులకు మేలొనర్చు కాంతిగలయో సూర్యుఁడా! నీవిప్పుడుదయించి క్రమక్రమముగ ఆకాశమున వ్యాపించుచు హృదయగతమగు (అంతర) రోగమును (శరీరగతములగు పాండు మున్నగు) రోగములను పోగొట్టుము.

మూ. మం. శుకేషు మేహరిమాణం రోపణాకాసు దధ్మసి।
అథో హారిద్రవేషు మే హరిమాణం ని దధ్మసి॥ ౧౨

12. తా. ఓసూర్యుఁడా! నాకుగల హరిద్వర్ణరోగమును చిలుకలయందును, గోరువంకలందును, పచ్చని తీగెలందును ఉంచుచున్నాఁడను. (అనఁగా అచ్చటనేయుండుగాక. మమ్ములను బాధింపకుండుగాక. అని తాత్పర్యము)

మూ. మం. ఉదగాదయ మాదిత్యో విశ్వేన సహసా సహ।
ద్విషన్తం మహ్యం రంధయ న్మో అహం ద్విషతేరధం॥ ౧౩
ప్రథమాష్టకాష్టమా ధ్యాయే సప్తమవర్గే షట్ ఋచః.
౧

13. తా. ఈసూర్యుఁడుదయించుచు తనశక్తినంతయు వినియోగించి నాకపకారమును చేయు రోగమును హింసించుచున్నాఁడు. నేనిఁక అట్టిరోగమునకు ప్రతిక్రియ చేయనక్కఱ లేదు.

మూ. మం. చిత్రం దేవానాముదగా దనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః। ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ॥ ౮౧

14. తా. ప్రకాశించు కిరణ సమూహముకలిగి ఆశ్చర్యమును కలుగఁజేయునట్టియు, మిత్రుఁడు, వరుణుఁడు, అగ్ని మున్నగు దేవతలకు ప్రకాశమును కలుగఁజేయు సూర్యమండల ముదయపర్వతమును పొందెను. ద్యులోక, పృథివ్యంతరిక్షలోక

స్సులందు తనకాంతిని నిండించెను. స్థావరజంగమాత్మ
కమగు ప్రపంచమంతయు ఈసూర్యస్వరూపవే.

మూ. మం. సూర్యో దేవీ ముషసం రోచమానాం మర్యో న యోషా
మభ్యేతి పశ్చాత్ । యత్రా నరో దేవయన్తో యుగాని విత
న్వతే ప్రతి భద్రాయభద్రం ॥ ౧౫

15. తా. ఏయుషఃకాలమునందు దేవతలను పూజింపనిచ్ఛగల మను
ష్యులు అగ్నిహోత్రాదికర్మల నొనర్తురో ప్రకాశించెడి
అట్టి ఉషఃకాలదేవతను సుందరియగు యువతిని కాముకుఁ
డనుసరించు విధముగ సూర్యుఁ డనుసరించుచున్నాఁడు.
అట్టి సూర్యుని మేము మంగళముకొఱకు స్తుతిచేయుచు
న్నాము. లేక ఏయుషఃకాలమునందు దేవతలనుగూర్చి చే
యుయాగములకు ధనమునుకోరు యజమానులు నాగలి
మొన్నగు వ్యయసాయపు పనిముట్లను కైకొనిపోవుదురో
అట్టియుషఃకాలమునందు;) లేక ఏయుషఃకాలమునందు దేవ
తాపూజనమునందిచ్ఛగల యజమానులు పత్నీసహితుల
యి అగ్నిహోత్రాది కర్మలను మంగళఫలప్రాప్తికై చే
యుదురో అనియు ప్రథమార్థమున అభిప్రాయ భేదముల
నెఱుంగునది.)

మూ. మం. భద్రా అశ్వాహరిత స్సూర్యస్యచిత్రా ఏతగ్వా అనుమా
ద్యాసః। నమస్యన్తో దివ ఆ పృష్ఠ మస్థుః పరి ద్యావా
పృథివీ యన్తి సద్యః ॥ ౧౬

16. తా. మంగళస్వరూపములును, వ్యాపించు స్వభావముగలవియు,
హరిద్వర్ణముగలట్టియు, విచిత్రాకారముగలట్టియు, కొని
యాడఁదగినట్టియు (సూర్య) అశ్వములు మాచేనమస్క
రింపఁబడిద్యులోకో పరిప్రదేశమును పొందుచున్నవి. వెం
టనే ద్యులోక పృథివీలోకముల సంచరించుచున్నవి.

మూ. మం. త త్సూర్యస్య దేవత్వం త న్మహిత్వం మధ్యా కర్తో ర్వితతం
సంజభార । యదే దయుక్త హరిత స్సధస్థా దాద్రా
త్రీవాస స్తనుతే సిమస్మై ॥ ౧౭

17. తా. కృష్యాదికర్మలారంభించి చేయుచుండగా తనకిరణ సమూహమును సూర్యుఁడులాఁగికొనుచు వానితోడపనులనుసైతము లాఁగికొనును (అనగా అస్తమానమగుచుండగా పనులు మానుకొందురనుట) ఇట్టిస్వాతంత్ర్యము సూర్యునకుగాక మఱొక్కనికిలేదు. ఆకుపచ్చరంగుగలతన గుఱ్ఱములను రథమునుండి ఎప్పుడువిప్పునో అప్పుడు చిమ్మచీఁకటులు లోకమునంతయు వ్యాపించుచున్నవి.

మూ. మం. తన్మిత్రస్య వరుణ స్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే ।అనన్త మన్య ద్రుశ దస్య పాజః కృష్ణ మన్య ద్ధరిత స్సంభరంతి ॥ ౧౫

18. తా. సూర్యుఁడు ఉదయించునప్పుడు మిత్రుఁడు వరుణుఁడు మున్నగు దేవతలచేతఁగూడుకొనియుండు ప్రపంచమున కభిముఖముగ ఆకాశముయొక్క మధ్యభాగమునందు సర్వమును ప్రకాశింపఁజేయు తనరూపము నుంచుచున్నాఁడు. ఈ సూర్యునికిరణములు అంతములేక అంతట వ్యాపించుచు రాత్రియొక్క అంధకారమును పోగొట్టుటయందు సమర్థమయిన తేజమును ధరించుచున్నవి.

మూ. మం. అద్యా దేవా ఉదితా సూర్యస్య ని రంహసః పిపృతా నిర వద్యాత్ । తన్నో మిత్రో వరుణో మామహంతా మదితి స్సింధుః పృథివీ ఉత ద్యౌః ॥ ౧౬

19. తా. ప్రకాశించుచున్న ఓసూర్యకిరణములారా! ఉదయకాలమునందిటునటు సంచరించు మీరు ఈ సమయమునందు ఈ పాపమునుండి మమ్ములను వేఱుజేయుడు. నేనిప్పుడొనర్చిన ప్రార్థనమును మిత్రుఁడు, వరుణుఁడు, అదితి, సింధువు, పృథివి, ద్యులోకము మున్నగు దేవతలు అంగీకరింతురుగాక (౧. మిత్రుఁడు–మరణమునుండి రక్షించునట్టి అహరభిమానియగు దేవుఁడు. ౨. వరుణుఁడు–అనిష్టములను వారించునట్టి రాత్ర్యభిమాని దేవుఁడు. 3. అదితి–అదీన

యగు దేవమాత. ౮. సింధువు-ఉదకాభిమానియగు దేవత. ౫. పృథివి-భూలోకాధిష్ఠాత్రియగు దేవత. ద్యౌ-ద్యులోకాభిమానియగు దేవత.)

ద్వితీయాష్టక తృతీయాధ్యాయద్వావింశవర్గే ఋచా.

మూ. మం. ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్య స్స సుపర్ణో గరుత్మాన్ । ఏకం సద్విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥ ౨౦

20. తా. ఈ సూర్యునే ఇంద్రునిగను, మిత్రునిగను, వరుణునిగను, అగ్నినిగను ఋషులుపలుకుచున్నారు. దేవసంబంధియు సుపర్ణుడను పేరుగల గరుత్మంతుడును ఇతడే. ఒక్కడైన ఈ సూర్యునే విద్వాంసులు అగ్నియనియు, యముడనియు వాయువనియు పలింతురు.

మూ. మం. కృష్ణం నియానంహరయస్సుపర్ణాఅపోవసానాదివముత్పతన్తి। తఆవవృత్రన్త్సదనాదృతస్యాదిద్ఘృతేన పృథివీవ్యుద్యతే॥ ౨౧

21. తా. నీలవర్ణముగలిగి చరించుమేఘములందు ఉదకమును గ్రహించుచు చక్కని గమనముగల కిరణములు జలమునుంచుచు సూర్యుని పొందుచున్నవి. ఆకిరణములు జలస్థానమగు సూర్యమండలము నుండి తిరిగి భూలోకమున కభిముఖముగవచ్చుచు వెంటనే జలముచేత భూమిని తడుపుచున్నవి.

తృతీయాష్టక సప్తమాధ్యాయచతుర్దశవర్గేఏకాఋక్.

మూ. మ. హంస శ్శుచిష ద్వసురంతరిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణసత్ । నృష ద్వరస దృతస ద్వ్యోమస దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం ॥ ౨౨

22. తా. అంతట చరించువాడును పవిత్రమగు ద్యులోకమునయుండువాడును, అంతటవసించువాడు (వాయుస్వరూపు)డును, దేవతలను పిలుచునట్టి అగ్ని స్వరూపుడును, గార్హపత్యాద్యగ్నులందుండువాడును, అతిథివలె అవశ్యము పూజింపదగినవాడును, గృహములందు పాకాదికమున కుప

యోగించు అగ్ని స్వరూపుఁడును, మనుష్యులందు చైత
న్యరూపమున నుండువాఁడును, మండలాంతర్వర్తియగువాఁ
డును, అంతరిక్షస్థమగువాయు స్వరూపుఁడును, జలమధ్య
మందుద్భవించినవాఁడును, కిరణములయందు పుట్టినవాఁడు
ను, అపరోక్షముగఁగనఁబడువాఁడును, ఉదయాద్రియందు
గనంబడువాఁడును అగు ఈసూర్యుఁడే దేశకాలత్రయా
బాధ్యమగు పరబ్రహ్మము.

చతుర్థాష్టక ద్వితీయాధ్యాయే పశవర్గే ఏకాదశ ఋక్.

మూ. మం. యత్త్వా సూర్య స్వర్భాను స్తమసా విధ్య దాసురః ।
అక్షేత్రవి ద్యథా ముగ్ధో భువనా న్యదీధయుః ॥ ౨౩

23. తా. ఓసూర్యుఁడా! రాక్షసీపుత్రుఁడగు (లోకపాపాపహర్తయగు) స్వర్భానువు మాయానిర్మితమగు అంధకారము చేత నిన్నెప్పుడు ఆవరించెనో అప్పుడు లోకములన్నియు తమ తమ స్థానంబులనుకూడ ఎఱుంగజాలనంత మూఢత్వము కలదిగ గనంబడెను.

పంచమాష్టక ప్రథమాధ్యాయే ప్రథమవర్గే ఏకాదశ ఋక్.

మూ. మం. యదద్య సూర్య బ్రవోఽనాగా ఉద్య న్మిత్రాయ వరు
ణాయ సత్యం। వయం దేవత్రా ఽదితే స్యామ తవ ప్రియా
సో అర్యమ న్గృణంతః ॥ ౨౪

24. తా. సర్వప్రేరకుఁడవగునో దేవా! ఉదయించుచున్న నీవీయనుష్ఠానకాలమునందు "వీరు పాపాత్ములుకారు" అని ఒక్క మాటపలుకుము. అప్పుడు మేము దేవతలలోపల మిత్రునకు వరుణునకు నిశ్చయముగ అపాపులము (పుణ్యాత్ములము) అయ్యెదము. అదీనుఁడవగు ఓఅర్యముఁడా! మేము దేవతలలోపల నిన్నే కొనియాడుచు నీకు ప్రియులమయ్యెదము.

పంచమాధ్యాయ చతుర్థవర్గే తిస్ర ఋచః.

మూ. మం. ఉ త్సూర్యో బృహ దర్చీం ష్యశ్రే త్పురు విశ్వా జనిమ
మానుషాణాం । సమో దివా దదృశే రోచమానః క్ర
త్వా కృత స్సుకృతః కర్తృభి ర్భూత్ ॥ ౨౫

25. తా. సర్వ ప్రేరకుఁడగుటచేత సూర్యుఁడనంబడునట్టి దేవుఁడు విశేషకాంతులను మనుష్యసమూహములను గూర్చి అధికముగ ఊర్ధ్వమునకు వ్యాపింపఁజేయుచున్నాఁడు. ఆ దేవుఁడు సకల ప్రపంచమునకు కర్తయు, ప్రజాపతిచేత నిందుకుగాను చేయఁబడినవాఁడును, స్తుతిచేయువారిచేత చక్కఁగ స్తుతిచేయఁబడినవాఁడును అగుచున్నాఁడు.

మూ. మం. స సూర్య ప్రతి పురో న ఉద్గా ఏభి స్తోమేభి రేతశేభి రేవైః। ప్రనో మిత్రాయ వరుణాయ వోచో ఽనాగసో అర్యమ్ణే అగ్నయే చ ॥ ౨౬

26. తా. ఓ సూర్యుఁడా! సుప్రసిద్ధుఁడవగునీవు కొనియాడఁదగినట్టియు, పచ్చని వర్ణముగల అశ్వములతోడ మాకభిముఖముగ ఉదయించుము. ఆప్రకారముదయించి మాచేత కొనియాడఁబడుచున్నవాఁడవై మమ్ములను అపాపులనుగ మిత్రునకు వరుణునకు అర్యమకు అగ్నికి పలుకుము.

మూ. మం. వి న స్సహ్యాసం శుచయో రద స్వ్రతావానో వరుణో మిత్రో అగ్నిః। యచ్ఛంతు చంద్రా ఉపమం నోఅర్కం మానః కామం పూపురస్తు స్తవానాః ॥ ౨౭

27. తా. దుఃఖమును ప్రతిరోధించునట్టివారును సత్యవంతులునుఅగు వరుణుఁడు, మిత్రుఁడు, అగ్నియను దేవతలు మాకువేల కొలఁదిధనము నిత్తురుగాక. ఆహ్లాదమును కలుగఁజేయు నై దేవతలు కొనియాడఁదగినట్టియు పూజించఁదగినట్టియు దానిని ఇత్తురుగాక. మాచేతఁ గొనియాడఁబడినవారలయి మావాంఛితములను పూరింతురుగాక.

పంచమాధ్యాయే పంచమేవర్గే చత్వారః ఋచః, షికో ఽర్ధర్చః.

మూ. మం. ఉ ద్వేతి సుభగో విశ్వచక్షా స్సాధారణ స్సూర్యో మానుషాణాం।చక్షు ర్మిత్రస్య వరుణస్య దేవ శ్చర్మేవ య స్సమవివ్య క్తమాంసి ॥ ౨౮

28. తా. చక్కఁగ కొనియాడఁ దగినవాఁడును, ప్రపంచమునంతయు చూచువాఁడును, మనుష్యులకుసాధారణుఁడును, మిత్రావరు

ణులను ప్రకాశింపఁజేయువాఁడును దేవుఁడును చీఁకటులను చ
ర్మమునందు పెట్టి కట్టివేయువాఁడును (అనఁగా) అంధకార
ము కనులకుకనంబడకుండ చేయువాఁడును సుప్రసిద్ధుఁడును అ
గు సూర్యుఁడుదయించుచున్నాఁడు.

మూ. మం. ఉద్వేతి ప్రసవీతా జనానాం మహా న్కేతు రర్ణవ స్సూ
ర్యస్య। సమానం చక్రం పర్యావివృత్స న్యదేతశో వహతి
ధూర్షుయుక్తః ॥ ౨౯

29. తా. సకల ప్రాణులను ఆయాకర్మలయందు ప్రేరేపించువాఁడును,
పూజ్యుఁడును, సకలమునకు ప్రజ్ఞాపకుఁడును జలమునిచ్చు
వాఁడును అగు సూర్యుఁడు హరిద్వర్ణముగల అశ్వముచే
వహింపఁబడినదియు, అందఱకుసమానమగు రూపముగలి
గిన ఒక చక్రముగల రథమును కదలించు నిచ్ఛతో ఉద
యించుచున్నాడు.

మూ. మం. విభ్రాజమాన ఉషసా ముపస్థా ద్రేభై రుదే త్యనుమద్య
మానః। ఏష మే దేవ స్సవితా చచ్ఛంద య స్సమానం
న ప్రమినాతిధామ ॥ ౩౦

30. తా. ఈసూర్యుఁడు ప్రకాశించుచు ఉషఃకాలమునందు స్తోతల
చేత కొనియాడఁబడుచు ఉదయించుచున్నాఁడు. ప్రకా
శించు నీదేవుఁడు నావాంఛితముల నిచ్చును. ఇతఁడు త
న ప్రకాశమును అందఱకు సమానముగ నిచ్చును.

మూ. మ. దివో రుక్మ ఉరుచక్షా ఉదేతి దూరే అర్థ స్తరణి ర్భ్రాజ
మానః। నూనం జనా స్సూర్యేణ ప్రసూతా అయ న్నర్థాని
కృణవ న్నపాంసి ॥ ౩౧

31. తా. ఈసూర్యుఁడు గొప్ప తేజముగల వాఁడై ప్రకాశించుచు
అంతరిక్షమున ఉదయించుచున్నాఁడు. ఇతఁడు మిగుల
దూరప్రదేశమునకుఁబోవువాఁడును అనుట నిశ్చయము. జ
నులందఱు సూర్యునిచేత ప్రేరేపింపఁబడినవారలయి చేయఁ
దగిన సకలకార్యములను చేయుచున్నారు.

మూ. మం. యత్రా చక్రురమృతా గాతు మస్మై శ్యేనో నదీయన్న న్వేతి పాథః ॥ 32
32. తా. ఏయంతరిక్షలోకమున దేవతలు సంచారార్థము సూర్యున కు మార్గమిచ్చిరో ఆమార్గము సంచరించునట్టి డేగవలె ఆ కాశమునే అనుసరించుచున్నది.

పంచమాధ్యాయ దశమవర్గే ద్వే ఋచౌ.

మూ. మం. ఉ దు త్యద్దర్శతం వపుర్దివ ఏతి ప్రతిహ్వరే। య దీమాశు ర్వహతి దేవ ఏతశో విశ్వస్మై చక్షసేఅరం॥ 33
33. తా. ఏమండలమును శీఘ్రగామియగు హరితవర్ణముగల అశ్వము వహించుచున్నదో చూచుటకు రమ్యమగు నట్టిమండలము అందఱు చక్కఁగ చూచుటకుగాను అంతరిక్షమునందు ఇపుడే ఉదయించుచున్నది.

మూ. మం. శీర్ష్ణః శీర్ష్ణో జగత స్తస్థుష స్పతిం సమయా విశ్వమా రజః। సప్త స్వసార స్సువితాయ సూర్యం వహంతి హరితో రథే॥ 34.
34. తా. ఇతర సహాయము లేకయే బలముగలిగినట్టియు హరితవర్ణ ముగల అశ్వములు స్థావరజంగమ రూపమగు ప్రపంచము న కంతయు అధిపతియు రథస్థుఁడును అగుసూర్యుని లోక మంతయు చూచునటుల తమ శిరంబులచేత వహించుచు న్నవి.

పంచమాధ్యాయైకాదశ వర్గే ఏకా ఋక్

మూ. మం. తచ్చక్షు ర్దేవహితం శుక్రముచ్చరత్ ।
పశ్యేమ శరద శ్శతం జీవేమ శరద శ్శతం ॥ 35.
35. తా, ప్రసిద్ధమును, సర్వమును ప్రకాశింపఁజేయునదియు, హవిస్స్వీకా రముచేత దేవతలకు హితమును చేయునదియు నిర్మలమును అగు సూర్యమండలము దయించుచున్నది. మేము ఈమండల మును వందలకొలఁది సంవత్సరములు గాంచుచు జీవించి యుందుముగాక.

షష్ఠాష్టకే సప్తమాధ్యాయే ద్వాదశవర్గే ద్వేఋచౌ.

మూ. మం. బ ణ్మహాఁ అసి సూర్య బళాదిత్యస్య మహాఁ అసి।

మహాస్తే సతో మహిమా పనస్యతే ఉద్ధా దేవ మహాం అసి॥

36. తా. ఓసూర్యుఁడా! నీవే తేజస్సుచేత అధికుఁడవు. ఇది సత్యము. ఓయాదిత్యుఁడా! నీవే బలవంతుఁడవు. ఇదియథార్థము. గొప్పవాఁడవగు నీయొక్క మహిమను స్తోతలు కొనియాడుచున్నారు. ఓదేవా! నీవు వీర్యమునందును అధికుఁడవే! ఇత్యాది నిశ్చయము.

మూ. మం. బట్ సూర్య శ్రవసా మహాం అసి సత్రా దేవ మహాం అసి। మహ్నా దేవానా మసుర్యః పురోహితో విభుజ్యోతి ర దాభ్యం ॥ ౩౭

37. తా. ఓసూర్యుఁడా!నీవు శ్రవణముచేత గొప్పవాఁడవు. ఇత్యాది సత్యము. ఓసూర్యుఁడా!నీవు దేవతలలోపల గొప్పవాఁడవు. ఇదియథార్థము. అసురహంతవును దేవతలకు హితోపదేష్టవునునీవ. నీ తేజము గొప్పది. ఇతరులచేత హింసింపఁదగనిదియు.

సప్తమాష్ట కాష్టమాధ్యాయ ద్వాదశవరే ఒట్ ఋచః

మూ. మం. నమో మిత్రస్య వరుణస్య చక్షసే మహో దేవాయ తదృతం సపర్యత । దూరేదృశే దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శంసత ॥ ౩౮

38. తా ఓఋత్విక్కులారా! మీరు మిత్రావరుణులఁగాంచువాఁడును, గొప్పవాఁడును, ప్రకాశించువాఁడును, దూరమునందున్నవారినిఁగూడచూచు వాఁడును, దేవతల కొఱకు పుట్టినవాఁడును, ప్రపంచమునకు ప్రజ్ఞాపకుఁడును, ద్యులోకమున జన్మించుటచేత ద్యులోకమునకు పుత్రుని వంటివాఁడును అగుసూర్యునకు నమస్కరించి శాస్త్రవిహితములగు యజ్ఞయాగాదికర్మలను చేయుఁడు. పూజింపుఁడు. స్తుతిని చేయుఁడు.

మూ. మం. సా మా సత్యోక్తిః పరిపాతు విశ్వతో ద్యావా చ యత్ర తతన న్నహాని చ । విశ్వ మన్యం నివిశతే యదేజతి విశ్వాహా ఽఽపో విశ్వా హోదేతి సూర్యః ॥ ౩౯

39. తా. ఏసత్యవచనముచేత ద్యావాపృథ్వ్యులు రాత్రింబగళ్ళు వ్యాపించునో అచ్చటభూతజాతమంతయు విశ్రమించుచున్నది. ఏసత్యవచనముచేత భూతములన్నియు కదలించుచున్నవో ఎల్లప్పుడు జలములు ప్రవహించుచున్నవో ఎల్లప్పుడు సూర్యుఁడుదయించుచున్నాఁడో అట్టిసత్యవచనమునన్ను రక్షించుగాక.

మూ. మం. న త్తే అదేవః ప్రిదివో నిహాసత్తే య దేతశేభిః పతరై రథర్యసి। ప్రాచీన మన్య దనువర్తతే రజ ఉ దన్యేన జ్యోతిషాయాసిసూర్య ॥ ౪౦

40. తా. సూర్యుఁడా! నీవు చక్కఁగ నడుచునట్టి గుఱ్ఱములను రథమునకు కట్టుటకు నెప్పుడు తలఁతువో అప్పుడు నీసమీపమున రాక్షసుఁడెవ్వఁడును ఉండఁడు. నీసంబధమగు జ్యోతిస్సుజలమునందుచేరును. నీవు మఱొక కాంతితోడ ఉదయింతువు.

మూ. మం. యేన సూర్య జ్యోతిషా బాధసే తమో జగచ్చ విశ్వము దియర్షి భానునా। తేనాస్మ ద్విశ్వా మనిరా మనాహుతి మపా మీవా మప దుష్వప్న్యం సువ ॥ ౪౧

41. తా. ఓసూర్యుఁడా! నీవు ఏకాంతిచేత అంధకారమును పోగొట్టుచున్నాఁడవో, ఏకాంతిచేత ప్రపంచమునంతయు మేల్కొలుపుచున్నాఁడవో ఆకాంతిచేత మాకుగల అన్నాభావమును, అనాహుతిని, రోగజాతమును, దుస్స్వప్నమువలన పుట్టెడి అరిష్టమును పోగొట్టుము.

మూ. మం. విశ్వస్యహి ప్రేషితో రక్షసి వ్రత మహేళయ న్నుచ్చరసి స్వధా అను ।యదద్య త్వా సూర్యో ప బ్రవావహై తన్నో దేవా అను మంసీరత క్రతుం ॥ ౪౨

42. తా. యజ్ఞరక్షార్థము పరమేశ్వరుని చేత పంపఁబడిననీవు కోపము లేనివాఁడవై అందఱు చేయు యజ్ఞాది సత్కర్మలను రాక్షసులు ధ్వంసము చేయకుండ కాపాడెదవు. మేము ప్రాతర్హోమము చేయుచుండఁగానే ఉదయింతువు. ని

న్నుఁగూర్చి మేము దేనిని పలికెదమో దానిని ఇంద్రాది దేవతలంగీకరింతురుగాక.

మూ. మం. తన్నో ద్యావాపృథివీ తన్న ఆప ఇంద్రశ్శృణ్వన్తు మరుతో హావం వచః। మా శూనే భూమ సూర్యస్య సందృశి భద్రం జీవంతో జరణా మశీమహి ॥ ౪౩

43. తా. ద్యావాపృథ్వులు, జలములు, ఇంద్రుఁడు, మరుత్తులు వీరందఱు మేముచేయుచున్న స్తోత్రమును విని యెదరుగాక. మాకు సూర్యదర్శనము దుఃఖముకొఱకు గాక చిరకాలము జీవించుటకును మంగళకరము నాదగు వృద్ధత్వమును పొందుటకును అగుఁగాక.

అష్టమాధ్యాయ త్రయోదశవర్గే షట్ ఋచః.

మూ. మం. విశ్వాహా త్వా సుమనస స్సుచక్షసః ప్రజావంతో అనమీవా అనాగసః। ఉద్యన్తం త్వా మిత్రమహో దివేదివే జ్యోగ్జీవాః ప్రతి పశ్యేమ సూర్య ॥ ౪౪

44. తా. ఓసూర్యుఁడా! ప్రీతిగలమనస్సుగలవారమును, మంచి చూపుగలవారమును పుత్రపౌత్రాది యుతులమును రోగవిహీనులమును అపరాధవిహీనులమును అగుమేము ఎల్లప్పుడు నిన్ను పూజించెదము. మిత్రులకు పూజనీయుఁడవగు ఓసూర్యుఁడా ప్రత్యహము ఉదయించుచున్న నిన్ను మేము చిరకాలము జీవించుచు చూచుచుందుముగాక.

మూ. మం. మహి జ్యోతి ర్బిభ్రతం త్వా విచక్షణ భాస్వన్తం చక్షుషే చక్షుషే మయః। ఆరోహంతంబృహతః పాజస స్పరివయం జీవాః ప్రతి పశ్యేమ సూర్య ॥ ౪౫

45. తా. చక్కఁగా జూచునట్టి ఓసూర్యుఁడా! గొప్ప తేజమును ధరించినట్టియు, ప్రకాశించుచున్నట్టియు, చూచుచున్న వారందఱకు కనులకు సుఖమును కలుగఁజేయునట్టియు, సముద్ర జలముపై నారోహించుచున్నట్టియు నిన్ను చిరకాలము జీవించుచు మేము ప్రత్యహము చూచుచుందుముగాక.

మూ. మం. యస్య తే విశ్వా భువనాని కేతునా ప్ర చేరతే ని చ విశంతే అక్తుభిః । అనాగాస్త్వేన హరికేశా సూర్యాహ్నాఽహ్నా నో వస్యసావస్య సో దిహి ॥ ౪౬

46. తా. హరిద్వర్ణ కేశములుగల ఓసూర్యుఁడా! ఏనీయొక్క ప్రజ్ఞానము చేత భూతజాతములన్నియు చరించుచున్నవో రాత్రిళ్లతోఁడ విశ్రమించుచున్నవో అట్టి నీవు అపరాధము లేక పోవుటచేత మిక్కిలి శ్రేయస్కరమయినదినములతోఁడ ఉదయించుము.

మూ. మం. శం నో భవ చక్షసా శం నో అహ్నా శం భానునా శం హిమా శం ఘృణేన। యథా శమధ్వంచ్ఛమసద్దురోణే తత్సూర్య ద్రవిణం ధేహి చిత్రమ్ ॥ ౪౭

47. తా. ఓసూర్యుఁడా! నీవు తేజముచేత నాకుసుఖకరుఁడవు కమ్ము. పగటిచేతనాకు సుఖకరుఁడవుకమ్ము. కిరణముచేత నాకు సుఖకరుఁడవుకమ్ము. శైత్యముచేతను ఉష్ణముచేతను సుఖకరుఁడవు కమ్ము. దేనిచేతమాకు మార్గమునందును గృహమునందును సుఖముకలుగునో అట్టి పూజనీయమగు ధనమును నాకివ్వుము.

మూ. మం. అస్మాకం దేవా ఉభయాయ జన్మనే శర్మ యచ్ఛత ద్విపదే చతుష్పదే। అదత్పిబదూర్జయమానమాశితం తదస్మే శం యోరరపో దధాతన ॥ ౪౮

43. తా. ఓదేవతలారా! (మీరు సూర్యునిచే ననుజ్ఞాతులయి) మాయొక్క మనుష్యులకును చతుష్పాజ్జంతువులకును సుఖము నివ్వుఁడు. మాపుత్రపౌత్రాదులు తినుటకు త్రాగుటకు బలకరమగు ఆహారమునందుటకు తగినవారై రోగరాహిత్యమగు సుఖమును విషయోపభోగభూతమగు సుఖమును పాపవిహీనతను పొందునటుల చేయుఁడు.

మూ. మం. యద్వో దేవాశ్చకృమ జిహ్వయా గురు మనసో వా ప్రయుతీ దేవహేళనం। అరావా యో నో అభి దుచ్ఛునాయతే తస్మిన్య దేనో వసవో నిధేతన ॥ ౪౯

49. తా. అంతటనివసించునో దేవతలారా! మేము మీకు మనోవాక్కాయ కర్మములందు కోపించ దగిన గొప్పయపరాధమును చేసిన యెడల ఆయపరాధమును మమ్ములను గూర్చి ద్వేషించుచు మాకపకార మొనర్చి మమ్ములను పీడించునట్టి మాశత్రువునందుసూర్యుని యాజ్ఞచేతనుంచి ఆయపరాధఫలమును వానికొసంగుడు.

అల్పమాప్తకాల్పమాధ్యయ షోడశవరే పంచ ఋచః.

మూ. మం. సూర్యో నో దివ స్పాతు వాతో అంతరిక్షాత్ । అగ్ని ర్నః పార్థివేభ్యః ॥ ౫౦

50. తా. సర్వప్రేరకుఁడగు సూర్యుఁడుఅంతరిక్షలోకమునుండి మమ్ము రక్షించుగాక. వాయువు అంతరిక్షలోకమునుండి మమ్ము రక్షించుగాక. అగ్ని భూలోకమునందుండు శత్రువులనుండి మమ్ము రక్షించుగాక.

మూ. మం. జోషా సవిత ర్యస్య తే హర శ్శతం సవాం అర్హతి । పాహి నో దిద్యుతః పతంత్యాః ॥ ౫౧

51. తా. ఓ సూర్యుఁడా! మేముచేయుస్తుతినివినుము. నీకాంతిబహువిధములగుయజ్ఞములందు పూజింపఁబడును. శత్రువులుమాపై ప్రయోగించు శక్తియున్నగు ఆయుధములవల్ల నుండి మమ్ము రక్షింపుము.

మూ. మం. చక్షు ర్నో దేవ స్సవితా చక్షు ర్న ఉత పర్వతః । చక్షు ర్ధాతా దధాతు నః ॥ ౫౨

52. తా. సవితయను దేవుఁడు మాకు వస్తువులఁగనఁబడఁజేయుచక్షురింద్రియము నిచ్చుగాక ఇంద్రుని మిత్రమగు పర్వతుఁడును మాకు చక్షురింద్రియము నిచ్చుగాక. అంతయు సృజించుధాతయుమాకు చక్షురింద్రియము నిచ్చుగాక.

మూ. మం. చక్షు ర్నో ధేహి చక్షుషే చక్షు ర్విఖ్యై తనూభ్యః । సం చేదం వి చ పశ్యేమ ॥ ౫౩

53. తా. ఓసూర్యుఁడా! రూపగ్రహణము చేయు మాచక్షురింద్రియమునకు రూపమును గ్రహించు సామర్థ్యము నిమ్ము.

మాసంతానమునకున్ను కట్టిసామర్థ్యము నిమ్ము. నీవిట్లు అనుగ్రహించిన యెడల జగత్తునంతయు చక్కఁగఁగాంచె దము.

మూ మం. సు సన్దృశం త్వా వయం ప్రతి పశ్యేమ సూర్య ।
వి పశ్యేమ నృచక్షసః ॥ ౫౪

54. తా. ఓసూర్యుఁడా! ప్రపంచమునంతయు చక్కఁగాఁ గాంచు నిన్ను మేమందఱము ప్రత్యేకముగఁగాంచెదము. మమ్ము లను ద్వేషించు శత్రువులను హింసించుచు విశేష జ్ఞాన వంతులమయ్యెదము.

అష్టమాధ్యాయాష్టావింశవర్గే చతస్రః ఋచః.

మూ. మం. విభ్రాడ్బృహత్పిబతు సోమ్యం మధ్వాయుర్దధద్యజ్ఞప తావవిహ్రుతం । వాతజూతో యో అభిరక్షతి త్మనా ప్రజాః పుపోష పురుధా విరాజతి ॥ ౫౫

55. తా. ప్రకాశించునట్టి సూర్యుఁడు యజ్ఞమొనర్పుయజమానునకు అకుటిలమగు ఆయువును ఇచ్చుచు మహావాయువుచేత ప్రే రేపింపఁబడినవాఁడైస్వయముగ జగమునంతయుపరిపాలించు చు చంద్రరూపమగు గొప్పమధువును పానముచేయుఁగా క. అట్టిసూర్యుఁడు వృష్టిమున్నగువానిచేత ప్రజలను పోషిం చుచు పలువిధముల వెలుంగుచున్నాఁడు.

మూ. మం. విభ్రాడ్బృహత్సుభృతం వాజసాతమం ధర్మన్దివో ధ రుణేసత్యమర్పితం।అమిత్రహావృత్రహాదస్యుహంతమంజ్యోతి ర్జజ్ఞే అసురహా సపత్నహా ॥ ౫౬

56. తా. ప్రకాశించుచున్నదియు, గొప్పదియు, చక్కఁగ పోషింపఁ బడినదియు, బలమును బాగుగనిచ్చునదియు, వాయువుచే త ధరించఁదగినట్టియు ద్యులోకమునుధరించునట్టియుసూర్య మండలమునందు ఉంచబడినట్టియు, నశించనదియు, శత్రు వులనుఆదరించువారెని దస్యులను అసురులను సహజశత్రు వులను హరించునట్టి సూర్యసంబంధమగు తేజముద్భవించు చున్నది.

మూ. మం. ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతి రుత్తమం విశ్వజి ద్ధనజి దు
చ్యతే బృహత్ । విశ్వభ్రా డ్భ్రాజో మహి సూర్యో దృశ
ఉరు పప్రథే సహ ఓజో అచ్యుతం ॥ ౫౭

57. తా. ఈసూర్య సంబంధమగు తేజము కాంతిగలవానిలోపల శ్రే
ష్ఠమనియు, సర్వోత్కృష్టమనియు, ప్రపంచమును జయించి
నదనియు, ధనమును జయించినదనియు,గొప్పదనియుఅంద
ఱు పలుకుచున్నారు. ప్రపంచమును ప్రకాశింపఁజేయు
చు వెలుఁగునట్టియుఁ, గొప్పవాఁడును అగు సూర్యుఁడు వి
స్తీర్ణమయినట్టియు అంధకారమును పోగొట్టునట్టియు నాశ
నరహితమును అగు తేజమును చూచుటకొఱకు విస్తరింపఁ
జేయుచున్నాఁడు.

మూ. మం. విభ్రాజం జ్యోతిషా స్వ౨రగచ్ఛో రోచనం దివః । యే
నేమా విశ్వా భువనా న్యాభృతా విశ్వకర్మణా విశ్వ
దేవ్యావతా ॥ ౫౮

58. తా. ఓసూర్యుఁడా! సకలదేవతలకు హితమగుఏసూర్యకాంతిచేత
ఈకనంబడు జలమంతయు ఘర్మకాలమునందు పీల్చివేయఁ
బడుచున్నదో అట్టి తేజముచేత స్వర్గలోకమును ప్రకాశింపఁ
జేయుచున్నవాఁడవై దివమునకు ఆభరణము అయితివి.

అథ సూర్యాధ్యాయ సప్తచత్వారింశే వర్గే త్రిసః ఋచః.

మూ. మం. ఆయం గౌః పృశ్ని రక్రమీ దసద న్మాతరం పురః ।
పితరం చ ప్రయ న్స్వః ॥ ౫౯

59. తా. గమనశీలుఁడును లబ్ధకాంతియునగు ఈసూర్యుఁడు ఉదయా
చలమును పొందెను. పిదప ప్రాగ్దిశయందు భూతజాతము
ను నిర్మించుచు పృథివిని పొందుచున్నాఁడు. తరువాత ద్యు
లోకమును అంతరిక్షలోకమును శీఘ్రముగ ఆక్రమించుచు
ప్రకాశించుచున్నాఁడు.

మూ. మం. అన్త శ్చరతి రోచనాఽస్య ప్రాణా దపానతీ ।
వ్యఖ్య న్మహిషో దివం ॥ ౬౦

60. తా. ఈసూర్యుని ప్రకాశించుదీప్తి శరీరాంతర్భాగమున ముఖ్యప్రాణరూపమున నుండి నాడులచేత ఊర్ధ్వభాగమునకు ప్రాణవాయువును గ్రహించి మఱల నధోభాగమునకు వదలుచున్నది. కావున గొప్పవాఁడగు సూర్యుఁడు అంతరిక్షమును ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

మూ. మం. త్రింశ ద్ధామ విరాజతి వాక్పతంగాయ ధీయతే ।
ప్రతి వస్తో రహ ద్యుభిః ॥ ౬౧

61. తా. అహోరాత్రావయవరూపములగు 30 స్థానములు (అనఁగా 30ముహూర్తములు) సూర్యకాంతుల చేత ప్రకాశించుచున్నవి. అందఱు సూర్యుని స్తుతిచేయుచున్నారు.

అష్టమాధ్యాయాష్టాచత్వారింశే వర్గే త్రిసః ఋచః.

మూ. మం. ఋతం చ సత్యం చాభీద్ధా త్తపసో ఽధ్యజాయత ।
తతో రాత్ర్యజాయత తత స్సముద్రో అర్ణవః ॥ ౬౨

మూ. మం. సముద్రా దర్ణవా దధి సంవత్సరో అజాయత ।
అహో రాత్రాణి విదధ ద్విశ్వస్య మిషతో వశీ ॥ ౬౩

మూ. మం. సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ ।
దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥ ౬౪

62. తా.
63. తా. } వీని తాత్పర్యమును. ౫౩ వ పుటయందు చూడుఁడు.
64. తా.

సప్తమాష్టకాష్టమాధ్యాయైకాదశవర్గే ఏకా ఋక్.

మూ. మం. సవితా పశ్చాతా త్సవితా పురస్తా త్సవితోత్తరాత్తా త్సవితాఽధరాత్తాత్ । సవితా నస్సువతు సర్వతాతిం సవితా నో రాసతాం దీర్ఘ మాయుః ॥ ౬౫

ఇతి సౌరమంత్రపాఠ స్సమాప్తః.

65. తా. పశ్చిమ దిక్కునందున్నట్టియు, ప్రాగ్దిశయందున్నట్టియు, ఉత్తరమునందున్నట్టియు దక్షిణ దిగ్భాగమునందున్నట్టియు సవిత మాకు వాంఛితములన్నింటిని ఇచ్చుగాక. సవితయే మాకు దీర్ఘాయువు నిచ్చుగాక.

ఫలశ్రుతిః.

యేనసూర్యేణాహరహ రుపాసితేన ధనధాన్యవంతో బహురత్నవంత ఆదిత్యవన్త ఆయుష్యవన్త ఆరోగ్యవంతో రయివంతో ధనవంతో బలవంతో బహుపుత్రవంతో భవంతి॥ శ్రీకామః శాంతికామః శ్రద్ధాకామోమేధాకామః ప్రజ్ఞాకామ ఏవం భాస్కరస్యారాధనంకుర్యాత్ సదాగృహీ। పాపక్షయార్థీ, నమఃపరమఋషిభ్యో నమః పరమఋషిభ్యో నమః పరమఋషిభ్యః॥

సూర్యనమస్కారవిధి సమాప్తము.

వి వ ర ము.

మేమిపుడిచట వ్రాసిన "తృచాకల్పసూర్యనమస్కారపద్ధతి" ఋగ్వేదీయాహ్నికగ్రంథమునుండిగ్రహించివ్రాసితిమి. ఇటులనమస్కారములు చేసిపిదపఇందుముద్రించిన మహాసౌరమంత్రములతో సూర్యుని ధ్యానించవలయును. తైత్తిరీయారణ్యాక ప్రథమప్రశ్నమును సూర్యధ్యానమునకు ఆంధ్రదేశమునందుండు యజుర్వేదీయులలో పలువురు గ్రహించుచున్నారు.

మఱికొందఱు అంగన్యాసకరన్యాసములు, పీఠపూజలు మున్నగునవి చేయుచు పురుషసూక్తముచేత షోడశోపచార పూజలుచేసి నమస్కారాదికము చేయుచున్నారు. సూర్యపూజకు రక్తాక్షతరక్తపుష్పతామ్రపాత్రములు ప్రశస్తములు.

---

# సూర్యోపస్థానమ్.

ఓం, సహనావవతు। సహనౌభునక్తు। సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ఓం॥శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

మూ. మం. ఆదిత్యో వా ఏష ఏతన్మణ్డలన్తపతి తత్ర తా ఋచస్తదృచా మణ్డలగ్ం స ఋచాం లోకోఽథ య ఏష ఏతస్మిన్మణ్డలేఽర్చిర్దీప్యతే తాని సామాని ససామ్నాం లోకోఽథ య ఏష ఏతస్మిన్మణ్డలేఽర్చిషి పురుషస్తాని య

జూగ్ంషిస యజుషా మణ్డలగ్ం సయజుషాం లోక స్సైషా
త్ర్యయ్యేవవిద్యా తపతి యఏ షో న్తరా దిత్యే హిరణ్మ
యః పురుషః॥ ౧.

మూ. మం. ఆదిత్యోవై తేజఓజోబలం యశశ్చక్షు శ్శ్రోత్ర మాత్మా
మనో మన్యు ర్మను ర్మృత్యు స్సత్యో మిత్రో వాయు రా
కాశః ప్రాణో లోకపాలః కః కిం కం తత్సత్య మన్న మ
మృతో జీవో విశ్వః కతమ స్స్వయమ్భు బ్రహ్మైతదమృత
ఏషపురుష ఏషభూతానా మధిపతి బ్రహ్మణ స్సాయుజ్య
గ్ం సలోకతా మాప్నో త్యేతాసా మేవ దేవతానాగ్ం
సాయుజ్యగ్ం సార్ష్టి తాగ్ం సమానలోకతా మాప్నోతి
యఏవం వేదేత్యుపనిషత్॥ ౨.

శ్లో. మండలాన్తరగతం హిరణ్మయం
భ్రాజమానవపుషం శుచిస్మితం ।
చణ్డదీధితిమఖణ్డవిగ్రహం
చిన్తయేన్మునిసహస్రసేవితమ్ ॥ ౧

శ్లో. ధ్యేయస్సదాసవితృమణ్డలమధ్యవర్తీ
నారాయణస్సరసిజాసనసన్నివిష్టః ।
కేయూరవాన్మకరకుణ్డలవాన్కిరీటీ
హారీహిరణ్మయవపుర్ధృతశఙ్ఖచక్రః. ౨

శ్లో. నమస్సవిత్రేజగదేకచక్షుషే
జగత్ప్రసూతిస్థితినాశహేతవే ।
త్రయీమయాయత్రిగుణాత్మధారిణే
విరిఞ్చినారాయణశఙ్కరాత్మనే ॥ 3

తా. ఈ అనువాకమునందు ఆదిత్యమండలమునందు పరబ్రహ్మము
ను ఉపాసించు విధముచెప్పఁబడుచున్నది:—

పరమేశ్వరుఁడే సోపాధికుఁడై ఆదిత్యరూపమున ప్రకాశించుచు
చున్నాఁడు. వర్తులాకారముగ వెలుఁగుచున్న ఈ మండలము ఆది
త్యునిదే. ఈ మండలము నందే వైదిక ఋక్కులున్నవి. కావున

ఈ మండలమునందు ఋగభిమాని దేవతలున్నారు. ఈ మండల మునందు ప్రకాశించు కాంతియే సామస్వరూపమని భావింపవలయును. కనుక ఆకాంతియందు సామాభిమాని దేవతలున్నారు. శాస్త్రప్ర సిద్ధుఁడై ఈ మండల మధ్యమునందున్న కాంతియందు ప్రకాశించు పురుషుని యజూరూపముగ భావింపవలయును. ఈపురుషుఁడే యజు రభిమాని దేవతలకు నివాసస్థానము. ఈ కనఁబడునట్టి, మండలము, తత్కాంతి, తదంతర్గతుఁడగు పురుషుఁడు అను మూఁడును ఋగ్యజు స్సామరూపమగు త్రయీవిద్యగా ప్రకాశించుచున్నది. ఇందు పాసిం చదగినవాఁడుగ చెప్పఁబడిన పురుషుఁడే ఆదిత్య మండల మధ్యభాగ మున హిరణ్మయుఁడై ప్రకాశించుచున్నాఁడు. ౧॥

ఈ ఆదిత్యుఁడే తేజము, ఓజస్సు (అనఁగా బలకారణము) బలము, కీర్తి, చక్షుస్సు, శ్రోత్రములు మున్నగు బాహ్యేంద్రియములు, దేహము, అంతఃకరణము, కోపము, స్వాయంభువాదిమనువులు, మృ త్యువు, సత్యాభిమాని దేవత, మిత్రుఁడు, వాయువు, ఆకాశము, ప్రా ణము, లోకపాలులు, ప్రజాపతి, వాక్కుచేత చెప్పనలవికాని వస్తుజా తము, సుఖము, పరోక్షవస్తువు, అబద్ధము పలుకకు, అన్నము, ఆయు స్సు, మరణరాహిత్యము, జీవుఁడు, విష్ణుఁడు, అతిశయసుఖ స్వరూప ము, పుట్టుకలేని బ్రహ్మముఅని ఎఱుంగవలయును. ఈ ఆదిత్యుఁడే నిత్యుఁడు. ఈ యాదిత్యుఁడే భూతములకు ప్రభువు. (ఈ విషయ ము నెఱింగి ఈప్రకారము ముపాసించినవానికి కలుగు ఫలములఁజెప్పుచు న్నాఁడు. (ఇందుపాసనము హిరణ్యగర్భోపాసనము, తదవయభూత దేవతోపాసనము. అనిద్వివిధము అందు) హిరణ్యగర్భోపాసనము ను మిక్కుటముగ చేసినవానికి భావనాధిక్యముచేత హిరణ్యగర్భునితా దాత్మ్యము సిద్ధించును. భావనామాంద్యము గలవానికి హిరణ్యగ ర్భసాలోక్యము (అనఁగా హిరణ్యగర్భుని లోకమునందుండుట) కలు గును. అదేవిధముగ దేవతోపాసనమునందును భావనాధిక్యతను, మాంద్యమును అనుసరించి ఆయాదేవతల సాయుజ్యము నో లేక సా లోక్యమునో, సమానైశ్వర్యమునో పొందును, ఇయ్యాదియుపనిష ద్రహస్యము.

---

# గురు ధ్యానమ్.

శ్లో॥ దేవకార్యం తతః కృత్వా గురుమంగలవీక్షణం॥ దక్షః.

శ్లో॥ ఉపగమ్య గురూన్ సర్వాన్ విప్రాం శ్చైవాభివాదయేత్॥

భరద్వాజః.

తా. (పిలుమమయిన) తరువాత దేవతార్చనము చేసి గురువును మంగళ ప్రదములగు వస్తువులను చూడవలయును. గురువునకును విప్రులకును నమస్కారము చేయవలయును.

శ్రీమద్గురు పరమగురు పరమేష్ఠిగురు పరాపరగురుభ్యోనమః. మ

ఓం, సహనావవవతు। సహనౌ భునక్తు ।సహావీర్యంకరవావహై

తేజస్వి నావధీతమస్తు మావిద్విషావహై। ఓంశాంతి శ్శాంతి

శ్శాంతిః॥ తై. ఆ. 10. 1.

శ్లో. గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।

గురు స్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥

తా. గురువే బ్రహ్మ, గురువేవిష్ణువు, గురువే మహేశ్వరుఁడు,

గురువే పరబ్రహ్మ స్వరూపము, అట్టి గురువునకు నమస్కారము.

శ్లో అఖండమణ్డలాకారం వ్యాప్తం యేన చరాచరం।

తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః ౨.

శ్లో యదవిద్యావశా ద్విశ్వం దృశ్యతే రశనాహివత్।

యద్విద్యయాచ తద్ధాని స్తంవన్దే పురుషోత్తమమ్॥ ౩.

తా. ఎవనియవిద్యా ప్రభావమువలన రజ్జువునందుసర్పమువలెఈప్రపంచముగనంబడుచున్నదో, ఎవని విద్యాప్రభావముచేత తద్భ్రాంతి పోవుచున్నదో అట్టి పురుషోత్తమునకు నమస్కారము.

శ్లో. నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ।

వ్యాసంశుకం గౌడపదంమహాన్తం గోవిన్దయోగీన్ద్ర మథాస్యశిష్యం॥

శ్రీశంకరాచార్య మథాస్యపద్మపాదంచ హస్తామలకంచ శిష్యం।

తంతోటకంవార్తికకార మన్యానస్మద్గురూన్ శంకరమానతోఽస్మి॥

తా. నారాయణుని, బ్రహ్మను, వసిష్ఠుని, శక్తిని, శక్తిపుత్రుఁడగు పరాశరుని,వ్యాసుని. శుకుని,మహాత్ముఁడగుగోవిందపాదుని,తచ్ఛిష్యుఁడగు గోవింద యోగీంద్రుని, శ్రీశంకరాచార్యులను, పద్మపాదుని, హ

స్తామలకుని, తోటకుని, వార్త్తికకారుని, ఇతరులయిన నాగురువులను గూర్చి నమస్కారము. శ్రీశంకరునకు నమస్కారము.

శ్లో॥ శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం।
సూత్రభాష్యకృతౌవందే భగవన్తౌపునః పునః॥ ౬.

తా. సాక్షాచ్ఛంకరావతారమగు శంకరాచార్యుని, నారాయణావతారమగు వ్యాసునినమస్కరించుచున్నాఁడను. షడ్గుణైశ్వర్యసంపన్నులగు వీరిలోవ్యాసుఁడు వేదాంత సూత్రకర్త్తయు, శంకరాచార్యుఁడు భాష్యకర్త్తయు.

శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం।
పరాశరాత్మజంవందే శుకతాతం తపోనిధిం॥ ౭.
అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరోహరిః।
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః॥ ౮.
మునిం స్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషం।
వేదావాసం సరస్వత్యా వాసం వ్యాసం నమామ్యహం॥ ౯.

తా. వసిష్ఠుని మునిమనుమఁడును, శక్తియొక్కమునుమఁడును, పరాశరుని పుత్రుఁడును శుకునితండ్రియు తపోనిధియునగు వ్యాసునకు నమస్కరించుచున్నాఁడను॥ ౭॥ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడగు నీవ్యాసుఁడు నాలుగుమొగములులేని బ్రహ్మయు, రెండుచేతులు గల విష్ణువును, లలాటమునందు నేత్రములేని ఈశ్వరుఁడును అని తెలిసికొనవలయును॥౮॥ నీలమేఘశ్యాముఁడును, వేదవిభాగకర్త్తయు, పాపరహితుఁడును, వేదములకును సరస్వతికిని నివాసస్థానమును అగువ్యాస మహామునికి నమస్కారము ౯.

శ్లో. వేదే బ్రహ్మ సమః స్తదంగనిచయే గర్గోపమః స్తత్కథా
తాత్పర్యార్థవివేచనే గురుసమః స్తత్కర్మసంకీర్తనే।
ఆసీజ్జైమినిరేవ; సూత్రనిచయస్యార్థోపసంవర్ణనే
వ్యాసేనైవసమః స్సశంకరగురు ర్జీయతాంమానసే॥ ౧౦.

తా. వేదములందు చతుర్ముఖ బ్రహ్మతో సమానుఁడును, వేదాంగములందు గర్గునితో పోల్పఁదగినవాఁడును, వైదికాఖ్యాయికలు, వాని తాత్పర్యము, తదర్థము వీనిని వివరించుటయందు బృహస్పతితోతుల్యుఁ

డును, వేదవిహితకర్మలను వివరించుటయందు జైమినియు, వేదాంత సూత్రముల యర్థమును తెలుపుటయందు వ్యాసులవారితో సమానుఁడును అగు శ్రీశంకరాచార్యుల వారునామనమునందు ప్రకాశించుచుండుగాక.

శ్లో. నమస్త్రయ్యన్తసన్దోహ సరసీరుహభానవే।
గురవే పరపక్షౌఘధ్వాన్తధ్వంస పటీయసే॥ ౧౧.

తా. ఉపనిషత్సమూహమను పద్మమునకు సూర్యుఁడును, ప్రతిపక్షులయుక్తి సమూహమను అంధకారమును పోగొట్టుటయందు సమర్థుఁడును అగు (శ్రీశంకరాచార్య) గురువునకు నమస్కారము.

శ్లో. స్తుతోఽపి సమ్యక్కవిభిః పురాణై
స్తుత్యాఽపి నస్తుష్యతు భాష్యకారః।
క్షీరాబ్ధివాసీ సరసీరుహాక్షః
క్షీరం పునః కించక మేస గోపే॥ ౧౨.

తా. భాష్యకర్తయగు శ్రీశంకర భగవత్పాదుఁడు ప్రాచీనకవిపుంగవులచేత కొనియాడఁబడినను నాస్తుతిచేతకూడ సంతోషించుగాక. క్షీరసముద్రశాయియగు విష్ణుమూర్తి గొల్లమందలో పాలను కోరెనాడు గదా.

ఇటుల పలమగురు, పరమేష్ఠిగురు, పరాపరగురువులకు నమస్కరించి తనకుభాష్యముసుపదేశించిన స్వగురువును ధ్యానించవలయును.

శ్లో. స్తువే యతీన్ద్ర పూర్ణేన్దుం చిదానన్దసరస్వతిం॥
అనాద్యవిద్యా వ్యామోహ తమస్తోమరవింముహుః॥

తా. యతిపుంగవులలోపల పూర్ణచంద్రుని వంటివాఁడును, ఆదిలేని అవిద్యావ్యామోహమను గాఢాంధకారమునకు సూర్యునివంటివాఁడును అగు చిదానందసరస్వతీయతీంద్రునకు నమస్కరించుచున్నాఁడను.

ఓం నమో బ్రహ్మ విద్భ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయ కర్తృభ్యో వంశఋషిభ్యో నమో గురుభ్యః॥

# ఆత్మయజ్ఞము.

తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమాన శ్శ్రద్ధా పత్నీ శరీర మిధ్మ మురో వేది ర్లోమాని బర్హి ర్వేద శ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశు స్తపో గ్ని ర్దమ శ్శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షు రధ్వర్యు ర్మనో బ్రహ్మ శ్రోత్ర మగ్నీ ద్యావద్ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్య త్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సంచర త్యుపవిశ త్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యా వ్యాహృతి రాహుతి ర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాత రత్తి తత్సమిధం యత్ప్రాత ర్మధ్యందినగ్ం సాయంచ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యే ర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబంధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తే హర్గణా స్సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం తదవభృథ ఏతద్వై జరామర్య మగ్ని హోత్రగ్ం సత్రం య ఏవం విద్వా నుదగయనే ప్రమీయతే దేవానా మేవమహిమానం గత్వా దిత్యస్య సాయుజ్యంగచ్ఛ త్యథ యో దక్షిణే ప్రమీయతే పితౄణా మేవ మహిమానం గత్వా చంద్రమస స్సాయుజ్యగ్ం సలోకతా మాప్నో త్యేతౌ వై సూర్యా చంద్రమసో ర్మహిమానౌ బ్రాహ్మణో విద్వా నభి జయతి తస్మా ద్బ్రహ్మణో మహిమాన మాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమానమ్ ॥

నై. ఆ. 10. 80.

తా. ఇందు ఆత్మయజ్ఞము చెప్పబడుచున్నది. ఇయ్యది 4 విధములుగ విభజింపబడినది. ప్రథమమున ఉపాసకుడగు యోగియొక్క అవయవములను యజ్ఞాంగములుగను, ద్వితీయమున ఉపాసక నిత్య వ్యవహారములు జ్యోతిష్టోమాది క్రియా రూపముగను, తృతీయమున ఉపాసకుని కాలవిశేషములను నానావిధయాగ రూపముగను, చతుర్థమున ఉపాసకుడు పొందు క్రమముక్తియు వివరింపబడియున్నది.

పరబ్రహ్మముయొక్క యాథార్థ్యము నెఱింగిన విద్వాంసునియొక్క యజ్ఞమునకు దేహేన్ద్రియ సాక్షియగు ఆత్మయే యజమానుఁడు; అంతఃకరణమునందుండు శ్రద్ధయే పత్ని, శరీరమే ఇధ్మము. వక్షస్థలము యజ్ఞవేదిక; శరీరమందుండు వెండ్రుకలే దర్భలు. శిఖ వేదము హృదయము యూపము, కోరిక ఆజ్యము, కోపము పశువు, తపస్సు అగ్ని, సర్వేంద్రియోపశమమును చేయు దమము దక్షిణ, వాక్కు హోత, (హోతయనఁగ ఋగ్వేదీయమంత్రములతో దేవతలనుపిలుచువాఁడు,) ప్రాణము ఉద్గాత (ఉద్గాతయనఁగ సామవేదీయమంత్రములతో దేవతలనుస్తుతిచేయుఋత్విజుఁడు) చక్షుస్సు అధ్వర్యుఁడు. మనస్సు బ్రహ్మ. శ్రోత్రము ఆగ్నీధ్రుఁడు. అని తెలిసికొనవలయును.

భోజనముచేయకయుండు నంతకాలముదీక్ష, భుజించునది హవిస్సు, త్రాగునది సోమపానము, క్రీడించునది ఉపసదిష్టులు, సంచరించుట, కూర్చొనుట, లేచుట ఇవి ప్రవర్గ్యము. ముఖము ఆహవనీయము, విజ్ఞానమేదిగఁదో దానిని హోమముచేయుచున్నాఁడు. సాయంప్రాతఃకాలములందు భుజించుటయే సమిధలు. ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములే సవనములు.

అహోరాత్రములు దర్శపూర్ణమాసయాగములు, అర్ధమాసములు, మాసములు ఇవియే చాతుర్మాస్యక్రతువులు. ఋతువులే పశుబంధములు, సంవత్సర, పరివత్సర, ఇడావత్సర, అనువత్సర ఇద్వత్సరములే ద్విరాత్రత్రిరాత్రాద్యహర్గణములు (ప్రభవాది ౬౦ సంవత్సరములకును క్రమముగ ప్రభవకు సంవత్సరమనియు, విభవకు పరివత్సరమనియు, శుక్లకు ఇడావత్సరమనియు, ప్రమోదూతకు (ప్రమోదకు) అనువత్సరమనియు, ప్రజోత్పత్తికి ఇద్వత్సరమనియు పేరు, అంగీరసకు మఱల సంవత్సరమనియు, శ్రీముఖకు, పరివత్సరమనియు ఇటుల క్రమముగా నెఱుంగునది) ఉపాసకుని ఆయుఃపరిమితివఱకు ఉద్దేశింపబడిన ఈసత్రయాగము సర్వస్వదక్షిణముగగలది. ఈసత్రయాగమునకు మరణమే అవభృథస్నానము.

ఈయుపాసనాఫలమును చెప్పుచున్నాఁడు:— జననాదిమరణాంతమగు ఉపాసకునిచరితము వేదోక్తమగు అగ్నిహోత్రాదిసంవత్సరసత్రాంతమగు కర్మస్వరూపముగ భావింపఁబడినది. ఇట్లెఱింగియుపాసిం

చు బ్రహ్మవేత్త ఉత్తరాయణమునందు మరణించునెడల ఇంద్రాదుల యైశ్వర్యమునుపొంది పిదప భావనామాంద్యమును అధిక్యమును అనుసరించి ఆదిత్యుని సాయుజ్యమునో సాలోక్యమునో పొందును. లేక అతఁడు దక్షిణాయనమున మరణించునేని అగ్నిష్వాత్తాది పితరుల యైశ్వర్యమునుపొంది భావనా తారతమ్యము చేత చంద్రునియొక్క సాయుజ్యమునో సాలోక్యమునోపొందును. ఇటుల సూర్యచంద్రులమహిమలను అనుభవించిన వాఁడై పిదప హిరణ్యగర్భ లోకమును పొంది అచట బ్రహ్మతత్వ సాక్షాత్కారమును పొంది ఆబ్రహ్మయొక్క ఆయుర్గంతమున సత్యజ్ఞానాదిలక్షణమగు పరబ్రహ్మమహిమను పొందును.

# నమకబ్రాహ్మణమ్.

(తైత్తిరీయ సంహితాయాం పంచమాష్టకే చతుర్థప్రపాఠకే తృతీయోఽనువాకః)

రుద్రో వా ఏష యదగ్ని స్స ఏతర్హి జాతో యర్హి సర్వశ్చి థాతస్సయ వత్సోజాతః స్తనం ప్రేప్స త్యేవం వా ఏష ఏతర్హి భాగధేయం ప్రేప్సతి తస్మై యదాహుతింనజుహుయాదధ్వర్యుఞ్చయజమానఞ్చధ్యాయేచ్ఛతరుద్రీయఞ్జుహోతిభాగధేయేనైవైనగ్ంశమయతినార్తిమార్చ్ఛత్యధ్వర్యుర్నయజమానో 1; యద్గ్రామ్యాణాంపశూనామ్॥ ౧॥ పయసా జుహుయాద్గ్రామ్యాన్పశూఞ్ఛుచా ర్పయేద్యదారణ్యానా మారణ్యాఞ్జర్తిలయవాగ్వావా జుహుయాద్గవీధుకయవాగ్వా వా నగ్రామ్యాన్పశూన్ హినస్తి నారణ్యా 2; నథో ఖల్వాహు రనాహుతిర్వై జర్తిలాశ్చ గవీధుకా శ్చేత్యజక్షీరేణ జుహోత్యాగ్నేయీవా ఏషాయదజాహుత్త్యైవ జుహోతి నగ్రామ్యాన్పశూన్హినస్తి నారణ్యా 3; నఙ్గిరస స్సువర్గం లోకం యన్తః॥ ౨॥ అజాయాం ఘర్మం ప్రాసిఞ్చన్ త్సా శోచన్తీ పర్ణం పరా జిహీత సోఽర్కో ఽభవ త్తదర్క స్యార్కత్వ మర్కపర్ణేన జుహోతిసయోని

త్వాయో 4; దక్షి తిష్ఠన్ జుహోత్యేషావై రుద్రస్యదిక్స్వాయామేవ దిశి రుద్రంనిరవదయతేచరమాయామిష్టకాయాంజుహోత్యన్తత ఏవరుద్రం నిరవదయతే 5; త్రేధా విభక్తం జుహోతి త్రయ ఇమేలోకా ఇమానేవలోకాన్ త్సమావద్వీర్యాన్కరోతీ 6; యర్త్స్యగే జుహోతి॥ ౩॥ అథేయత్యా ఠేయతీ త్రయఇమేలోకా ఏభ్య ఏవైవెనంలోకేభ్యశ్శమయతి 7; తిస్ర ఉత్తరా ఆహుతీ ర్జుహోతి షట్ సంపద్యన్తే షడ్వాఋతవ ఋతుభి రేవైవెనగ్ం శమయతి 8; యదనుపరిక్రామన్ జుహు యాదన్తరవచారిణగ్ంరుద్రంకుర్యాదథోఖల్వాహుః కస్యాంవాహాదిశిరుద్రః కస్యాంవేత్యను పరిక్రామమేవ హోతవ్య మపరివర్గమేవైవెనగ్ం శమయతి 9;॥ ౪॥ ఏతావై దేవతా స్సువర్గ్యా యా ఉత్తమా స్తా యజమానం వాచయతి తాభిరేవైవెనగ్ం సువర్గం లోకం గమయతి 10;యంద్విష్యాత్తస్య సంచరేపశూనాంన్యస్యేద్యః ప్రథమ స్సశురభితిష్ఠతి స ఆర్తిమార్ఛతి॥; ౫॥

(నమకచమకములకు రుద్రమను నామధేయమును శిష్టులిచ్చియున్నారు. ఇయ్యది కృష్ణ యజుర్వేదము చతుర్థ కాండయందుగలదు. చయనమునందు చిత్యగ్నిహోమమున కీమంత్రజాతము వినియోగింపఁబడుచున్నది. ఆపస్తంబకల్ప సూత్రకర్త అట్లే కల్పసూత్రమునందు వినియోగమును చెప్పియున్నాఁడు. ఈనమకమునందలి ప్రతిఋక్కునకు, ప్రత్యనువాకమునకు అంతకును ప్రత్యేకముగ పురశ్చరణాది విధులు భట్ట భాస్కరభాష్యమునందును, శాంతికమలాకరాది గ్రంథములందును గలదు. గ్రంథవిస్తరభీతిచేత వానినిచట సంగ్రహించలేదు.)

తా. ఈయగ్నియే రుద్రుఁడని చెప్పఁబడును. బాలుఁడు పుట్టిన వెంటనే స్తన్యపానమును కోరునట్లు చయనమయిన వెంటనే అగ్నియు తన భాగమును కోరును. ఆయగ్నికి వెంటనే ఆహుతినివ్వని యెడల అధ్వర్యుని యజమానుని భక్షించవలయునని తలంచును. కనుక అందులకుగాను రుద్రసంబధములగు అనేక మంత్రములుండుటచేత శతరుద్రీయమను పేరుగలదు. రుద్రాధ్యాయమంత్రములతో హోమముచేయవలయును. ఈహోమమువలన అగ్నిహోత్రుఁడు తుష్టినందును. అధ్వర్యుయజమానులకు కీడుకలుగదు. ౧.

ఇఁక హోమద్రవ్యమును చెప్పుచున్నాఁడు:—గ్రామభవము లగు గోవు, మహిషి, వీనిపాలతో హోమము చేసిన యెడల గ్రామ పశువులకు కీడుకలుగును, లేక ఆరణ్య పశువుల క్షీరములతో హోమము చేసినయెడల ఆరణ్యకపశువులకు చెరుపుకలుగును. కావున అడవి నువ్వుల గంజితోగాని లేక అడవి గోధూమల గంజితో గాని హోమము చేయవలయును. ఇట్లు చేసిన యెడల ఆరణ్యక, గ్రామ్య, పశువులకు చెరుపుకలుగదు. ౨.

పక్షాంతరముగ హోమద్రవ్యమును చెప్పుచున్నాడు:—జర్తిలలు (అనఁగా అడవినువ్వులు) గవీధుకములు (అనఁగా అడవి గోధూములు) మనుష్యులు భుజించు ధాన్యములు కావుఁనుక అజక్షీరములతో హోమము చేయవలయును. అజము అగ్నిసంబంధమయినదే కనుక గ్రామ్యారణ్య పశువులకు కీడుకలుగదు. ౩.

హోమము చేయవలసిన రీతిని చెప్పుచున్నాడు:— అంగిరస్సుడు స్వర్గలోకమునకు పోవుచు ప్రయాణపు తొందరలో ప్రవర్గ్యమునందు కాచిన ఘర్మమును (పాలతో గూడిన నెయ్యి) మేకపైన చల్లెను. ఆవేడినెయ్యి పైన పడగానే వీపుకాలి ఆకువలె ఉన్న తన యొక్క రోమసంఘాతమును మేకభూమియందువిడిచెను. = ఆరోమసంఘాతము అర్కము. (జిల్లేడు) ఆయెను. పూజనీయమయిన ప్రవర్గ్యఘృత సంబంధమున్నూ, యజ్ఞార్హమయిన అజముయొక్క సంబంధమున్నూ కలిగియుండుటచేత అర్కమను పేరుకలిగెను. అట్టి యర్కపర్ణముచేత(జిల్లేడాకుచేత) హోమము చేసిన యెడల పర్ణక్షీరములు రెండును సమాన జన్మములు కలవియగును. ౪.

హోమకాలమునందొకవిశేషమును చెప్పుచున్నాడు:—ఉత్తరపుదిక్కున నిలుచుండి హోమము చేయవలయును. ఇటుల చేసియెడల రుద్రుని దిక్కు ఉత్తరము కావున ఆతని దిశయందుంచిన విమగును. అంత్యేష్టకయందు హోమము చేయవలయును. రుద్రునకు చివర ఉంచినటుల యగును. ౫

రుద్రాధ్యాయమునందలి హోమసాధన మంత్రముల విభజించుచున్నాఁడు:---రుద్రాధ్యాయమునంతయు 3గ విభజించి హోమము చేయవలయును తత్ప్రకారము:-- "నమస్తేరుద్ర" అనువాక్యము మొదలు సభాపతిభ్యశ్చవో నమః, అనువఱకు ఒకటియు
"నమో అశ్వేభ్యః" మొదలు "ఆవార్యాయచ" అనువఱకు ,,
"నమః ప్రతరణాయచ" మొదలు. ధన్వానితస్మసి ,, ,,

ఇటుల మూఁడుగ విభజించి హోమము చేయవలయును. ఇటుల నొనర్చిన యెడల మూఁడులోకములను సమానమగు బలములుగల వానిగ చేసినట్లగును. ౬.

హోమవిధానమును చెప్పుచున్నాఁడు:---త్రివిధముగ విభజించిన మంత్రములలో ప్రథమమంత్ర భాగము హోమము చేయునప్పుడు జానుదఘ్నముగను; రెండవ మంత్ర భాగము హోమము చేయునప్పుడు నాభిదఘ్నముగను, మూఁడవ మంత్ర భాగము హోమము చేయునప్పుడు ఆస్యదఘ్నముగను స్రుగ్దండమును గ్రహించి హోమము చేయవలయును. ఇటుల హోమము చేసిన ఈమూఁడులోకములను శాంతి చేసినట్లగును. ౭.

"నమోరుద్రేభ్యో" అను 3 యజుస్సులతోటి 3 ఆహుతులను వేల్వవలయును. ఇవి కలసి ఆఱగును. ఋతువులు ఆఱు కావున ఋతువుల చేతనే దీనిని శాంతిని పొందించినట్లగును. ౮.

పూర్వపక్షసిద్ధాంతములతో పరిక్రమణ మొనర్చి హోమము చేయుమని నిశ్చయించుచున్నాఁడు:---అగ్నికి చుట్టుతిరుగ కుండ హోమము చేసిన యెడల రుద్రుఁడు క్రూరుఁడగుట చేత అగ్నిక్షేత్రమునందు సందుచేసికొని ప్రవేశించి యుపద్రవము చేయును కావున పరిభ్రమణ మక్కర లేదని పూర్వపక్షము. అట్లనకూడదని విద్వాంసులు పల్కెదరు. రుద్రుఁడు అంతట నిండియుండును. ఇప్పుడిచ్చట నున్నాఁడిచట లేఁడు అని ఎవఁడెఱుంగును. కావున రుద్రుని వెదుకుటకు పరిభ్రమణము చేసియే హోమము చేయవలయును. ఇట్లొనర్చిన యెడల ఎచ్చటనున్నను రుద్రుఁడు సంతసించును. కనుక ఎచట నున్నను ఉపద్రవము చేయఁడు. ౯.

"నమోరు ద్రేభ్య" అనుమంత్రములను యజమానుఁడు పలుకవలయును:—ఈమంత్రములందు చెప్పఁబడిన దేవతలు స్వర్గమునకు హేతువులు. కావున ఇవి శ్రేష్ఠములు. కనుక ఈమంత్రములను అధ్వర్యుఁడు యజమానునిచేత చెప్పించవలయును. ఇటుల యజమానునిచేత చెప్పించిన యెడల ఈయజమానుని స్వర్గమును పొందింపుచున్నాఁడు. ౧౦.

హోమము చేసిన జిల్లేడు ఆకును విడువలసిన విధమును చెప్పుచున్నాడు:—యజమానుఁడు తనశత్రువుయొక్క పశువులుచరించు ప్రదేశమునందీహోమము చేసిన జిల్లేడు ఆకును వేయవలయును. ఆ యాకు దగ్గిఱకు మొట్టమొదట వచ్చిన పశువు మరణించును. ౧౧.

# చ మ క బ్రాహ్మ ణ మ్.

(తైత్తిరీయ సంహితాయాంపంచమాష్టకే చతుర్థప్రపాఠకే అష్టమో నువాకః)

వసో ర్ధారాం జుహోతి వసో ర్మే ధారా సదితి వా ఏషాహుయ తే ఘృతస్య వా ఏన మేషా ధారాఽముష్మిం ల్లోకే పిన్వమానో పతిష్ఠత 1; ఆజ్యేన జుహోతి తేజో వా ఆజ్యం తేజో వసోర్ధారా తేజ సైవాస్మై తేజో వరున్ధే 2; థో కామా వై వసోర్ధారా కామానే వావరున్ధే 3; యం కామయేత ప్రాణానస్యాన్నాద్యం వి ॥౧॥ ఛిన్ద్యామితివిగ్రాహంతస్యజుహుయాత్ప్రాణానేవాస్యాన్నాద్యంవిచ్ఛినత్తి 4;యంకామయేతప్రాణానస్యాద్యగ్ం సన్తనుయామితి సన్తతాంతస్యజుహుయాత్ప్రాణానేవాస్యా న్నాద్యగ్ం సన్తనోతి 5; ద్వాదశద్వాదశాని జుహోతి ద్వాదశమాసా స్సంవత్సరః స్సంవత్సరేణైవాస్మా అన్నమవరున్ధే 6; న్నంచమే క్షుచ్చమ ఇత్యాహైతద్వై ॥౨॥ అన్నస్యరూపగ్ం రూపేణైవాన్న మవరున్ధే 7; గ్నిశ్చమ ఆపశ్చమ ఇత్యాహైషావా అన్నస్య యోనిస్స యోన్యేవాన్న మవరున్ధే 8; ర్ధ

స్వాహేతి జుహోతి దేవతా ఏవావరున్ధే యత్సర్వేషా మర్ధ మిన్ద్రః ప్రతితస్మా దిన్ద్రో దేవతానాం భూయిష్ఠభాక్తమ ఇన్ద్రముత్తర మాహేన్ద్రియ మేవాస్మి న్నుపరిష్టాద్దధాతి 9; యజ్ఞాయుధాని జుహోతి యజ్ఞః ॥౩॥ వై యజ్ఞాయుధాని యజ్ఞమేవావరున్ధే థో ఏతద్వై యజ్ఞస్య రూపగ్ం రూపేణైవయజ్ఞ మవరున్ధే 10; వ భృథశ్చమే స్వగాకారశ్చమ ఇత్యాహస్వగాకృత్యై 11; అగ్నిశ్చమే ఘర్మశ్చమ ఇత్యాహైతద్వై బ్రహ్మవర్చసస్యరూపగ్ం రూపేణైవ బ్రహ్మవర్చస మవరున్ధ 12; ఋక్చమే సామచమ ఇత్యాహ ॥౪॥ ఏతద్వైఛన్దసాగ్ం రూపగ్ం రూపేణైవఛన్దాగ్ం స్యవరున్ధే 14; కల్పాన్ జుహోతి అక్లృప్తస్య క్లృప్త్యై 15;

యుగ్మదయుజే జుహోతి మిథునత్వాయో 16; త్తరావతీ భవత్యభి క్రాన్త్యై 17; ఏకాచమే తిస్రశ్చమ ఇత్యాహదేవఛన్దసంవా ఏకా చ తిస్రశ్చ ॥౫॥ మనుష్యఛన్దసం చతస్రశ్చాష్టౌచ దేవఛన్దసంచైవమనుష్యఛన్దసం చావరున్ధ 18; అత్రయస్త్రింశతో జుహోతి త్రయస్త్రిగ్ంశద్వై దేవతా దేవతా ఏవావరున్ధ అష్టాచత్వారిగ్ంశతో జుహోత్యష్టాచత్వారిగ్ంశదక్షరా జగతీ జాగతాః పశవో జగత్యై వాస్మై పశూనవరున్ధే 19; వాజశ్చ ప్రసవశ్చేతి ద్వాదశం జుహోతి ద్వాదశ మాసా స్సంవత్సర స్సంవత్సర ఏవప్రతి తిష్ఠతి 20; ॥౬॥

తా. ఏయాహుతి హోమముచేయుటవలన అవిచ్ఛిన్నముగ ధనమును పొందునో అయాహుతి "వసోర్ధార" యనంబడును (చమకమునకు వసోర్ధారయని పేరు) వసోర్ధారను హోమముచేయు యజమానుఁడు ప్రథమమున తనకు సర్వదా ధనము కావలయునని కోరుచు ఈయాహుతిని హోమముచేయును. ఈయాహుతివలన యజమానుఁడు స్వర్గలోకమున ఘృతధారచేత తృప్తిగలవాఁడగును. ౧. హోమమును ఆజ్యముచేత చేయవలయును, ఆజ్యము తేజోరూపము, వసోర్ధారయు తేజస్స్వరూపమే, దీనివలన తేజోరూపమగు ధనధాన్యా

దికము లభించును. ౨. వసోర్ధార కామములను కలుగఁజేయును. ౩. మంత్రమును చెప్పుచు నైరంతర్యముగ హోమము చేయుటను విధించుచున్నాఁడు:— అధ్వర్యుఁడు యజమానుని ప్రాణములను అన్నాదులను చెడగొట్టవలయునని తలంచునేని నిలిపి నిలిపి హోమము చేయవలయును. ఇటుల చేయునెడల యజమానుని ప్రాణమునకు అన్నాదికమునకు చెరుపు కలుగును. యజమానుని ధనప్రాణములకు వృద్ధిని చేయవలయునని తలంచునెడల ఆయాహుతిని సాంతత్యముగ మంత్రమును చ్చరించుచు వేల్వవలయును, యజమానునిధన ప్రాణములు నిరంతరముగ వృద్ధినందును. ౪. వాజశ్చమ అనువాక్యము మొదలు "అన్నంచమేక్షుచ్చమే" అను వాక్యమువఱకుండు వాక్యములు ౧౪౪... ఇవి ద్వాదశ సంఘములుగనున్నవి. సంవత్సరమునకు ౧౨ మాసములగుట చేతను సంవత్సరము ప్రయత్నించుట చేత పొందునట్టి యన్నమును దీని చేత పొందును. ౫. ౪ వ అను వాకమునందు "అన్నంచమేక్షుచ్చమే" అను వాక్యముగలదు. అచట చెప్పిన వాక్యములన్నియు అన్నరూపములే, ఈరూపమువలన అన్నమును పొందును ౬. ౫ వ అను వాకమునందు "అగ్నిశ్చమఆపశ్చమే" అను వాక్యజాతముగలదు. అగ్ని పాకమునకు హేతువగుట చేతను, జలములు ఓషధులకు కారణములగుట చేతను ఈరెండును అన్నమునకు కారణములు. ఈమంత్రము పఠించుటవలన అనేక కారణములతో గూడిన అన్నమును పొందును. ౭. ౬ వ అను వాకమునందుండు (అగ్నిశ్చమ ఇంద్రశ్చమే సోమశ్చమ ఇంద్రశ్చమే) మున్నగు అర్ధేంద్రవాక్యములతో హోమము చేయవలయును. అందు చెప్పఁబడిన దేవతలను పొందును. ప్రతివాక్యమునందు సగము ఇంద్రుని పఠించుట చేత దేవతలలోపల ఇంద్రుఁడు అతిశయమగు హవిస్సును పొందుచున్నాఁడు. చివరసగమునందు ఇంద్రుని పేరు చెప్పియుండుట చేత దేహమునందు శిరోభాగమునందే యజమానునకు చక్షుస్సుమున్నగు ఇంద్రియములున్నవి. ౮. ౭, ౮, వయను వాకములందు సోమగ్రహపాత్రలు, ఇధ్మలు మున్నగువానికి సంబంధించిన వాక్యములు గలవు ఇవి యజ్ఞాయుధములు. దీనివలన యజ్ఞమును పొందుచున్నాఁడు. ఈ యాయుధము లే యజ్ఞస్వరూపము...

ఈయజ్ఞస్వరూపముచేత యజ్ఞమును పొందుచున్నాడు. ౯. ౮ వ యనువాకము చివర "అవభృథశ్చమే స్వగాకారశ్చమే" అనువాక్యముగలదు, అందుస్వగాకార, పదమునకుస్వాధీనము చేసికొనుటయని అర్థము. ౧౦. నవమాను వాకపూర్వార్థమునందు "అగ్నిశ్చమే ఘర్మశ్చమే" అను మొదలుగాగల వాక్యములుగలవు. వీనివలన బ్రహ్మవర్చస్సుకలుగును కావున ఇవి బ్రహ్మవర్చస్సునకురూపములు. వీనిచేత బ్రహ్మవర్చస్సును పొందును. ౧౧ నవమానువాకోత్తరార్థమున "ఋక్చమే, సామచమే" అను మొదలుగాగల వాక్యములుగలవు. ఈ ఋక్కు, సామము మున్నగునవి వేదములకు రూపములు. కావున వాని రూపమును పొందును. ౧౨. దశమానువాక పూర్వార్థమునందు "గర్భాశ్చమే వత్సాశ్చమే" అను మొదలుగాగల వాక్యములుగలవు. గర్భ, వత్సాదులు పశురూపములు, వీనిపఠనమువలన పశువులను పొందును ౧౩. ౧౦ వ యనువాకోత్తరార్థమునందు "ఆయుర్యజ్ఞేనకల్పతాం" మొదలుగాగలకల్పము లనంబడుమంత్రములు పఠింపబడినవి. వీనిపఠనమువలన స్వస్వకార్యమున కింతకుముందు అసమర్థమయినను ఇక సామర్థ్యాతిశయముకలుగును. ౧౪. ఏకాదశానువాకమునందున్న విషమ సమసంఖ్యారూపములగు మంత్రములు పఠించుటవలన మిథునత్వము సిద్ధించుచున్నది. ౧౫. ఒకటి, మూడు, ఐదు అనియు. నాలుగు. ఎనిమిది, ఇటుల ఉత్తరోత్తరాభివృద్ధిగ చెప్పుటచేత అంతట వ్యాప్తికలుగును. ౧౬. "ఏకాచమేతిస్రశ్చమే" అనునది దేవఛందస్సులు, "చతస్రశ్చ, అష్టౌచ" అనునవి మనుష్యఛందస్సులు ఈ రెండును పఠించుటచేత దేవమనుష్య ఛందస్సులను పొందును. ౧౭. ౩౩ వ సంఖ్యవఱకు హోమము చేయవలయును దేవతలు ౩౩ సంఖ్యగలవారు. సమసంఖ్యలందు ౪౮ వ సంఖ్యదనుక హోమము చేయవలయును. జగతీఛందస్సునకు అక్షరములు౪౮ పశువులును జగత్సంబంధములయినవియే. ఇందువలన పశువులను పొందును. ౧౮. "వాజశ్చ ప్రసవశ్చ" అను ౧౨ వాక్యములను హోమము చేయవలయును. సంవత్సరమునకు ౧౨ మాసములు. ఈవిషయమెఱుంగుటవలన సంవత్సర పర్యంతము ప్రతిష్ఠితుడై యుండును. ౧౯.

# 1 దేవీసూక్తమ్.

"అహం దేవేభిః" ఇత్యష్టర్చం త్రయోదశం సూక్తం ఆమ్భృణస్య మహర్షేర్దుహితా బ్రహ్మవిదుషీ (వాక్) స్వాత్మానమస్తౌత్। అతస్సా ఋషిః। సచ్చిత్సుఖాత్మకః సర్వగతః పరమాత్మా దేవతా। ద్వితీయా జగతీ శిష్టాస్సప్త త్రిష్టుభః॥

ఆమ్భృణ మహర్షి పుత్రియు, బ్రహ్మవిదుషియనగు వాక్ అను నామె స్వకీయాత్మను స్తుతిచేసెను. కావున ఈసూక్తమునకు ఆమెయెఋషి। పరమాత్మయే దేవత। ఈసూక్తమునగల ౮ ఋక్కులలో ౨ వ ఋక్కు జగతీఛందస్సు. తక్కిన 7 ఋక్కులు త్రిష్టుప్ ఛందస్సు గలవి.

మూ. మం. అహం రుద్రేభి ర్వసుభి శ్చరామ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః। అహ మ్మిత్రావరుణోభా బిభర్మ్యహ మిన్ద్రాగ్నీ అహమశ్వినోభా।

తా. ఈసూక్తమును తపఃప్రభావముచేత నెఱింగిన వాక్ అను బ్రహ్మవిదుషి పలుకుచున్నది. నేను ఏకాదశరుద్రులతోడను అష్టవసువులతోడను, ద్వాదశాదిత్యులతోడనుసకలదేవతలతోడ నుచరించుచున్నాను. నేను ఇద్దఱగు మిత్రావరుణులను ఇంద్రాగ్నులను అశ్వినులను భరించుచున్నాను.

మూ. మం. అహం సోమ మాహనసం బిభర్మ్యహం త్వష్టార ముత పూషణం భగం। అహందధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే 3 యజమానాయ సున్వతే। ౨.

తా. నేను శత్రువులను సంహరించునట్టియు, దేవతాస్వరూపుడునగు సోముని, త్వష్టను, పూషను, భగుని ధరించుచున్నాను. నేను హవిస్సులతో గూడుకొన్నట్టియు, దేవతలకు హవిస్సును పొందించునట్టియు, దేవతలకు సోమాభిషవమును చేయుచున్న యజమానునికొఱకు (యాగఫల రూపమగు) ధనమును ధరించుచున్నాను.

మూ. మం. అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానాం। తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయన్తీమ్॥ 3.

తా. నేను సకల జగమునకు ఈశ్వరిని, (స్తోతలకు) ధనమును పొందించుదానిని నేనే. సాక్షాత్కారము చేయఁదగిన బ్రహ్మము నెఱింగిన దానను నేనే, యజ్ఞములందు పూజింపఁదగిన వారిలో ముఖ్యురాలను నేనే. ఇట్టి నన్ను ప్రపంచరూపమున నున్నదానిగను, జీవరూపమున భూతములందు ప్రవేశించు దానిగను దేవతలు చేసిరి.

మూ. మం. మయాసో అన్న మత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణోత్యుక్తం। అమంతవో మాన్త ఉపక్షియన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివన్తే వదామి. ౪.

తా. ఎవఁడు అన్నమును తినుచున్నాఁడో, ఎవఁడు ఉశ్వాసనిశ్వాసముల వదలుచున్నాఁడో, ఎవఁడు పలికినదానిని వినుచున్నాఁడో ఈ క్రియలన్నియు నేను చేయుచున్నవియే. ఈవిధముగ అంతర్యామిరూపమున నున్న నన్ను ఎఱుఁగనివారు. నశించుచున్నారు. ఓమిత్రమా! నేను శ్రద్ధచేతను ప్రయత్నముచేతను పొందఁబోవుదానిని చెప్పుచున్నాను.

మూ. మం. అహ మేవస్వాయ మిదంవదామి జుష్టం దేవేభి రుత మానుషేభిః। యంకామయే తన్తముగ్రం కృణోమితం బ్రహ్మాణం తమృషిం తంసుమేధామ్. ౫.

తా. నేను ఇంద్రాది దేవతల చేతను మఱియు మనుష్యుల చేతను సేవించబడుచున్న బ్రహ్మరూపమును స్వయముగ ఉపదేశించుచున్నాను. నేను ఎవనిని రక్షింపఁదలఁతునో వానిని అందఱికంటె అధికునిగ చేసెదను, వానిని జగత్స్రష్టయగు బ్రహ్మగను, అతీంద్రియార్థవిజ్ఞాతయగు ఋషిగను, మంచిప్రజ్ఞఁగలవానిగను చేయుదును.

మూ. మం. అహం రుద్రాయ ధను రాతనోమి బ్రహ్మద్విషే శరవే హన్తవా ఉ। అహం జనాయ సమదం కృణో మ్యహంద్యావాపృథివీ ఆవివేశ ॥ ౬.

తా. నేను పూర్వము త్రిపురాసురుల సంహారకాలమునందు బ్రాహ్మణద్వేషియు హింసకుఁడును అగు త్రిపురాసురుని సంహరించుటకుగాను రుద్రునకు ధనస్సును సజ్యముచేసి యిచ్చితిని. స్తోతృజనులకొఱకు శత్రువులతోడ యుద్ధమును నేను చేయుచున్నాను. ద్యావాపృథ్వ్యులందు అంతర్యామిరూపమున నేను ప్రవేశించుచున్నాను.

మూ. మం. అహం సువే పితర మస్య మూర్ధ న్మమ యోని రప్స్వ

త్వస్సముద్రేఽతశ్తో వితిష్ఠే భువనా ను విశ్వోతామూం
ద్యాం వర్ష్మణోప స్పృశామి॥ ౭.

తా. పరమాత్మయొక్క శిరోభాగమునందు ఆకాశమును నేనుపుట్టించుచున్నాను. నాకు కారణము పరమాత్మయందు వ్యాపించిన అంతఃకరణ వృత్తులే. అందువలన నేను సకలభూతములను ప్రవేశించి యుంటున్నాను. మఱియు స్వర్గలోకము మున్నగు సకలమును కారణదేహముచేత స్పృశించుచున్నాను.

మూ.మం. అహ మేవ వాతఇవప్రవామ్యారభమాణాభువనానివిశ్వా।
పరో దివాపరఏనాపృథివ్యై తావతీమహినాసంబభూవ.౮.
దేవీసూక్తం సమాప్తమ్.

తా. నేను సకలభూతములను ఉత్పాదనము చేయుచున్నదానినై వాయువువలె స్వయముగ ప్రవర్తించుచున్నాను. ఆకాశముయొక్క అవతలను, ఈపృథివికి వెలుపలనుగల బ్రహ్మచైతన్య రూపమగు నేను మహిమచేత ఇట్టిదాననుఅయితిని.

దేవీసూక్తము సమాప్తము.

## రుద్రసూక్తమ్.

"ఇమారుద్రాయతవస" ఇత్యేకాదశర్చస్య సూక్తస్యకుత్సోరుద్రో జగతీ:—

౧. ఓం. ఇమా రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహే మతీః। యథాశమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టంగ్రామే అస్మిన్ననాతురమ్ ॥

తా. వృద్ధినందినవాఁడును, జడలుగలవాఁడును, నశించుచున్న శత్రువీరులుగలవాఁడును అగురుద్రునకు మాననీయములగు స్తుతుల నొనర్తుము. ఇందువలనమామనుష్యులయొక్కయు పశువులయొక్కయు రోగములు నశించుగాక. మాగ్రామమునందుండు వారందఱు రోగములు మున్నగునవి లేక సంతోషముచేత బలిసియుందురుగాక. ఇచట రుద్రశబ్దనిర్వచనము వ్రాయఁబడుచున్నది.

రుద్రశబ్దనిర్వచనములు.

౧. అందఱిని ప్రళయకాలమున ఏడ్పించువాఁడు.

౨. సంసారదుఃఖమును పోఁగొట్టువాఁడు
3. ఉపనిషత్తులచేత ప్రతిపాదింపఁబడువాఁడు.
౪. ఆత్మవిద్యను ఉపాసకులకు ఇచ్చువాఁడు.
౫. అంధకారమును పోఁగొట్టువాఁడు.

మూ. మృళానో రుద్రో తనోమయస్కృధి క్షయద్వీరాయ నమసే విధేమ తే। యచ్ఛం చ యోశ్చ మనురాయజే పితా తదశ్యామతవరుద్ర ప్రణీతిషు॥

తా. ఓరుద్రుఁడా! మాకుగాను సుఖింపఁజేయువాఁడవుకమ్ము. పిదప మాకు సుఖమును చేయుము. మేము నశింపఁజేయఁబడిన ప్రతిపక్షవీరులుగల నీకు నమస్కారమొనర్చి సేవింతుము. ప్రజోత్పాదకుఁడగు మనువు స్వకీయులగు ప్రజలకు రోగనాశకమును భయనాశకమును అగువానిని దేవతలవల్లనుండి పొంది మాకిచ్చెను. ఓరుద్రుఁడా! మేము వానిని మీనయనములుండఁగా మేము పొందెదము. అనఁగా నీకనులయెదుట పొందెదమని యర్థము. ౨.

మూ. 3. అశ్యామతే సుమతిందేవయజ్యయా క్షయద్వీరస్యతవరుద్ర మీఢ్వః।సుమ్నాయన్నిద్విశో అస్మాకమాచరారిష్ట వీరా జుహావామ తేహవిః ॥

తా. కోరికల వర్షించునట్టి ఓరుద్రుఁడా! నీభక్తులమగు మేము నిన్ను దేవతగా గ్రహించి యాగమొనర్చి శత్రువీరుల నశింపఁజేసిన నీ యొక్క అనుగ్రహాత్మకమగు బుద్ధినిపొందెదము. నీవు మాప్రజలకు సుఖమును కలుగఁజేయనిచ్చగలవాఁడవై మాప్రజలకభిముఖముగ రమ్ము. పిదప హింసింపఁబడని వీరులగు ప్రజలము గలవారలమయి నీకు చరుపురోడాశాది రూపమగు హవిస్సునిత్తుము. 3.

మూ. ౪. త్వేషం వయం రుద్రం యజ్ఞసాధం వంకుంకవిమువసేనిహ్వాయామహే । ఆరే అస్మద్దైవ్యం హేళో అస్యతు సుమతిమిద్వయ మస్యావృణీమహే ॥

తా. మేము ప్రకాశించునట్టియు, యజ్ఞమును సాధించునట్టియు, కుటిలముగ నడుచునట్టియు, క్రాంతదర్శనుఁడును అగురుద్రుని రక్షణముకొఱకు పిలుచుచున్నారము. ఆరుద్రుఁడు దేవతాసంబంధమగు

కోపమును మాకు దూరముగఁ జేయుఁగాక. మేమీమహాదేవునియొక్క అనుగ్రహరూపమగు బుద్ధినే అభిముఖముగ సేవించెదము. ౪.

మూ. ౫. దివోవరాహ మరుషం కపర్దినం త్వేషంరూపం నమసా నిహ్వయామహే। హస్తే బిభ్రద్భేషజా వార్యాణిశర్మవర్మ చ్ఛర్ది రస్మభ్యంయంసత్ ॥

తా. శ్రేష్ఠమగు ఆహారముగలవాఁడును, అంతట ప్రకాశించువాఁడును, జటామండలముగలవాఁడును తేజస్సుచేత ప్రకాశించువాఁడును, వేదాంతములచేత పొందఁదగినవాఁడును అగురుద్రుని నమస్కారపూర్వకముగ ద్యులోకమునుండి పిలుచుచున్నారము. ఇట్లు మాచేత పిలువఁబడిన రుద్రుఁడు తనచేతియందు అంటు కోరఁదగినట్టియు రోగమును నశింపచేయునట్టి యౌషధములను గ్రహించి స్తుతించువారికి ఆరోగ్యలక్షణమగు సుఖమును, ఆయుధములను వారించుకవచమును గృహమును ఇచ్చుగాక. ౫.

మూ. ౬. ఇదం పిత్రే మరుతా ముచ్యతేవచః స్వాదోస్స్వాదీయోరుద్రాయవర్ధనమ్। రాస్వాచనో అమృతమర్తభోజనం త్మనే తోకాయతనయాయమృళ ॥

తా. మధుఘృతాదిరుచ్య పదార్థముకంటె రుచిగలదియు, స్తుత్యునకు సంతోషమును కలుగఁజేయునదియు అగు నేను చేయునట్టి ఈస్తుతి ౪౯ సంఖ్యగల మరుత్తులకు పితయగు రుద్రునకు అగుగాక. మరణరహితుఁడవగునో రుద్రుఁడా! మనుష్యభోగమునకు తగిన యన్నమును మాకిమ్ము. నన్ను నాపుత్రులను పౌత్రులను సుఖింపఁజేయుము.

కథ:— వెనుక ఒకపర్యాయ మింద్రుఁడు రాక్షసులనుజయించెను. రాక్షసులతల్లియగు దితి ఇంద్రునిజంపుసామర్థ్యముగల పుత్రునికొనవలయునని తపమొనర్చెను. తపముచేత భర్తయనుగ్రహమునుపొంది గర్భముధరించెను, ఇంద్రుఁడీవృత్తాంతమెఱిఁగి సూక్ష్మరూపుఁడై దితిగర్భమును ప్రవేశించి ఆగర్భమును ౭ గాఖండించెను. మఱల ఒక్కొకఖండమును ౭ సిగాఖండించెను. పిదపకొంతకాలమునకు ఆఖండములు భూమిమీఁద బడిరోదనము చేయ మొదలుపెట్టెను. ఈసమయమునందు పార్వతీపరమేశ్వరులు విలాసార్థము లోకసంచార మొనర్చుచు పద్చుచున్న ఈఖం

డములను గాంచిరి. వానినిచూచి పార్వతికరుణగలదై ఈమాంసఖండ
ములన్నియు ప్రత్యేకమొక్కొకశిశువగు రీతిగ చేసినయెడల నాకుచాల
సంతోషము. అని ఈశ్వరునితోఁ జెప్పెను. పిదప ఈశ్వరుఁడు ఆమాం
సఖండములనుసమానవయోరూపాలంకారములుగల బాలురనుగచేసి
నీకునీరు పుత్రులగుదురుగాక యని చెప్పిపార్వతిచేతికిచ్చెను. కనుకమా
రుతసూక్తములన్నిటియందును మరుత్తులను రుద్రపుత్రులనుగాస్తుతి
చేయుచున్నారు. రుద్రసూక్తములందు రుద్రుని "మరుత్పితగా" స్తు
తిచేయుచున్నారు.

౭. మానో మహాన్తముతమానో అర్భకం మానఉక్షన్తముత
మాన ఉక్షితమ్ ।మానో వధీః పితరం మోతమాతరం మాన
ప్రియాస్తన్వో రుద్రరీరిషః ॥

తా. ఓరుద్రుఁడా! మాసంబంధులగు వృద్ధులను, బాలురను, యు
వానులను, గర్భములందుండువారిని మాతండ్రిని, తల్లిని మాస్నేహపా
త్రులగు ప్రజలను నీవు హింసింపకుము. ౭

౮. మానస్తోకేతనయే మానఆయౌ మానోగోషుమానో అశ్వేషు
రీరిషః ।వీరాన్మానో రుద్రభామితో వధీ ర్హవిష్మన్తస్సదమి
త్వాహవామహే ॥

తా. ఓరుద్రుఁడా! మాపుత్రునిపౌత్రుని హింసింపకుము. మామ
నుష్యులనుహింసింపకుము. మాగోవులను గుఱ్ఱములను హింసింపకుము,
శౌర్యవంతులగుమావీరులందు కోపముకలిగివారిని హింసింపకుము. మే
మెప్పుడునీకుహవిస్సునిచ్చుచు నిన్నుపిలిచెదము. ౮

౯. ఉపతేస్తోమా న్పశుపా ఇవాకరం రాస్వాపితర్మరుతాంసు
మ్నమస్మే ।భద్రాహి తే సుమతి ర్మృళయత్తమాథావయమవ
ఇత్తే వృణీమహే ॥

తా. ఓరుద్రుఁడా! పశువులను కాయుగొల్లవాఁడు కాపునకై తన
యధీనముచేసినపశువులను మరల సాయంకాలమునకు యజమానుని
వశముచేయురీతిగ నీయనుగ్రహముచేత పొందఁబడినస్తుతిరూపములగు
మంత్రములను నీకు సమర్పించుచున్నాఁడను. మరుత్పితయగు నో
రుద్రుఁడా! మాకుసుఖమునిమ్ము. నీ బుద్ధిమిక్కిలిసుఖమునిచ్చునదియు
సేవింపఁదగినదియు కావున మేమునీరక్షణమునేకోరుచున్నాము.

౧౦ ఆరే తే గోఘ్న ముత పూరుషఘ్నం క్షయద్వీర సుమ్నమస్మే తే అస్తు।
మృళా చనో అధిచ బ్రూహి దేవాధా చన శ్శర్మ యచ్ఛ ద్విబర్హాః ॥

తా. నాశనము చేయఁబడిన శత్రుజనములుగల యో రుద్రుఁడా! నీసమీపముననుండు గోవులహింసించు సాధనము, పురుషులహింసించు సాధనము, ఈ రెండును మాకు దూరమగుచోట నుండుగాక. మాయందు నీయొక్క సుఖము అగుగాక. మాకు సుఖమును చేయుటకు ప్రసన్నుఁడవుకమ్ము. ౧౦

౧౧. అవోచామ నమో అస్మా అవస్యవశ్శృణోతు నో హవం రుద్రో మరుత్వాన్। తన్నో మిత్రో వరుణో మామహంతా మదితిః సింధుః పృథివీ ఉత ద్యౌః॥

సమాప్తం రుద్రసూక్తమ్.

తా. ఓ రుద్రుఁడా! నీవల్లనుండి రక్షణమును కోరుచు మేమీ స్తోత్రము నెనర్చితిమి. మేము చేసిన నమస్కారము రుద్రునకగుగాక. రుద్రుఁడు మరుత్తుల తోడఁ గూడి మా యాహ్వానమును స్వీకరించుగాక. మేమిపుడు చెప్పినదానిని మిత్రుఁడు, వరుణుఁడు, అదితి, సింధువు, పృథివి, ద్యులోకాభిమాని దేవత, వీరందఱు అంగీకరింతురుగాక.

రుద్రసూక్తము సమాప్తము.

# విష్ణుసూక్తమ్.

(ఋగ్వేద పంచమాష్టక ప్రథమాధ్యాయే త్రయోదశవర్గః.)

సంవామిత్యష్టర్చస్య సూక్తస్య, భరద్వాజః, ఇంద్రావిష్ణూ త్రిష్టుప్:—

౧. సంవాం కర్మణా సమిషా హినోమీంద్రా విష్ణూ అపసస్పారే అస్య।
జుషేథాం యజ్ఞం ద్రవిణం చ ధత్త మరిష్టైర్నః పథిభిః పారయన్తా॥

తా. ఓ ఇంద్రా విష్ణులారా! మిమ్ములను స్తుతిచేతను హవిస్సుచేతను మిక్కిలి ప్రేరేపించుచున్నాను. ఈ క్రతువుయొక్క సమాప్తియందు యజ్ఞమును సేవింపుఁడు. మఱియు ఉపద్రవములేని మార్గములచేత మమ్ములను పారమును పొందించుచు మాకు ధనము నివ్వుఁడు. ౧

౨. యా విశ్వాసాం జనితారా మతీనా మిన్ద్రావిష్ణూ కలశా సోమధా

నా॥ ప్రవాంగిర శ్శస్యమానా అవన్తు ప్రస్తోమాసో గీయమానాసో అర్కైః॥

తా. ప్రసిద్ధులగు ఇంద్రా విష్ణువులు సకలస్తోత్రములకు హేతు భూతులగుచున్నారు. సోమముంచుటకు ఆధారభూతములగు కలశములును అగుచున్నారు. ఓ ఇంద్రావిష్ణువులారా! మీరు నేనుయిప్పుడుపలుకుచున్న శస్త్రరూపములగు వాక్యలను పొందుడు. స్తోతలుగానము చేయుచున్న స్తోత్రములను గూడ పొందుడు. ౨

మూ మం. ఇన్ద్రా విష్ణూ మదపతీ మదానామా సోమం యాతం ద్రవిణో దధానా। సం వామఞ్జ న్త్వక్తుభిర్మతీనాంసంస్తోమాస శ్శస్యమానాసఉక్థైః॥ 3.

తా. ఓ ఇంద్రావిష్ణువులారా! సోమమునకధిపతులును, ధనమును ధరించువారునులగు మీరుసోమమున కభిముఖులుగరండు. స్తోతలయొక్క స్తోత్రములను శస్త్రములతోడ నుచ్చరించుచున్న వారలయి కాంతులతోడ కలసియుందురుగాత. 3

మూ. మం. ఆ వా మ శ్వా సో అభిమాతిషాహ ఇన్ద్రా విష్ణూ సధమాదోవహన్తు। జుషేథాం విశ్వా హవనా మతీనా ముప బ్రహ్మాణిశృణుతం గిరో మె॥ ౪.

తా. ఓఇంద్రావిష్ణువులారా! మిమ్ములను హింసకులను పరాభవించునట్టివియు, సంతోషించునట్టియు, అశ్వములు వహించుగాక. స్తోతలు చేయు స్తోత్రములన్నిటిని వినుడు. నా సంబంధములగు స్తోత్రములను శస్త్రరూపములగు వాక్యలను వినుడు. ౪

మూ. మం. ఇన్ద్రా విష్ణూ తత్పనయాయ్యం వాం సోమస్య మదఉరు చక్ర మాథే। అకృణుత మన్తరిక్షం వరీయో ప్రథతం జీవసేనో రజాంసి॥. ౫.

తా. ఓ ఇంద్రా విష్ణువులారా! సోమునకు మదములగగా మీరు విస్తీర్ణముగ వ్యాపించితిరి. అంతరిక్షమును విస్తారముగ నొనర్చితిరి. లోకములన్నింటిని మాజీవనముకొఱకు విస్తారముగ నొనర్చితిరి. ఈ పనికొనియాడఁదగినది. (ఇందు త్రివిక్రమావతార విషయము సూచింపఁబడినది.) విష్ణువొక్కఁడే చేసినను ఇద్దఱిని చేర్చి స్తుతించుట

చేత ఇటుల చెప్పఁబడినది.					౫

మూ. మం. ఇన్ద్రావిష్ణూ హవిషా వావృధానా గ్రా ద్వానా నమసారాతహవ్యా। ఘృతాసుతీ ద్రవిణం ధత్తమస్మే సముద్రస్థః కలశః సోమధానః॥					౬.

తా. ఘృతమేయన్నముగాగల ఓ ఇన్ద్రా విష్ణువులారా! మీరుసోమముచేత వృద్ధినందిన వారలయి సోమాగ్రభాగమునందుండు శుక్రమును భుజించుచు నమస్కారమొనర్చి మేమిచ్చుచున్న హవిస్సును గ్రహించుచు మాకు ధనము నివ్వఁడు. మీరుసముద్రము వలెనుండుఁడు. అటులనుండు లేని సోమకలశముతో తుల్యముగనుండురు.

మూ. మం. 'ఇన్ద్రా విష్ణూ పిబతం మధ్వో అస్యసోమస్య దస్రా జఠరం పృణేథామ్। ఆ వా మన్ధాంసి మదిరా ణ్యగ్మ న్నుప బ్రహ్మాణి శృణుతం హవంమే॥					౭.

తా. దర్శనీయులగు ఓఇంద్రావిష్ణువులారా! మీరుమధురమగు సోమరసమును త్రాగుఁడు త్రాగిమీయుదరమును నింపుకొనుఁడు. ఓఇంద్రావిష్ణువులారా! మదకరములును సోమరూపములును అగుఅన్నములు మీకభిముఖముగ వచ్చుగాక, నేను చేయుస్తోత్రములను నాయాహ్వానమును మీరు వింటురుగాక.

మూ. మం. ఉభా జిగ్యథు నః పరాజయేథె న పరాజిగ్యే కతర శ్చ నైనోః। ఇన్ద్ర శ్చవిష్ణో యదపస్పృధేథాం త్రేధా సహస్రం వితదైరయేథాం॥					౮.

విష్ణుసూక్తం సమాప్తమ్.

తా. ఓఇంద్రా విష్ణువులారా!మీరుభయులు శత్రువులనుజయించుఁడు. మీరుఒకానొకపుడును పరాజయమును పొందలేదు. మీలోఎవఁడును పరాజయమును పొందలేదు. ఇంద్రుఁడును విష్ణువును ఏవస్తువును గూర్చి అసురులతో కలహించి కోరెరో త్రివిధముగనున్న దానిని అమితముగ ఆక్రమించుకొనిరి.

విష్ణుసూక్తము సమాప్తము.

# 4 సారస్వతసూక్తమ్.

ఇయమదదాదితి. చతుర్దశర్చం ద్వాదశం సూక్తం భరద్వాజస్యార్షం సరస్వతీ దేవతాకం, అదితిః, త్రిసోజగత్యః త్రయోదశ్యపి జగతీ చతుర్దశ త్రిష్టుప్, శిష్టాగాయత్ర్యః —

మూ. మం, ఇయ మదదా ద్రభస మృణచ్యుతం దివోదాసం వధ్ర్యశ్వాయ దాశుషే। యాశశ్వన్త మాచఖాదా వసం పణిం తాతే దాత్రాణి తవిషా సరస్వతి॥ ౧॥

తా. ఈసరస్వతి తనకు హవిస్సు నిచ్చిన వధ్ర్యశ్వుఁడను ఋషీశ్వరునకు వేగవంతుఁడును, దేవ, ఋషి, పితృఋణములను, లౌకికఋణమును తీర్చుటయందు సమర్థుఁడగు దివోదాసుఁడను పుత్రునిచ్చెను. ఈసరస్వతియె ఒకరికే మాత్రము నివ్వక తాను మాత్రము తృప్తిగ ననుభవించు పణియను వణిజుని చంపెను. ఓసరస్వతీదేవీ! నీవిచ్చిన పుత్రదానము మున్నగు మహాకార్యములు గొప్పవి యగుచున్నవి.

మూ. మం. ఇయం శుష్మేభి ర్బిసఖా ఇవారుజత్సాను గిరీణాం తవిషేభి రూర్మిభిః। పారావతఘ్నీ మవసే సువృక్తిభి స్సరస్వతీ మావివాసే మధీతిభిః॥ ౨॥

తా. నదీరూపమునను న్న ఈసరస్వతి శోషింపఁజేయునవియు, గొప్పవియునగు తనయొక్క తరంగములచేత తీరసమీపమున నుండు పర్వతములయొక్క చరియలను తామరతూడులను త్రవ్వువాఁడువలె తెగఁగోయుచున్నది. దూరదేశమునందున్న వృక్షములను కూడ పడఁగొట్టు నట్టి సరస్వతిని స్తుతులచేతను కర్మలచేతను రక్షణము కొఱకు పిలుచుచున్నారము. ౨

మూ. మం. సరస్వతి దేవనిదో నిబర్హయ ప్రజాం విశ్వస్య బృసయస్య మాయినః। ఉతక్షితిభ్యోఽవనీ రవిన్దో విషమేభ్యో అస్రవో వాజినీవతి॥ ౩॥

తా. ఓసరస్వతీ! నీవు దేవనిందకులగు అసురులను చంపితివి. అంతట వ్యాపించినట్టియు, మాయావియు నగుబృసయునియొక్క (బృసయుఁడని త్వష్టకునామాంతరము) పుత్రుఁడగు వృత్రాసురుని చంపితివి. (అనఁగా నీసహాయము చేతనే ఇంద్రుఁడు వృత్రుని చంపెనని

భావము). అన్నముగల ఓసరస్వతీ! నీవు మనుష్యులకు అసురులు హరిం
చిన భూమిని పొందింపఁజేసితివి. అసురులను జయించి వారి దగ్గిఱ
నుండి భూములను పొంది వారికి విషమిచ్చితివి. 3

మూ. మం. ప్రణో దేవీ సరస్వతీ వాజేభి ర్వాజినీవతి। ధీనా మవిత్ర్యవతు॥ ౪.

తా. దానాదిగుణములు గలిగి అన్నయుతమగు ఓసరస్వతీ! ధ్యానించు వారిని రక్షించు నట్టినీవు అన్నములచేత మమ్ములను సంతోషింపఁజేయుము.

మూ. మం. యస్త్వా దేవి సరస్వత్యు ప్రబ్రూతే ధనేహితే। ఇంద్రం న వృత్రతూర్యే॥ ౫.

తా. ఓసరస్వతీ! ఏస్తోతయుద్ధము కలుగుచు ండఁగా ధననిమిత్తము ఇంద్రుని స్తుతించు రీతిగ నిన్ను స్తుతించునో ఆ స్తోతను నీవు రక్షించుము. ౫

మూ. మం. త్వం దేవి సరస్వత్యవా వాజేషు వాజిని। రద. పూషేవన స్సనిమ్॥ ౬

తా. దానాదిగుణములును బలమునుగల ఓసరస్వతీ! నీవు యుద్ధములందు మమ్ములను రక్షింపుము. మఱియు పోషకుఁడగు పూషవలె కోరఁదగిన వరము నిమ్ము. ౬

మూ. మం. ఉతస్యానస్సరస్వతీ ఘోరాహిరణ్యవర్తనిః। వృత్రఘ్నీవష్టి సుష్టుతిమ్॥ ౭।

తా. మఱియు ఆసరస్వతి శత్రువులకు భయమును చేయుచున్నదై బంగారు రథము కలిగి శత్రుఁడగు వృత్రాసురుని చంపుచు నేను చేయు నుతినికోరుగాక.

మూ.మం. యస్యా అనన్తో అహ్రుత స్త్వేషశ్చరిష్ణు రర్ణవః॥ అమ శ్చరతి రోరువత్॥ ౮.

తా. ఏసరస్వతియొక్క బలము అపరిమితమును, ఇతరులచే హింసింపఁబడనిదో ప్రకాశించునదియు చరించు స్వభావముగలదియు నగుచు మిక్కిలి శబ్దించునో, అట్టి సరస్వతియని పై మంత్రముతో సను న్నాయుము. ౮.

మూ.మం. సానో విశ్వా అతిద్విష స్స్వస్ర రన్యా ఋతావరీ।
అతన్న హేవ సూర్యః॥ ౯॥

తా. అట్టి సరస్వతి మమ్ములను ద్వేషించు ప్రజలనందఱిని సూర్యుఁడు చరించుచు పగటిని అతిక్రమించు విధముగ అతిక్రమింపఁజేయుగాక. అట్లే స్వాయముగ ప్రసరించు ఉదకయుతములగునదులను సైతము అతిక్రమింపఁజేయుగాక. ౯

మూ.మం. ఉత నః ప్రియాప్రియాసు సప్తస్వసాసుజుష్టా।
సరస్వతీ స్తోమ్యాభూత్॥ ౧౦॥

తా. మఱియు మాకు ప్రియములయిన వానిలోపల ప్రియమైనదియు, దేవతారూపమున గాయత్ర్యాది సప్తఛందస్సులు తోఁబుట్టువులు గలదియు, నదీరూపమున గంగాది సప్తనదులతోఁ గూడుకొన్నదియు, ప్రాచీనులగు సప్తఋషులచేత సేవింపఁబడుచున్నదియు అగుసరస్వతి స్తుతిచేయఁబడుగాక. ౧౦

మూ.మం. అపప్రుషీ పార్థివా న్యురురజో అన్తరిక్షం।
సరస్వతీ నిదస్పాతు॥ ౧౧॥

తా. పృథివీసంబంధములగు విశాలములగు లోకములను, అంతరిక్షమును స్వకీయకాంతిచేత నిండింపఁజేసిన సరస్వతి మమ్ములను నిందించు శత్రువునుండి మమ్ములను రక్షించుగాక. ౧౧

మూ.మం. త్రిషధస్థా సప్తధాతుః పంచజాతా వర్ధయంతీ।
వాజేవాజేహవ్యాభూత్॥ ౧౨॥

తా. ముల్లోకములందుండునదియు, గంగాదిసప్తనదులతోఁడనుండునదియు, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, నిషాదులనుపంచవర్ణములవారిని వృద్ధిచేయునదియు అగు సరస్వతి ప్రతియుద్ధమందును మాచేత పిలువఁబడుగాక. ౧౨

మూ.మం. ప్రయామహిమ్నా మహినా సుచేకి తేద్యుమ్నే భిరన్యాఅపసామపస్తమా।రథ ఇవబృహతీ విభ్వనే కృతోపస్తుత్యా చికితుషా సరస్వతీ॥ ౧౩॥

తా. మాహాత్మ్యముచేత గొప్పదియు, ప్రకాశించునట్టి కీర్తులచే గూడుకొన్న ఈనదులలోపల ఏసరస్వతి బాగుగ తెలియఁబడుచున్నదో,

ఏనది వేగముగల ఇతరనదులలోపల మిక్కుటమగు వేగముగలదో, ఏ నదిగుణాతిశయము కలిగియుండు విధముగ సృజింపఁబడినదో అట్టిసర స్వతిని తెలివిగల స్తోత స్తుతిచేయవలయును. ౧3

మూ.మం. సరస్వత్యభినో నేషివస్యోమాపస్ఫరీః పయసామాన ఆధక్। జుషస్వ నస్సఖ్యా వేశ్యాచ మా త్వ త్క్షేత్రాణ్యరణ్యాని గన్మ॥ ౧౪॥

సారస్వతసూక్తంసంపూర్ణమ్. ఋ. సం. 4. 8. 30.

తా. ఓసరస్వతీ! మాకు ప్రశస్తమగు ధనమునిమ్ము. వృద్ధిలేని వారినిగా చేయకుము. మిక్కుటమయిన నీయుదకముచేత మమ్ము లనుబాధింపకుము, మఱియు మాయొక్క మిత్రకృత్యములను ప్రవేశ ములను పొందుము. మేము నీసమీపమునుండి నికృష్టములయిన ప్రదేశములను పొందకయుండుముగాక.

సారస్వతసూక్తము సంపూర్ణము.

# వసిష్ఠసూక్తమ్.

శ్విత్యంచ ఋతిచతుర్దశగ్సం షోడశం సూక్తం:--

మూ. ౧. శ్విత్యం చోమా దక్షిణతస్కపర్దా ధియం జిన్వాసో అభిహిప్రమన్దుః। ఉత్తిష్ఠ న్వోచే పరిబర్హిషోనృన్నమేదూరా దవితవే వసిష్ఠాః॥

తా. తెల్లని వర్ణము గలిగినట్టియు, కర్మలను పూరించునట్టియు, శిరమునకు దక్షిణ భాగమునందు చూడ గలిగినట్టియు మీరు నన్ను విద్యాబలముచేత సంతోషపెట్టితిరి. (సుదాసుఁడనువాని) యజ్ఞము నుండి లేచివచ్చిననేను యజ్ఞములను చేయించు మీకుపదేశించుచు న్నాఁడను. ఓవాసిష్ఠులారా! మీరుసుదాసునియజ్ఞమునకుపోకుఁడు.

మూ. ౨. దూరా దిన్ద్రమనయ న్నాసుతేన తిరో వైశన్త మతిపాన్తముగ్రం। పాశద్యుమ్నస్య వాయతస్య సోమా త్సుతాదిన్ద్రో వృణీతా వసిష్ఠాః॥

తా. వసిష్ఠుని పుత్రులు సుదాసుని యజ్ఞము చేయించునపుడే పాశద్యుమ్నుఁడను నృపతియు యజ్ఞమును చేయుటకుపక్రమించెను. అప్పుడు వసిష్ఠపుత్రులు పాశద్యుమ్నుని యాగమునందు సోమపానమొనర్చుచున్న ఇంద్రుని మంత్రబలముచేత సుదాసుని యజ్ఞమునకు రప్పించిరి. ఆవిషయమును వసిష్ఠుఁడు జ్ఞప్తికి తెచ్చుచున్నాఁడు. ఓవసిష్ఠులారా! పాశద్యుమ్నుని యజ్ఞమునందు సోమపానమొనర్చుచున్నట్టియు, భయంకరుఁడునుఅగు ఇంద్రుని సుదాసుని యజ్ఞమునందు సోమపానమొనర్చుటకుఁగాను పాశద్యుమ్నుని తిరస్కరించి దూరమును పొందించితిరి. ఇంద్రుఁడును వయత్తునిపుత్రుఁడగు పాశద్యుమ్నుని విడిచి సుదాసుని యజ్ఞమునందు సోమపానమును చేయుటకు వసిష్ఠపుత్రుల ప్రభావమువలన వచ్చెను.

మూ. 3. ఏవేన్నుకం సిన్ధుమేభి స్తతారేవేన్నుకం భేద మేభి ర్జఘాన।
ఏవేన్నుకం దాశరాజ్ఞే సుదాసం ప్రావదిన్ద్రో బ్రహ్మణావో
వసిష్ఠాః॥

తా. పాశద్యుమ్నుని యజ్ఞమునందు సోమపానమును చేయుచున్న ఇంద్రుని వసిష్ఠపుత్రులు మంత్రబలముచేత సుదాసుని యజ్ఞమునకు రప్పించిన విధముగ నదినికూడ సుఖముగ దాటించిరి. అదేవిధముగ భేదుఁడను శత్రువునుకూడ జంపించిరి. ఓవసిష్ఠులారా! పదుగురు రాజులువచ్చి యుద్ధము చేయుచుండఁగా సుదాసుని ఇంద్రుఁడురక్షించెను.

మూ. ౪. జుష్టీనరో బ్రహ్మణావః పితౄణా మక్ష మవ్యయం నకిలారిషాథ।
యచ్ఛక్వరీషు బృహతా రవేణేన్ద్రే శుష్మమదధాతా వసిష్ఠాః॥

తా. ఓవసిష్ఠులారా! మీరుచేయునట్టి స్తోత్రముచేత పితరులకుప్రీతికలుగును. (నేనిప్పుడాశ్రమమునకు పోవుటకుగాను) రథమునుకదలించుకొని పోవుచున్నాను. మీరు దుర్బలులుకాకుఁడు. ఓవసిష్ఠులారా! మీరు ఋక్కులందు శ్రేష్ఠమగు సామముచేత ఇంద్రునియందు బలముంచుఁడు.

మూ. ౫. ఉద్యామివేత్తృష్ణజో నాథితాసోఽదీధయు ర్దాశరాజ్ఞే వృతాసః।
వసిష్ఠస్య స్తువత ఇంద్రో అశ్రోదురుం తృత్సుభ్యో అకృణోదు
లోకమ్॥

తా. తృష్ణగలవారును, తృత్సుడను రాజుచేత వరింపబడినవారును, వృష్టినియాచించుచున్న వారును అగు వసిష్ఠులు. ఇంద్రుని పదుగురు రాజుల యుద్ధమునందు ధరించిరి. ఇంద్రుడు స్తుతిచేయున్న వసిష్ఠునియొక్క స్తోత్రమును వినెను విశాలమగు లోకమును తృత్సులను రాజులకు ఇచ్చెను.

మూ. ౬. దండా ఇవేద్గో అజనాస ఆసన్పరిచ్ఛిన్నా భరతా అర్భకాసః।
అభవచ్చ పురఏతా వసిష్ఠ ఆదిత్తృత్సూనాం విశో అప్రథన్త॥

తా. గోవులను తోలునట్టి దండములు లెక్కపెట్టబడిన ఆకులు రెమ్మలుకలవిగ నున్నందునో అట్లే తృత్సువంశపు రాజులును పరిచ్ఛిన్నులు అయియుండిరి. అల్పులునుకూడ అయియుండిరి. అనంతరమందు వసిష్ఠుడు వారికి పురోహితుడాయెను. అతని మంత్రసామర్థ్యమువలన వారివంశము వృద్ధినొందెను.

మూ. ౭. త్రయః కృణ్వన్తి భువనేషు రేతస్తిస్రః ప్రజా ఆర్యా జ్యోతిరగ్రాః।
త్రయో ఘర్మాస ఉషసం సచంతే సర్వాం ఇత్తాం అనువిదుర్వసిష్ఠాః॥

తా. పృథివ్యంతరిక్ష ద్యులోకములందు అగ్నివాయు సూర్యులను ముగ్గురు ప్రపంచమును ధరించు ఉదకమును చేయుచున్నారు. ఆముగ్గురకు సూర్యుడు మొదలుగాగల మహనీయులగు 3 ప్రజలు అగుచున్నారు. ఆముగ్గురు ప్రకాశించుచున్నవారలయి ఉషస్సును పొందుచున్నారు. వారందఱిని వసిష్ఠులెఱుంగుదురు.

౮. సూర్యస్యేవ వక్షథో జ్యోతిరేషాం సముద్రస్యేవ మహిమా గభీరః। వాతస్యేవ ప్రజవో నాన్యేన స్తోమో వసిష్ఠా అన్వేతవే వః॥

తా. ఓవసిష్ఠులారా! మీమహిమ సూర్యకాంతివలె ప్రకాశించుచున్నది. మీమహిమ సముద్రమువలె గభీరమయినది. ఓవసిష్ఠులారా! మీమహిమ వాయువేగమువలె ఇతరులనుసరించుటకు అశక్యమయినది.

మూ. ౯. త ఇన్నిణ్యం హృదయస్య ప్రకేతైః సహస్రవల్శమభిసంచరన్తి।
యమేన తతం పరిధిం వయన్తోఽప్సరస ఉపసేదుర్వసిష్ఠాః॥

తా. ఆవసిష్ఠుడు తెలియనలవిగానట్టియు పలుతెరగులుగల సంసారమునుగూర్చి స్వేచ్ఛగచరించుచున్న జ్ఞానముగలవాడై కారణాత్మచేత వ్యాపింపబడిన సంసారమునందు ఇచ్ఛగలవాడై అప్సరసలునుతస

కుతల్లిగా కోరుకొనెను.

మూ.౧౦. విద్యుతో జ్యోతిఃపరిసంజిహానంమిత్రావరుణౌ యదపశ్యతాంత్వా। తత్తే జన్మోతైకం వసిష్ఠాగస్త్యోయత్త్వావిశ ఆజభార॥

తా. ఓవసిష్ఠుఁడా! నీవెప్పుడు మెరుపువలె స్వకీయమగుకాంతిని (దేహాంతరపరిగ్రహార్థము) వదలుచుంటివో అప్పుడు మిత్రావరుణులు మనకితఁడు జన్మించుగాక అని సంకల్పించిరి. అప్పుడు నీకొక జన్మముకలిగెను. మఱియు అగస్త్యుడు ప్రవేశమువలన నిన్ను భరించి నప్పుడొకటియు కలిగెను.

మూ.౧౧. ఉతాసిమైత్రావరుణోవసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్మనసోఽధిజాతః। ద్రప్సంస్కన్నం బ్రహ్మణాదైవ్యేనవిశ్వేదేవాఃపుష్కరేత్వాదదన్త॥

తా. మఱియు ఓవసిష్ఠుఁడా! నీవు మిత్రావరుణులకు పుత్రుఁడవైతివి. ఓవసిష్ఠుఁడా! మిత్రావరుణులు ఉర్వశినిజూచి ఇట్టిపుత్రుఁడు కలుగుగాక యని తలంచిన తోడనే చలించిన తేజమువలన నీవుజన్మించితివి. ఇటుల దేవతా సంబంధముచేత జన్మించినట్టియు స్వాయముగ ప్రాదుర్భవించిన వేదరాశిగల నిన్ను విశ్వేదేవులు పుష్కరమునందు (తామరపువ్వునందు) ఉంచిరి.

౧౨. సప్రకేత ఉభయస్య ప్రవిద్వాన్సహస్రదాన ఉతవాసదానః। యమేన తతం పరిధింవయిష్యన్నప్సరసఃపరిజజ్ఞేవసిష్ఠః॥

తా. ఆవసిష్ఠుఁడు ప్రకృష్టజ్ఞానము గలవాఁడై ద్యులోకపృథివీలోకముల నెఱింగినవాఁడై వేలకొలఁది దానములుగల వాఁడయ్యెను. మఱియు సర్వదానములు గలవాఁడయ్యెను. మఱియు వసిష్ఠుఁడు సర్వనియంతయగు యమునిచేత వ్యాపింపఁజేయఁబడినదియు సంసారరూపమును అగు వస్త్రమును నేయుటకుగాను ఊర్వశికిజన్మించెను.

౧౩. సత్రేహజాతా విషితానమోభిఃకుంభే రేతస్సిషిచతుస్సమానం। తతోహమాన ఉదియాయ మధ్యాత్తతో జాతమృషిమాహుర్వసిష్ఠమ్॥

తా. సత్రయాగమునందు (సత్రయాగమనఁగా అనేకులగు యజమానులు కలిసిచేయు యజ్ఞభేదము) దీక్షితులగు మిత్రావరుణులు ఇతరులుచేయు నమస్కృతులను పొందినవారలయి వసతీవరకలశమునం

దోక్క పర్యాయమే తమ తేజస్సును వదలిరి. ఆకలశమధ్యమునుండి అగస్త్యుఁడు జన్మించెను. ఆకలశమునుండియే వసిష్ఠఋషియు జన్మించెను.

౧౪. ఉక్థభృతం సామభృతం బిభర్తి గ్రావాణం బిభ్రత్ప్రవదాత్యగ్రే। ఉపైన మాధ్వం సుమనస్యమానా ఆవోగచ్ఛతి ప్రత్ఫృదో వసిష్ఠః॥ వసిష్ఠసూక్తస్సమాప్తః.

తా. ఓ ఋత్త్విజులారా! మీదగ్గఱకు వసిష్ఠుఁడు వచ్చుచున్నాడు. ఈ వసిష్ఠుని సంతోషము గలవారయి ఉపాసింపుఁడు. ఈవసిష్ఠుడువచ్చి మీయజ్ఞమునందు బ్రహ్మయగును. ఓ ఋత్త్విజులారా! ఈవసిష్ఠుఁడు అధ్వర్యుఁడు, ఉద్గాత, ఉక్థభృత్తు, గ్రావభృత్తు మున్నగువారలు యజ్ఞమునం దేయవివచించుదురో వానియందలిలోపాలోపములను పరిశీలించి చక్కఁగఁ పలుకును.

వసిష్ఠసూక్తము సమాప్తము.

## 5. గ ణ ప తి సూ క్త మ్.

మూ. ఆతూన ఇంద్రక్షుమంతం చిత్రంగ్రాభం సంగృభాయ। మహాహస్తీదక్షిణేన॥ ౧॥

౧. తా. ఓ ఇంద్రుఁడా! గొప్పహస్తముగలనీవు మాకిచ్చుటకుగాను కొనియాడఁదగినట్టియు, విచిత్రమైనదియు గ్రహింపదగినదియునగు ధనమును కుడిచేతిచేత మాకభిముఖముగ గ్రహించుము.

మూ. విద్మాహి త్వా తువికూర్మిం తువిదేష్ణం తువీమఘం। తువిమాత్రమవోభిః॥ ౨॥

౨. తా. ఓఇంద్రుఁడా! నిన్ను పలు తెఱంగులగు కర్మలుగలవానిగను, అతిశయముగనిచ్చువానిగను, బహు ధనముగలవానిగను, పలువిధముల గు ప్రమాణములుగలవానిగను, రక్షణములతోకూడుకొన్న వానిగను తెలిసికొనుచున్నారము.

మూ. నహి త్వాశూర దేవా నమర్తాసో దిత్సంతం। భీమం న గాం వారయంతే॥ 3॥

3. తా. ఓఇంద్రుఁడా!నీవుఇయ్యఁదలఁచుకొను నెడలనిన్ను సస్యమును

మేయుచున్న భీకరమగు ఆంబోతును నివారింపలేని విధముగ దేవతలు నివారించలేరు. మనుష్యులును వారింపలేరు.

మూ: ఏతోన్విన్ద్రం స్తవామేశానం వస్వ స్వరాజం।
నరాధసా మర్ధిషం నః॥ ౪॥

తా. నాసంబంధులగు ఓజనులారా! శీఘ్రముగరండు, ధనమునకధిపతియు, స్వయముగప్రకాశించువాడును అగు ఇంద్రుని స్తుతి చేయుదము. ఇంద్రుని యనుగ్రహమునందిన మనలను మఱొకధనవంతుడు బాధింపకుండుగాక.

మూ. ప్రస్తోషదుపగాసిష చ్ఛ్రవత్సామగీయమానం।
అభిరాధసా జుగురత్॥ ౫॥

౫. తా. ఇంద్రుడా విధముగ స్తుతినిచేసి ఉపగానమును చేయుగాక, అతనికై చేయు సామగానమును వినుగాక. ధనవంతుడై మమ్ములను గ్రహించుగాక.

మూ. ఆనోభరదక్షిణేనాభిసవ్యేన ప్రమృశ।
ఇంద్రమానో వసో ర్నిర్భాక్॥ ౬॥

౬. తా. ఓఇంద్రుడా! మాకొఱకు ధనమును భరింపుము. రెండు హస్తములచేతమాకిమ్ము. మమ్ములను ధనమునుండి వేరుచేయకుము

మూ. ఉపక్రమస్వాభర ధృషతా ధృష్ణోజనానాం।
అదాశూష్టరస్య వేదః॥ ౭॥

౭. తా. ఓఇంద్రుడా! మాకుధనమిచ్చుటకు ప్రవృత్తుడవుకమ్ము. శత్రువులను ధర్షించునట్టి ఓఇంద్రుడా! ధార్ష్ట్యమయిన మనస్సుతోడ జనులలోపల దానశూన్యుడగు వాని ధనమును గ్రహించినాకిమ్ము.

మూ: ఇంద్రయ ఉనుతే అస్తివాజో విప్రేభి స్సనిత్వః।
అస్మాభి స్సుతం సనుహి॥ ౮॥

౮. తా. ఓఇంద్రుడా! నీసమీపమునందు మేధావులగు విప్రులు పొందదగిన యన్న మేదిగలదో ఆయన్నమును మాచేత యాచింపబడినవాడై మాకిమ్ము.

మూ. సద్యో జువస్తే వాజా అస్మభ్యం విశ్వశ్చంద్రాః।
వశైశ్చమక్షూజరంతే॥ (ఋ. సం. అ.) ౯॥

-. తా. ఓఇంద్రుఁడా! పలువురకు సంతోషమును కలుగఁజేయునట్టి నీసంబంధములగు అన్నములు మాకు శీఘ్రముగకలుగుగాక మాసంబంధులగు జనులు అనేక కామములతో కూడిన వారలయి శీఘ్రముగ స్తుతిచేయుచున్నారు.

---

## ఋగ్వేదీయభోజనవిధి.

౧. ఆచమించి పంచార్ద్రుఁడై స్వస్థచిత్తముతో కూర్చుండిభుజించవలయును.

౨. పుత్రవంతుఁడగు గృహాశ్రమి స్వగృహమునందు ఉదఙ్ముఖముగ కూర్చుండి భుజించ గూడదు.

3. తల్లిదండ్రులు జీవించియుండువాఁడు దక్షిణాముఖముగ కూర్చుండి భుజించగూడదు.

౪. అన్నమునందు పరమాన్నమునందు ఆజ్యపాత్రము నుంచగూడదు. ప్రత్యేకముగనుంచవలయును.

అన్నము వడ్డించిన తరువాత:—

౧. ఓంభూర్భువస్సువః, తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్ :— ఈమంత్రముతో అన్నమును ప్రోక్షించవలయును.

౨. పిదప "ఓం" అని పదపర్యాయములుచ్చరించి యభిమంత్రించవలయును.

3. పిదప "సత్యం త్వర్తేన పరిషించామి" అని పగటియందును, "ఋతం త్వాసత్యేనపరిషించామి" యని రాత్రియందును పరిషేచనము చేయవలయును.

౪. తరువాత పాత్రమునకు దక్షిణ భాగమునందు ఉదకధారను పోసి "అందు ౧ "భూపతయే నమః, ౨ భువనపతయే నమః, 3 భూతానాంపతయే నమః" అను మంత్రములతో 3 బలులనుంచవలయును. ఈబలులు ప్రాగంతములుగాగాని ఉదగంతములుగాఁగాని పెట్టవలయును. ఉసిరికకాయలంత ప్రమాణము కలిగియున్న చాలును. ఈబలులపైన ఉదకముంచి బలులను తీసి వేయవలయును. తరువాత చేతినికడిగి కొనవలయును.

౫. పిదప ఆపోశనార్థము జలము గ్రహించి "అమృతోపస్తరణమసి" యను మంత్రముతో ఆజలమును పుచ్చుకొని ఈక్రింది మంత్రములతో ప్రాణాహుతులను గ్రసించవలయును.

1. "ఓంప్రాణాయస్వాహా" అనుచు అంగుష్ఠ, తర్జనీ, మధ్యమాంగుళులతో ప్రాగ్భాగమందును
2. "ఓంఅపానాయస్వాహా" ,, అంగుష్ఠ, మధ్యమానామికాంగుళులతో దక్షిణదిక్కునందును
3. "ఓంవ్యానాయస్వాహా ,, అంగుష్ఠానామిక కనిష్ఠికాంగుళులతో పశ్చిమదిక్కునందును
4. "ఓంఉదానాయస్వాహా ,, అంగుష్ఠ తర్జనీ కనిష్ఠికాంగుళులతో ఉత్తరదిక్కునందును
5. "ఓంసమానాయస్వాహా ,, అన్ని వ్రేళ్ళతో మధ్యభాగమునందును

ప్రాణాహుతులు పుచ్చుకొనవలయును. దంతములు తగులఁగూడదు.

౬. తనకు కుడిభాగమునందు జలపాత్రముంచి భుజించునపుడు కుడిచేతితోనే జలమును త్రాగవలయునని ఆశ్వలాయనుని యభిప్రాయము.

౭. భోజనాంతమునందు కుడిచేతియందుదకము నుంచుకొని అందు సగము "అమృతాపిధానమసి" యనుమంత్రముతో ఉత్తరాపోశనమునకు గ్రహించి తక్కిన సగమును శ్లో. రౌరవేఽపుణ్యనిలయే పద్మార్బుదనివాసినాం। అర్థినా ముదకం దత్త మక్షయ్య ముపతిష్ఠతు" అను శ్లోకము పఠించి క్రింద విడువవలయును.

౮. తరువాత అచ్చట పాత్రాంతరమునఁగాని లేక బయట శుద్ధప్రదేశమునందుగాని ముఖమునందు చేతులందు నుండు యుచ్ఛిష్టము పోవునటుల ప్రక్షాళనము చేసికొని ౧౬గండూషములో నర్చి ౨పర్యాయము లాచమించి ఉదకముతో పాదములను తుడుచుకొనవలయును.

౯. మూ. శ్లో. శర్యాతించ సుకన్యాంచ చ్యవనం శక్రమశ్వినౌ।
భోజనాన్తే స్మరన్నక్ష్ణో రంగుష్ఠాగ్రాంబు నిక్షిపేత్॥

తా. శర్యాతిని, సుకన్యను, శుక్రుని, ఇంద్రుని, అశ్వినీదేవతలను భోజనాంతమున స్మరించుచు అంగుష్ఠముయొక్క చివరభాగమునుండి జలమును కనులందుంచుకొనవలయును.

౧౦. అగ్నిరస్మీతి మన్త్రస్య, గాథినోవిశ్వామిత్రో, మరుతస్త్రిష్టుప్, భుక్తాన్న పాచనార్థం జపే వినియోగః:—

మూ. మం. ఓం అగ్నిరస్మి జన్మనా జాతవేదా ఘృతంమేచక్షు రమృతం మ ఆసన్। అర్కస్త్రిధాతూ రజసో విమానోఽజస్రో ఘర్మోహవిరస్మినామ॥ ౧,

,, ఆప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణ్యమ్। భవావాజస్య సంగథే॥ ౨

ఋ. సం. అ. 3-1-27.

,, సంతేపయాంసి సమయన్తువాజాస్సంవృష్ణ్యాన్యభిమాతిషాహః।ఆప్యాయమానో అమృతాయ సోమదివిశ్రవాంస్యుత్తమానిధిష్వ॥ 3.

ఋ. సం. అష్ట 1-6-22.

,, అగస్త్యఃఖనమానః ఖనిత్రైః ప్రజామపత్యం బల మిచ్ఛమానః।ఉభౌవర్ణావృషిరుగ్రః పుపోష సత్యాదేవేష్వాశిషో జగామ॥ ౪.

ఋ. సం. అ. 2-4-22.

తా. ఓకుశికులారా! అగ్నినగునేను పుట్టుచునే పరతత్త్వమును స్వయముగ నెఱింగితిని. ప్రపంచమును ప్రకాశింపఁజేయు కాంతియే ఘృతము. దివ్యాదివ్యవిషయికఫలము ననుభవించు కర్మ ఫలము నా ఆస్యమునందున్నది. జగత్స్రష్టయగు ప్రాణస్వరూపుఁడనగు నేను త్రివిధముగ ఆత్మను విభజించిన వాఁడనై వాయురూపమున అంతరిక్షము నధిష్ఠించి యున్నాను. ఆదిత్య రూపమున ద్యులోకము నధిష్ఠించియున్నాఁడను. అనుభవింపఁదగిన హవీరూపముగూడ నేనే. ౧.

ఓ సోముఁడా! నీవు వృద్ధిని పొందుము. నీసామర్థ్యము అంతట

వ్యాపించుగాక. ఇట్టి నీవు మాకన్నము నిచ్చువాఁడవు కమ్ము. ౨.

ఓసోముఁడా! శత్రుసంహారకుఁడవగు నిన్ను గూర్చి క్షీరములు వచ్చుగాక. హవీరూపములగు అన్నములును నిన్ను పొందుగాక. వీర్యములును నిన్ను పొందుగాక. ఓసోముఁడా నీవుమాకు అమృతత్వమును చేయుటకుగాను వృద్ధినందుచున్నవాఁడవై స్వర్గమునందు శ్రేష్ఠములగు అన్నములను మేము అనుభవించుటకు ధరించుము. 3.

(నాగురువగు) ఈయగస్త్యుఁడు ఫలమును కలుగఁజేయు యజ్ఞము, స్తుతియున్నగు సాధనములచేత అభిమతమగు ఫలమును చేయుచు కులమును పడకుండఁజేయునట్టి పుత్రులను, బలమును కోరుచున్నవాఁడై, అతీంద్రియ విషయద్రష్టయు, సంసారమునందుండియు అపాపుఁడునై కొనియాడఁదగినట్టి కామమును తపస్సును వృద్ధిని పొందింపఁజేసెను. దేవతల వల్లనుండి సత్యములగు ఆశీర్వాదములను పొందెను.

---

భోజనవిధిప్రమాణవచనాని.

శ్లో. ప్రాఙ్ముఖోఽన్నాని భుంజీత సూర్యాభిముఖ ఏవవా।
ఆసీనః స్వాసనే శుద్ధే భూమ్యాం పాదౌనిధాయచ॥

స్మృ. ము. వ్యాసః.

తా. ప్రాఙ్ముఖముగ గాని సూర్యాభిముఖముగ గాని పరిశుద్ధమగు ఆసనమునందు కూర్చుండి భూమియందు పాదములుంచి భుజించవలయును.

శ్లో. ఉపలిప్తే శుచౌదేశే నిశ్ఛిద్రం చతురశ్రకం।
గోమయం మండలం కృత్వా భోక్తవ్యమితి నిశ్చితమ్॥
పాత్రావస్థానతో న్యూన మధికంవా నకారయేత్॥

స్మృ. ము. శంఖః

తా. అలికిశుచియగునట్టి ప్రదేశమునందు చతురశ్రమండలమును గోమయము చేత నిశ్ఛిద్రముగఁజేసి పాత్రనుంచి భుజించవలయును, ఆమండలము పాత్రమునకంటె తక్కువగాఁగాని అధికముగాఁగాని యుండఁగూడదు.

శ్లో. మంత్రేణైవద్విరాచమ్య గోమయేనోపలిప్యతే।
భస్మనా వారిణా వాపి మండలం కారయేత్తతః॥

స్మృ. ము. బోధాయనః

తా. మంత్రముచేత రెండుపర్యాయములాచమించి గోమయముచేత అలికి చతురశ్రమండలము చేయవలయును. గోమయాభావమునందు భస్మముచేతగాని జలముచేతగాని మండలము చేయవలయును.

శ్లో. పంచార్ద్రో భోజనంకుర్యాత్ ప్రాఙ్ముఖో మౌనమాస్థితః।
హస్తౌ పాదౌ తథైవాస్య మేషు పంచార్ద్రతా స్మృతా॥

పరా. మాధ. లఘువ్యాసః.

తా. ప్రాఙ్ముఖముగఁగూర్చుండి మౌనియై పంచార్ద్రుఁడై భుజించవలయును. హస్తములు రెండు, పాదములు రెండు, ముఖము, ఈఅయిదును జలముచేత తడిగి కొనుట ''పంచార్ద్రత'' యనఁబడును.

శ్లో. సౌవర్ణే రాజతే తామ్రే పద్మపత్ర పలాశయోః।
భాజనే భోజనే చైవాతిరాత్రఫల మశ్నుతే॥ ౧.
,, ఏకఏవతు యోభుంక్తే విమలే కాంస్యభాజనే।
చత్వారి తస్య వర్ధన్తే ఆయుః ప్రజ్ఞా యశోబలం॥ ౨.

పరా. మాధ. పైఠీనసిః.

తా. బంగారు, వెండి, రాగి, తామరాకు, మోదుగాకు, ఈపాత్రములందు భుజించిన యెడల అతిరాత్రయాగ మొనర్చినంత ఫలము కలుగును. ౧. నిర్మల మగు కాంస్య పాత్రమునందు తానొక్కఁడే భుజించు నేని వానికి ఆయువు, ప్రజ్ఞ, కీర్తి, బలము, ఈనాలుగు వృద్ధియగును.

శ్లో. అన్నం దృష్ట్వా ప్రణమ్యాదౌ ప్రాంజలిః కథయేత్తతః।
అస్మాకం నిత్యమస్త్వేత దితిభక్త్యాఽథవందయేత్॥

పరా. మాధ. బ్రహ్మపురాణే.

తా. అన్నమును చూచినతోడనె నమస్కరించి దోసిలియొగ్గి ''ఈయన్నము మాకెల్లపుడుండుగాక''అని పలికి భక్తితో నమస్కరించవలయును.

శ్లో. స్వాహాన్తాః ప్రణవాద్యాశ్చ నామ్నా మంత్రాస్తు వాయవాః।
జిహ్వయైవ గ్రసేదన్నం దశనైస్తు న సంస్పృశేత్॥

పరా. మాధ. శౌనకః

తా. వాయువులనామములు ప్రణవాదిగను స్వాహాంతములుగను వచించుచు నాలుకయందు అన్నమును ప్రాణాహుతులకుగాను వేసికొనవలయును. దంతములు తగులఁగూడదు.

శ్లో. యత్నేనధారయే ద్విప్రః పవిత్రం దక్షిణేకరే।
భుంజానస్తు విశేషేణ చాన్నదోషైర్నలిప్యతే॥

పరా. మాధ. ఆపస్తంబః.

తా. బ్రాహ్మణుఁడు భుజించునపుడు కుడిచేతియందు (ముడివేయని) కుశపవిత్రము నవశ్యము ధరించవలయును. అట్లు ధరించి భుజించువానికి అన్నదోషము లేమియు నంటవు.

శ్లో. భోజనం భజనం దాన ముపహార ప్రతిగ్రహౌ।
న బహిర్జానుకార్యాణి తద్వదాచమనం స్మృతం ॥
స్మృ. ము. బోధాయనః

తా. భోజనము, దేవతాసేవ, దానము, ఉపహారము, ప్రతిగ్రహణము, ఆచమనము, ఇవి బహిర్జానువుగ (అనఁగా మోకాళ్ళకు వెలుపల చేతులుంచి) చేయకూడదు.

శ్లో. మృణ్మయే పర్ణపృష్టే వా కార్పాసే తాంతవే ఽశ్మని।
నాశ్నీయా న్నపిబేదన్న ముదకంచ తథాంజలౌ ॥
స్మృ. ము. ప్రచేతాః

తా. మృణ్మయపాత్రయందును, పర్ణపృష్ఠమునందును, ప్రత్తియాకునందును, వస్త్రమునందును, రాతియందును దోసిలియందును అన్నముతినఁగూడదు. జలము త్రాగఁగూడదు.

శ్లో. నస్పృశేద్వామహస్తేన భుంజానోఽన్నం కదాచన।
నపాదౌ నశిరోవస్త్రం నపదాభాజనం స్పృశేత్ ॥
స్మృ. ము. ఉశనాః

తా. అన్నము భుజించునప్పుడు ఎడమచేతిలో అన్నము తినఁగూడదు. అట్లే పాదములను శిరమును పాగ్గా కట్టుకొనుటను తాఁకకూడదు పాదముతోటి పాత్రమును తాఁకఁగూడదు.

శ్లో. యస్తుపాణితలే భుంక్తే యస్తుఫూత్కారసంయుతం।
ప్రసృతాంగులిభిర్యచ్చ తస్యగోమాంసవచ్చతత్ ॥ ౧
,, నాజీర్ణేభోజనం కుర్యాత్ కుర్యాన్నాతిబుభుక్షితః।
హస్త్యశ్వరథయానోష్ట్ర మాస్థితో నైవభక్షయేత్ ॥ ౨
,, శ్మశానాభ్యంతరస్థో వా దేవాలయగతోఽథవా।
శయనస్థో నభుంజీత నపాణిస్థం నచాసనే॥ ౩
,, నార్ద్రవాసానార్ద్రశిరా నచాయజ్ఞోపవీతవాన్।
నప్రసారితపాదస్తు పాదారోపితపాణిమాన్ ॥ ౪
,, నబాహుసక్థిసంస్థశ్చ నచపర్యంకమాస్థితః।
నవేష్టితశిరశ్చాపి నోత్సంగకృతభాజనః ॥ ౫
,, నైకవస్త్రో దుష్టమధ్యే నోపానత్కస్సపాదుకః।

నచరోమ్ణ పరిసంస్థశ్చ చర్మావేష్టితపార్శ్వవాన్ ॥ ౬

శ్లో. గ్రాసశేషం న చాశ్నీయాత్ పీతశేషం పిబేన్నచ ।
శాకమూలఫలేక్షూణాం దంతచ్ఛేదైర్న భక్షయేత్ ॥ ౭

,, బహూనాం భుంజతాం మధ్యే న చాశ్నీయాత్త్వరాన్వితః ।
వృథా న విసృజేదన్నం నోచ్ఛిష్టం కుత్రచిద్వ్రజేత్ ॥

పరా. మాధ. బ్రహ్మాండపురాణే.

తా. అరచేతియందు పెట్టుకొని భుజించినను ఊదుకొనుచు తినినను వ్రేళ్ళు చాచుకొని భుజించినను గోమాంసముతో సమానమని యెఱుంగునది. 1 అజీర్ణముగనున్నప్పుడును. అత్యంత మాకలి కలిగినప్పుడును ఏనుగ, గుఱ్ఱము, రథము ఒంటె మున్నగు యానములందు కూర్చుండియు భుజించఁగూడదు॥ 2 శ్మశానమధ్యమందుండియు, దేవాలయమునందుండియు శయనమునందుండియు భుజించఁగూడదు. చేతియందున్న దానిని పీఠాద్యాసనములందున్న దానిని భుజించగూడదు 3 తడిగుడ్డకట్టుకొనిగాని తడితలతోగాని యజ్ఞోపవీతము లేకగాని కాళ్ళు చాచుకొనిగాని పాదములందు చేతులుంచుకొనిగాని భుజించగూడదు-4 ఎడమ చేతియందుంచుకొనియు. మంచముపైనందుండియు తలకు గుడ్డ చుట్టుకొనియు తొడయందు పాత్రము పెట్టుకొనియు భుజించగూడదు. 5.

ఏకవస్త్రుఁడై యుండి ఇతరులకు కనఁబడునటుము గలవాఁడై యుండియు, చెప్పులుగాని పావుకోళ్ళుగాని ధరించియు, చర్మమునందు కూర్చుండియు చర్మముచేత ఇరుప్రక్కల కప్పబడియుండియు భుజించఁగూడదు. 6. గ్రాసశేషమును భుజించఁగూడదు. (అనఁగా ముద్దచేసి సగము తిని తక్కిన సగమును మరల తినుట, అనఁగా తినుటకు తగినంత ముద్దచేసుకొనవలయును గాని యెక్కువ ముద్ద చేసికొనఁగూడదని భావము) త్రాగఁగా మిగిలిన యుదకమును త్రాగఁగూడదు. కూరలు, దుంపలు, పండ్లు, చెరకు మొదలైనవి పండ్లతో కొరికి సగము తిని మిగిలినది తినగూడదు॥ 7. పలువురు భుజించుచుండఁగా వారిమధ్యయందు కూర్చుండి వారందఱికంటె త్వరగా భుజించఁగూడదు. అన్నమును నిష్కారణముగ పారవేయఁగూడదు.

శ్లో. ఆపోశనకరో విప్రః యః ఆశీర్వచసం వదేత్ ।
అభోజ్యం తద్భవేదన్నం దాతా భవతి కిల్బిషీ ॥ ౧.

,, ఆపోశనం గృహీత్వా తు స్వస్తి కుర్వంతి యే ద్విజాః ।

న దేవాస్తృప్తిమాయాన్తి నిరాశాః పితరోగతాః॥ ౨.
,, ఆపోశనం చాసనంచ తైలాభ్యంగం తథైవచ।
స్వయంకరకృతం ప్రోక్తమాయుశ్శ్రీపుత్రహానిదం॥ 3.
స్మృ. ము. సంగ్రహే.

తా. ఆపోశనమును చేతియందుంచుకొని తనకునమస్కరించువానికి ఆశీర్వచనము పలుకునెడల ఆయన్నము అభోజ్యమగును. దాత దోషియగును. ౧. ఆపోశనమును గ్రహించి నమస్కరించువారికి 'స్వస్తిః' పలుకునెడల ఆతనియందు దేవతలు సంతుష్టినందరు. పితరులు నిరాశులయిపోదురు. ౨. తనకుతాను ఆపోశనము వేసికొనుట, తనకుతాను పీటవేసికొనుట, స్వయముగ అభ్యంగమొనర్చుటకొనుట చాలనింద్యము. ఇటుల చేయునెడల ఆయువు, సంపత్తు, పుత్త్రులు వీనికిచేటుకలుగును. ౩.

శ్లో. నాదత్వామిష్టమశ్నీయా ద్బహూనాం చైవపశ్యతాం।
అశ్నీయు ర్బహవశ్చైవతథా నైకస్య పశ్యతః॥
పరా. మాధ. ఉశనాః

తా. పలువురుచూచుచుండగా వారికివ్వక మధుర పదార్థమును తానొక్కడు భుజించకూడదు. అదేవిధముగ ఒకడు చూచుచుండగా పలువురు మధురపదారమునుభుజించగూడదు.

శ్లో. నోచ్ఛిష్టం గ్రాహయేదాజ్యం యజ్ఞోచ్ఛిష్టంచ సంత్యజేత్।
శూద్రభుక్తావశిష్టంతు నాద్యాద్భాండస్థితం త్వపి॥
పరా. మాధ. ఆదిత్యపురాణే.

తా. ఉచ్ఛిష్టమగు ఆజ్యమును గ్రహించగూడదు. యజ్ఞోచ్ఛిష్టము అయిన ఆజ్యమును అనగా హోమార్థముపయోగించగా మిగిలిన ఆజ్యము) విడువవలయును. శూద్రుడు భుజించగా మిగిలినయాజ్యము పాత్రయందున్నను తినగూడదు.

శ్లో. నపిబేన్నచభుంజీత ద్విజస్సవ్యేనపాణినా।
నైకహస్తేనచ జలం శూద్రేణావర్జితంపిబేత్॥ ౧
పిబతో యత్పతేత్తోయం భాజనేముఖనిస్సృతం।
అభోజ్యంతద్భవేదన్నం భోక్తాభుంజీతకిల్బిషం॥ ౨
పీతావశేషితంతోయం బ్రాహ్మణోనపునఃపిబేత్।
పిబేద్యదిహి తన్మోహా ద్ద్విజశ్చాన్ద్రాయణం చరేత్॥ 3
పరా. మాధ. అత్రిః.

తా॥ బ్రాహ్మణుఁడు ఎడమచేతిలో భుజించ గూడదు. త్రాగగూడదు ఒకహస్తముతో జలము త్రాగగూడదు. శూద్రుడిచ్చిన జలమును పానము చేయకూడదు॥ ౧ త్రాగునప్పుడు నోటినుండి భుజించుపాత్రలో జలము పడినయెడల ఆయన్న మభోజ్యమగును. ఆయన్నమును భుజించినయెడల పాతకమును రితినినయ చేయగును॥ ౨. త్రాగగా మిగిలినజలమును బ్రాహ్మణుఁడు మరల త్రాగగూడదు. అజ్ఞానము చేత త్రాగినయెడల చాంద్రాయణవ్రత మాచరింపవలయును.

శ్లో. అప్యేకపంక్త్యానాశ్నీయా ద్బ్రాహ్మణైస్స్వజనైరపి।
క్రోహి జానాతికింకస్య ప్రచ్ఛన్నంపాతకంభవేత్॥ ౧

,, ఏకపంక్త్యుపవిష్టానాం దుష్కృతం యద్దురాత్మనాం।
సర్వేషాం తత్సమంతావ ద్యావ త్పంక్తి ర్న భిద్యతే॥ ౨

పరా. మాధ. బృహస్పతిః

,, ఉదకంచ తృణంభస్మ ద్వారంపంథాస్తథైవచ।
ఏభి రన్తరితంకృత్వాపంక్తి దోషోనవిద్యతే॥

పరా. మ. ధ. యమః

తా. బ్రాహ్మణుఁడు స్వబంధువులతోడనైనను ఏకపంక్తియందు కూర్చొనిభుజించగూడదు. ప్రచ్ఛన్నముగ నెవ్వఁడేపాతకము నొనర్చెనో ఎవ రెఱుంగుదురు? ఒకపంక్తియందుకూర్చొనియున్నదురాత్ముల యొక్క పాపము అంతయు పంక్తిభేదము లేనంతవఱకు నందఱకు సమానముగ నగును॥ ౧. ౨. అన్యోన్యము, ఉదకమో, తృణమో, భస్మమో, ద్వారమో లేక మార్గమో వ్యవధానమున్నయెడల పంక్తిదోషములేదు.

---

## యజుర్వేదీయ భోజనవిధి.

౧. ప్రయోగము:— ఆఁచమించి పంచార్ద్రుఁడై ఈక్రింది మంత్రములు పఠింపవలయును:—

మూ.మం. ఓంభూర్భువస్సువర్మహర్జనస్తపస్సత్యం తద్బ్రహ్మతదాపఆపోజ్యోతీరసో అమృతంబ్రహ్మభూర్భువస్సువరోం ఓంతద్బ్రహ్మ। ఓం తదాత్మా। ఓంతత్సత్యం। ఓంతత్సర్వం। ఓంతత్పురోంనమః॥ ౧

ఓమన్తశ్చరతిభూతేషుగుహాయాంవిశ్వమూర్తిషు। త్వంయజ్ఞస్త్వంవిష్ణుస్త్వంవషట్కారస్త్వంరుద్రస్త్వంబ్రహ్మాత్వంప్రజాపతిః॥ ౨

శ్రద్ధాయాగ్ం సమానే నివిష్టో ఽమృతం జుహోమి। శివో మావిశా ప్రదాహాయ। ఓం సమానాయ స్వాహా॥ ౫॥

౩. ప్రయోగము:— భోజనము ముగిసిన పిదప "అమృతాపిధానమసి" యను మంత్రముతో ఉత్తరాపోశన జలమును గ్రహించి సగము ఆచమించి, తక్కిన సగము జలమును ఈ క్రింది శ్లోకమును చదువుచు క్రిందవిడువవలయును:—

శ్లో॥ రౌరవే పుణ్యనిలయే పద్మార్బుదనివాసినామ్।
అర్థినాముదకం దత్తం అక్షయ్యముపతిష్ఠతు॥

తా. పద్మములు, అర్బుదములను సంఖ్యగల సంవత్సరముల కాలము నుండి పాపాత్ములై పాపఫలము ననుభవించుటకు రౌరవాది నరకములందు పడి ఉదకపానమును కోరునట్టి దీనులకుగాను ఈజలము ఇవ్వబడినది. ఇయ్యది వారలకు అక్షయ్యముగ నుండుగాక.

భోజనానన్తరజప్యమంత్రములు.

౧. ప్రయోగము:— ఈమంత్రముచేత భుజించినతరువాత అనుమంత్రణము చేయవలయును.

మూ.మం. శ్రద్ధాయాం ప్రాణే నివిశ్యామృతగ్ం హుతం। ప్రాణమన్నేనాప్యాయస్వ॥ ౧

శ్రద్ధాయా మపానే నివిశ్యామృతగ్ం హుతం। అపానమన్నేనాప్యాయస్వ॥ ౨

శ్రద్ధాయాం వ్యానే నివిశ్యామృతగ్ం హుతం। వ్యానమన్నేనాప్యాయస్వ॥ ౩

శ్రద్ధాయా ముదానే నివిశ్యామృతగ్ం హుతం। ఉదానమన్నేనాప్యాయస్వ॥ ౪

శ్రద్ధాయాగ్ం సమానే నివిశ్యామృతగ్ం హుతం। సమానమన్నేనాప్యాయస్వ॥ ౫

తై. ఆ. 10. 70.

తా. శ్రద్ధయనగా వేదవిహిత కర్మలయందు విశ్వాసము కల్గియుండుట. అట్టి శ్రద్ధ వాకిండుటచేత ఆదరముతో ప్రాణాపానాదులు నందు అమృతముతో సమానమగు నీహవిస్సును నేనుంచితిని. ప్రా

ణాభిమానియగు నోదేవా! నేను నీయందు హుతముచేసిన అన్నము చేత తృప్తినందుదుము. ౧. వేదవిహిత కర్మలందు శ్రద్ధ నానుండుటచేత ఆదరముతో అపానవాయువునందు అమృతోపమానమగు హవిస్సు నుంచితిని. అపానాభి మానియగు నోదేవా! నేను నీయందుహుత ముచేసిన అన్నముచేత తృప్తినందుదుము. ౨ఇట్లే. 3. ౪. ౫. మంత్రము లకు ఎఱుంగునది.

౨. ప్రయోగము:—

మూ.మం. అఙ్గుష్ఠమాత్రః పురుషో ఙ్గుష్ఠఞ్చ సమాశ్రితః।
ఈశ స్సర్వస్యజగతః ప్రభు ప్రీణాతి విశ్వభుక్॥

తై. అ. 10. 71.

తా. (హృదయ మధ్యగతమగు ఆకాశము అంగుష్ఠపరిమాణముగ లది. అందుండు బుద్ధియు అంత పరిమాణము గలదియే) తదవచ్ఛిన్నుఁడగు జీవరూపుఁడగు పురుషుఁడును అంగుష్ఠపరిమాణముగలవాఁడే. ఆపురుషుఁడు జ్ఞానక్రియాశక్తిచేత ఆపాదమస్తకము వ్యాపించి యున్నాఁడు. అతఁడీ సకలజగత్తునకు ప్రభువు. అతఁడే జగమునంత యు అనుభవించుచున్నాఁడు. అతఁడీ భోజనముచేత తృప్తినందుగాక.

3. ప్రయోగము:— ఈమంత్రమును ఆయాయవయవములు స్వస్థతనందుటకుగాను పఠింపవలయును.

మూ.మం. వాఙ్మ ఆసన్। నసోః ప్రాణః। అక్ష్యోశ్చక్షుః। కర్ణయోః శ్రోత్రమ్। బాహువోర్బలమ్। ఊరువోరోజః। అరిష్టావిశ్వాన్యఙ్గానిత నూః। తనువా మే సహ నమస్తే అస్తు మామాహింగ్ంసీః॥

తై. అ. 10. 72.

తా. షడ్రసములను తృప్తిగ భుజించిన నాఆస్యమునందు వాగింద్రియశక్తియు, నాసికలయందు ప్రాణశక్తియు, అక్షిగోళకములందు చక్షుశ్శక్తియు, కర్ణగోళకములందు శ్రోత్రశక్తియు, బాహువులందుబలము, ఊరువులందు గమనాగమనసామర్థ్యము పెక్కుమాట లెందుకు? సకలావయవములు స్వస్థములయినవి. సూక్ష్మస్థూల శరీరములును తృప్తినందినవి. ఇది నీయనుగ్రహముచేత కావున ఓభగవంతుఁడా! నీకునమ

స్కారము. ఇట్లే సకుటుంబముగ నాకు తృప్తిని చేయుచుండుము. నన్నెకప్పుడు పీడింపకుము.

అనుమంత్రణమయిన పిదప ఈక్రింది మంత్రముతో హృదయ మును తాఁకవలయును.

మూ.మం. ప్రాణానాం గ్రన్థిరసి రుద్రో మా విశాన్తకః। తేనాన్నే నా ప్యాయస్వ॥

తా. (హృదయాంతర్వర్తియగు అహంకారమా! నీవు) వాయురూపములును ఇంద్రియరూపములును అగు ప్రాణములకు ముడివంటిదానవు. అట్టినీవు రుద్రరూపముగలిగి నాదుఃఖములను పోఁగొట్టి నా దేహమునందు ప్రవేశించుము. నేను భుజించిన అన్నముచేత నన్ను వృద్ధి నందింపఁజేయుము.

---

## తాంబూలవిధి.

శ్లో. సుపూగంచ సుపర్ణంచ సుచూర్ణేన సుసంయుతమ్।
అదత్త్వాద్విజదైవేభ్యః తాంబూలం వర్జయేద్బుధః॥ ౧.
,, ఏకపూగం సుఖారోగ్యం ద్విపూగం నిష్ఫలం భవేత్।
అతిశ్రేష్ఠం త్రిపూగంచ హ్యాధికం నైవదూష్యతి॥ ౨.
,, పర్ణమూలే భవేద్వ్యాధిః పర్ణాగ్రే పాపసంభవః।
చూర్ణ పర్ణం హరత్యాయు స్సిరా బుద్ధివినాశినీ॥ 3.
,, తస్మా దగ్రంచ మూలంచ సిరాంచైవ విశేషతః।
చూర్ణపర్ణం వర్జయిత్వా తాంబూలం ఖాదయేద్బుధః॥ ౪.
పరా. మాధ. వసిష్ఠః.

తా. తమలపాకులు, వక్కలు, సున్నము కలసిన తాంబూల మనం బడును. ఈతాంబూలమును బ్రాహ్మణులకును, దేవతలకును ఇవ్వక తాను వేసికొనఁగూడదు. ౧॥ తాంబూలము వేసికొనుటకు ఒక వక్క అయిన యెడల సుఖము, ఆరోగ్యము, రెండు వక్కలయిన యెడల నిష్ఫలమనియు 3 వక్కలు అయిన యెడల అతిశ్రేష్ఠమనియు భావము. అధికమయినను దూష్యము కాదు. ౨॥ ఆకుయొక్క మూలమునందు వ్యాధియు, ఆకుయొక్క చివర పాపమును, సున్నముంచిన యాకు

ఆయుర్నాశమును, ఈనెలు, బుద్ధినాశనమును కలుగఁజేయును॥ ౩॥
కావున ఆకుయొక్క అగ్రభాగమును, మొదలును, ఈనెలను, నూన్నపు
ఆకును వదలి తాంబూలమును వేసికొనవలయును.

శ్లో. అనిధాయముఖే పర్ణం పూగం ఖాదతి యోనరః।
సప్తజన్మ దరిద్రస్స్యా న్నరకేషు నిమజ్జతి॥

తా. నోటియందు ప్రథమమున తమలపాకు వేసికొనక పోకచెక్క
ను వేసికొనునెడల ఏడు జన్మములవఱకు దరిద్రుఁడగును. నరకములం
దు మునిఁగి తేలుచుండును.

శ్లో. ప్రాతఃకాలే ఫలాధిక్యం చూర్ణం మధ్యందినేఽధికం।
సాయంపర్ణస్య చాధిక్యం త్రిధా తాంబూలలక్షణమ్॥

తా. ప్రాతఃకాలమునందుపోకచెక్కలనధికముగను,మధ్యాహ్నమునం
దు చూర్ణము, (సున్నము) అధికముగను, సాయంకాలమునందు ఆకు
లు అధికముగను ఇటుల త్రివిధముగ తాంబూలమును వేసికొనవలయును.

తాంబూలగుణాః.

శ్లో. తాంబూలంకటుతిక్త ముష్ణ మధురక్షారం కషాయాన్వితం,
వాతఘ్నం క్రిమినాశనంకఫహరం దేహాగ్నిసందీపనం॥
స్త్రీసంభాషణభూషణం రుచికరంశోకస్యవిచ్ఛేదనం,
తాంబూలస్యచయేత్రయోదశగుణాః స్వర్గేఽపితేదుర్లభాః॥

తా. సులభమని వ్రాయలేదు. బాహటః.

శ్లో. క్షీరంకపిత్థంపనసంతథాంబుం ఫలంకదల్యాశ్చ నిక్షుఖండం।
మద్యంచయూషంచరసంకషాయంఘృతస్యపానంమధునారికేళం॥
పీత్వావిజహ్యాద్ఘటికాంతథైకాంతాంబూలమత్రైవవిషంవదంతి॥

తా. పాలు, వెలగపండు, పనసపండు, నీరు, అరటిపండ్లు, చెఱకు
లు, మద్యపానము, కల్లు, కషాయము, ఘృతమును, తేనె, నారికేళఫలము మొదలగునవి భుజించి
కొనిన యనంతరమున తాంబూలము విషమగును. కావున నొకగడియ విలంబము
చేసి తాంబూలమును భుజింపవలయును.

శ్లో. తాంబూలం ప్రాండుమేషాం ప్రకటితసయునోన్మాదత్తృష్ణాతురాణాం
సంశుద్ధక్షీణపీతశ్రమమదపిపాసా త్యాస్త్రశోకాన్వితానాం।

మూర్ఛాతీసారకృచ్ఛ్రప్రదరవమి మహాదేహదాహార్దితానాం
తృడ్శోషాపస్మృతీనాంక్షయగద విషసర్ప్యర్దితానాంనపూజ్యమ్॥

తా. పాండు, మేహ, నేత్రరోగ, ఉన్మాద, శైత్య, రక్త, శోష, మూర్ఛ, అతిసార, మూత్రకృచ్ఛ్ర, ప్రదర, వమన, దేహదాహ, తృడ్శోష, అపస్మార, క్షయ, విషోపద్రవ, విసర్పి, రోగపీడితులగు వారికిని, పిపాసాతురులకును, క్షీరపానము చేసినవారికిని, శ్రమ మదావిషులగు వారికిని తాంబూల మర్హము గాదు.

శ్లో. ఖండీకృతంప్రపేత్పూగైఃకషాయం యత్సుగంధిభిః।
కర్పూరాద్యైఃప్రసూనైశ్చవాసితం తచ్చభక్షయేత్॥
,, నోచేద్దంతస్యశైథిల్యం భవేద్దంతవిఘట్టనాత్।
కర్ణరోగశిరోరోగా హనుస్సంసస్తుజాయతే॥ ౨

తా. పోకచెక్కలు కత్తిరించి అగ్రములు లేకుండ నలిపి కర్పూరము లవంగాదులచే వాసితమగు తాంబూలమును భక్షింపవలయును॥ ౧॥ ఇటులగాకున్నయెడల కఠినములగు పోకలను కొరుకుట చేత దంతముల కశైథిల్యమును, కర్ణరోగ శిరోరోగాదులును, దవడలకు కదలికయు కలుగును. ౨

శ్లో. ఏకపూగంపంచపర్ణం చూర్ణంనిష్పావమాత్రకం।
కర్పూరేణతదర్ధంస్యాత్ తక్కోలంత్రితిచతుష్టయం॥ ౧
,, లవంగకుసుమంతద్వత్పాదార్ధం జాతికాఫలం।
క్రమేణాభక్షయేద్విద్వాన్ తాంబూలంసర్వదోషజిత్॥ ౨
,, పూగాంతర్గతకీటస్తు గళగండగదాన్నయేత్।
పర్ణాంతర్గతకీటస్తు ముఖరోగాన్కరోతిచ॥ ౩
,, చూర్ణస్యసూక్ష్మంపాషాణం సేవితంచాశ్మరీభవేత్।
తస్మాత్పర్ణాదిశుద్ధించకుర్యాత్తాంబూలలక్షణమ్॥ ౪
,, తాంబూలసేవాంవిధినావిదధ్యాత్ భుక్తేఃపురస్తాదిహసప్తపత్రమ్।
భుక్త్వాథవాసప్తశయీతమర్త్యో ద్విసప్తసేవాంనితరాంనిశాసు॥౫

తా. 1 పోకయు, ౫ ఆకులు, అనపగింజంత సున్నము అందులో సగము కర్పూరము మూడు నాలుగుతక్కోలములు, అన్నియే లవంగములు సున్నములో 4 వపాలు జాజికాయయు కలిసిన తాంబూలము సకలరోగహరము కావున విద్వాంసులిట్లు సేవింపవలయును॥ 1. 2. పోకచెక్కలోని పురుగు గళగండరోగమును పుట్టించును. పర్ణమందుండు కీటము ముఖరోగాదికరము, సున్నమునందుండు ఱాయి అశ్మరీ(మూత్రకృచ్ఛ్ర)రోగమును పుట్టించును. కావున పర్ణాదిశుద్ధిని చేయవలయును 3. 4. భోజనమునకు పూర్వమం౭నపరమం౭నను 7 సిపత్రములను సేవింపవలయును. రాత్రియందు పదునాలుగు ఆకులు సేవింపవలయును.

శ్లో. తత్కాల్యం సేవితం రూక్ష మరుచిర్వహ్నినాశనం।
అవృష్యం పీనసశ్వాసపాండుకృచ్ఛ్రప్రమేహకృత్ ॥ ౧
॥ పాండుత్వం దంతదౌర్బల్యం బాధిర్యం చాక్షిరోగతా।
వాతపైత్యప్రకోపస్స్యాత్తాంబూలస్యాతిసేవనాత్ ॥ ౨
॥ [illegible] స్యాత్ న్మధ్యే దీపనపాచనం।
అమృతప్రతిమం చాన్తే త్రిధా తాంబూలలక్షణమ్ ॥ 3

తా. ఈ తాంబూలము ప్రాతఃకాలమందు సేవించినచో వేడిని, రుచిని, అగ్నిమాంద్యమును, వీర్యహానిని, పీనస, శ్వాస, పాండు, మూత్రకృచ్ఛ్ర ప్రమేహరోగములను చేయును విస్తరించి తాంబూలమును సేవించిన శరీరము తెల్లబడును. దంతపటిమతగ్గును, చెముడు నేత్రరోగము, వాతపైత్యప్రకోపము నగును. 1.2. ॥ తాంబూలము నమలిన మొదటిరసము విషసమము కావున ఉమియవలయును. మధ్యమరసము దీపనము. పాచనము. అం

శ్లో. లాలాస్మృతిం పాండురవర్ణమాస్యే
దంతాది దౌర్బల్య ముశ్రితిజంతుః।
విజృంభణం వక్త్రగళామయానాం।
నిశాసు తాంబూల ముఖస్యనిద్రా ॥

తా. తాంబూలము ముఖమందుండి నిద్రించిన చొంగ బడుటయును, ముఖమందు పాండువర్ణమును, దంతములకు దౌర్బల్యమును, ముఖకంఠరోగోత్పత్తియును, కలుగును కావున నట్లు చేయరాదు.

శ్లో. స్వాపం కృత్వా జలంపీత్వా రతిం కృత్వా ఫలాదికం।
భుక్త్వా క్షణం సమాశ్వాస్య తాంబూలం భక్షయేత్ సుధీః ॥

తా. ఇంచుక నిద్రించి లేచి, జలపానము చేసి, క్రీడించి, ఫలాదులను భక్షించి క్షణమాత్రము విశ్రమించి తాంబూలమును భక్షించవలయును.

---

ప్రాణాహుతి విషయప్రమాణవచనాని.

శ్లో. అనిషిద్ధం భక్షయేన్నిత్యం వాగ్యతోఽన్న మకుత్సయన్।
పంచగ్రాసాన్ మహామౌనం ప్రాణాద్యాప్యాయనం మహత్ ॥
పరా. మాధ. ఆశ్వ శుద్ధి కే.

తా. ఎల్లప్పుడు నిషిద్ధముగాని అన్నమును మౌనవ్రతులై అసహ్యము చేయకొనక మహామౌనముగ పంచగ్రాసములను ప్రాణాహుతులుగాను భక్షింపవలయును. ఇట్లు ప్రాణాదిపంచవాయువులకు ఆప్యాయనమును కలుగఁజేయును.

శ్లో. తర్జనీమధ్యమాంగుష్ఠలగ్నా ప్రాణాహుతిర్భవేత్।
మధ్యమానామికాంగుష్ఠై రపానే జుహుయాత్తతః॥
కనిష్ఠానామికాంగుష్ఠై ర్వ్యానేన జుహుయాత్తతః॥
మధ్యమా నామికాశూన్యై రుదానే జుహుయాత్తతః
సమానే సర్వహస్తేన సముదాయాహుతి ర్భవేత్॥
పరా. మాధ. శౌనకః.

తా. తర్జనీ, మధ్యమాంగుష్ఠాంగులులతో ప్రాణాహు తియు,మధ్య మానామికాంగుష్ఠాంగులులతో "అపానాయ స్వాహా"అను ఆహుతి యు, కనిష్ఠికానామి కాంగుష్ఠాంగులతో వ్యానాహుతియు, కనిష్ఠికా, తర్జనీ, అంగుష్ఠాంగులులతో ఉదానాహుతియు, అన్నియుంగులులతో సమానాహుతియు గ్రహించవలయును.

అపదార్థములు

శ్లో. అభక్ష్యస్య నివృత్త్యాతు విశుద్ధంహృదయం భవేత్!
ఆహారశుద్ధా చిత్తస్య విశుద్ధి ర్భవతి స్వతః॥ ౧॥
అభక్ష్య భక్షణాచ్చిత్త మశుద్ధం భవతిస్వతః॥
తస్మా దభక్ష్యంయత్నేన దూరతఃపరివర్జయేత్॥ ౨॥
స్మృ. ము. వ్యాసః.

తా. అభోజ్యములగు పదార్థములను విడుచుటవలన పరిశుద్ధమగు హృదయము కలుగును. ఆహారశుద్ధియున్న యెడల చిత్తమునకు స్వయముగ శుద్ధికలుగును. ౧. అభోజ్యములగు పదార్థములను తినుట వలన మనస్సు కల్మషము గలదియగును. కావున అభోజ్యములగు పదార్థములను విచారించి వానిని దూరముగ విడువవలయును.

శ్లో. లశునం గృంజనం చైవ పలాండుంకవకాదిచ।
అభక్ష్యాణిద్విజాతీనాం అమేధ్యప్రభవానిచ॥
లోహితాన్వృక్షనిర్యాసాన్ వ్రశ్చనప్రభవాం తథా।
శేలుం గవ్యంచపేయూషం ప్రయత్నేన వివర్జయేత్॥
స్మృత్యర్థ ర.

తా. ఎఱ్ఱ ఉల్లి, గచ్చకాయి, తెల్ల ఉల్లి, పుట్ట గొడుగు, అమేధ్యమునందు పుట్టిన శాకములన్నియు, వృక్షములను ఛేదించుటచేత పుట్టెటి నిర్యాసములో ఎఱ్ఱనిరంగు నిర్యాసమును (నిర్యాసము బంక) వివిగి ఈనిన ఆవుయొక్క పాలు, ఇవి బ్రాహ్మణులకు నింద్యములు.

శ్లో. అలాబుం గృంజనంచైవ పలాండుంపూర్వమూలకం।
గాంధారకకరంబాణి లవణాన్యౌషరాణిచ॥
ఆరక్తా నపి నిర్యాసాన్ ప్రత్యక్ష లవణానిచ।
వ్రశ్చనప్రభవంసర్వం హింగుద్రవ్యంవినైవతు॥
భూతృణం శిగ్రుజంచైవ బ్రాహ్మణో నైవ భక్షయేత్॥

స్మృ. ము. ధర్మసారసుధానిధౌ.

తా. సొరకాయ, వెల్లుల్లి, ఎఱ్ఱఉల్లి గడ్డ, ముల్లంగి, గంజాయి, కంపిల్లము చవటినేలలందు పుట్టినలవణము, చెట్టునందు గాటువేయుటచేత పుట్టునట్టి బంకయు (గాటుచేయుటచేత పుట్టినను ఇంగువకు ఈనిషేధములేదు) చిప్పగడ్డి, మునగ, వీనిని బ్రాహ్మణుడు భుజించఁగూడదు.

శ్లో. ఉష్ట్రీ ఖరీ మానుషీణాం మృతసూతకయో స్తథా!
చోరస్యాన్నం నవశ్రాద్ధం భుక్త్వాచాన్ద్రాయణంచరేత్॥

స్మృ. ము. శాతాతపః.

తా. బంటె, గాడిద, మానవస్త్రీల క్షీరములు త్రాగుట, మృతాశౌచ జాతాశౌచములు గలవారి యన్నముతినుట చోరుసియన్నము, నవశ్రాద్ధమునందు భుజించుట. ఇవిచేసినవాఁడు చాంద్రాయణము చేయవలయును.

శ్లో. క్షీరేతులవణందత్వా ఉచ్ఛిష్టేఽపిచయద్ఘృతం।
స్నానంరజకతీర్థేషు తామ్రే గవ్యం సురాసమం॥

స్మృ. ము. స్మృతిసారే.

తా. పాలయందు లవణమువేసి త్రాగుట, ఉచ్ఛిష్టమునందలి ఆజ్యమును గ్రహించుట చాకిరేవులయందు స్నానముచేయుట. తామ్రపాత్రయందు, గోక్షీరములు, పెరుగు మున్నగునవి భుజించుట ఇవి సురాపానముతో తుల్యములయినవి.

శ్లో. రాత్రౌ ధానాదధి సక్తూన్ శ్రేయస్కామో వివర్జయేత్।
భోజనం జలసంబంధం స్నానంచైవవిశేషతః॥

స్మృ. ము. శాతాతపః.

తా. శ్రేయమును కోరువాఁడు రాత్రులందు వేపుడుబియ్యము, పెరుగు, పేల పిండి వీనిని భుజించఁగూడదు. జలసంబంధమగు భోజనము, విశేషముగ స్నానము చేయుటయుఁగూడదు. (అస్పృశ్యస్పర్శ నాదికముపలనస్నానము చేయవలసివచ్చిన యెడల చేయవలయును.

భోజనానన్తరజప్యశ్లోకములు

శ్లో. స్వస్థః ప్రశాన్తచిత్తస్తు కృతాసనపరిగ్రహః।
అభీష్టదేవతానాంచ కుర్వీతస్మరణం నరః॥

తా. భోజనా నంతరమునందు స్వస్థుఁడును శాంతచిత్తుఁడును అయి సుఖాసనమునఁ గూర్చుండి అభీష్టదేవతలయొక్క స్మరణమును చేయవలయును.

శ్లో. అగ్నిరాప్యాయ యేద్ధాతుం పార్థివం పవనేరితః।
దత్తావకాశో నభసా జరయేదస్తు మేసుఖం॥ ౧.

శ్లో. అన్నంబలాయ మేభూమేరపా మగ్న్యనిలస్యచ।
భవత్వేత త్పరిణతం మమాస్త్వవ్యాహతం సుఖమ్॥ ౨.

శ్లో. ప్రాణాపానసమానానా ముదానవ్యానయో స్తథా।
అన్నంపుష్టికరంచాస్తు మమా స్త్వవ్యాహతంసుఖమ్॥ 3.

శ్లో. అగస్తి రగ్నిర్బడబానలశ్చ భుక్తంమయాన్నం జరయన్త్వశేషం। సుఖంమమై తత్పరిణామసంభవం యచ్ఛత్వరోగో మమ చాస్తుదేహః॥ ౪.

,, విష్ణుస్సమస్తేన్ద్రియదేహదేహీ ప్రధాన భూతో భగవాన్ యథైకః। సత్యేన తేనాన్నమశేషమేతత్ ఆరోగ్యదం మే పరిణామమేతు॥ ౫.

,, విష్ణు రత్తా తథైవాన్నం పరిణామశ్చవై తథా।
సత్యేన తేన మేభుక్తం జీర్యత్వన్నమిదం తథా॥ ౬.

విష్ణుపురాణే. 3. 10. 94-99.

తా. వాయుప్రేరితుఁడగు అగ్ని ఆకాశముచేత దత్తావకాశుఁడై అన్నమును జీర్ణింపఁజేయుగాక. అన్నరసముచేత పార్థివసంబంధమగు ధాతువును తృప్తిని పొందించుగాక. ౧. భూమి, జలము, అగ్ని, వాయువు, అను భూతముల సంబంధమగు అన్నము నాకు బలముకొఱకు అగుఁగాక. ఈఅన్నము జీర్ణించినాకు శాశ్వతమగు సుఖమును కలుగఁజేయుగాక. ప్రాణాపాన సమానవ్యానోదానవాయువులకు ఈయన్నము తృప్తికరమగుగాక. నాకును శాశ్వతమగు సుఖముకలుగుఁగాక. ౨. 3. అగస్తియు, అగ్నియు, బడబానలము, వీరునేను భుజించి

న యన్నమును నిశ్శేషముగ జీర్ణింపఁజేయుదురుగాక. ఈయన్నము జీర్ణించుటవలనఁ గలుగు సుఖమును నాకు కలుగఁజేయుదురుగాక నాశరీరము రోగహీనమై యుండుగాక॥ ౪॥ సమస్తఇంద్రియములకును దేహమునకు, దేహాంతర్వర్తియగు జీవునకు బ్రభువైనవాఁడు విష్ణువొక్కరుఁడే. అట్టి విష్ణువుయొక్క సత్యముచేత ఈయన్నమంతయునాకు ఆరోగ్యమిచ్చునట్టిదిగా పరిణమించుగాక॥ ౫॥ భుజించువాఁడును, భుజించునదియు, పరిణామమును ఇదియంతయు విష్ణుస్వరూప, మే. అట్టి విష్ణువుయొక్క సత్యముచేత నేనుభుజించిన యన్నము. జీర్ణించుగాక. ౬

## పంచాయతనస్థాపనప్రకారః.

శ్లో. శంభౌమధ్యగతేహరీనహరీ భూదేవ్యో; హుతాశంకరే
భాస్యేనాగసుతా; రవౌహరిగణేశాంబికా; స్థాపయేత్ ।
దేవ్యాంవిష్ణుహరేభవక్త్రరవయో; లంబోదరేఽజేశ్వరే
నార్యా; శ్శంకరదిఙ్ముఖాస్తుఫలదావ్యస్తాస్తు తేహానిదాః ॥

౧. శివప్రధానము:— ౧. మధ్యయందుశివుఁడు ౨. ఈశానమునవిష్ణువు, ౩. ఆగ్నేయమునసూర్యుఁడు, ౪. నైర్ౠతియందుగణపతి, ౫. వాయవ్యమునఅంబిక.

౨. విష్ణుప్రధానము:— ౧ మధ్యయందువిష్ణువు, ౨, ఈశానమునశివుఁడు, ౩. ఆగ్నేయమునగణపతి, ౪ నైర్ౠతియందు సూర్యుఁడు, ౫. వాయవ్యమునఅంబిక.

౩. సూర్యప్రధానము:— ౧. మధ్యయందుసూర్యుఁడు, ౨. ఈశానమునవిష్ణువు, ౩. ఆగ్నేయమునగణపతి, ౪. నైర్ౠతియందుశివుఁడు, ౫. వాయవ్యమునఅంబిక.

౪. అంబికాప్రధానము:— ౧. మధ్యయందుఅంబిక, ౨. ఈశానమునవిష్ణువు, ౩. ఆగ్నేయమునశివుఁడు, ౪. నైర్ౠతియందుగణపతి, ౫. వాయవ్యమునసూర్యుఁడు.

౫. గణపతిప్రధానము:-- ౧. మధ్యయందుగణపతి, ౨. ఈశానమున విష్ణువు, ౩. ఆగ్నేయమునందు శివుఁడును, ౪. నైరృతియందు సూర్యుఁడు, ౫. వాయవ్యమునందు అంబిక.

## యజ్ఞోపవీత ధారణవిధిః.

ఆచమ్య, ప్రాణానాయమ్య। శ్రీపరమేశ్వరముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం యజ్ఞోపవీతాభిమంత్రణం ధారణంచ కరిష్యే:--- (అని సంకల్పించవలయును.)

౧. ఈక్రింది మంత్రముతో యజ్ఞోపవీతమును వడుకవలయును.

బ్రహ్మజజ్ఞానం, గౌతమో వామదేవో బ్రహ్మ త్రిష్టుప్, సూత్ర కరణే వినియోగః:---

మూ. మం. బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తా ద్విసీమతస్సురుచో వేన ఆవః। సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠాస్సతశ్చ యోని మసతశ్చవివః॥

౨. ఈక్రింది మంత్రమును పఠింపుచు ముప్పేటగా చేనవలయును.

"ఇదం విష్ణుః, కణ్వో మేధాతిథిః విష్ణుర్గాయత్రీ, సూత్రత్రిగుణీ కరణే వినియోగః.

మూ. మం. ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధానిదధేపదం।సమూఢమస్య పాగ్ం సురే॥

౩. ఈక్రింది మంత్రము పఠింపుచు యజ్ఞోపవీతమును ముడివేయ వలయును:---

త్ర్యంబకం మైత్రావరుణి ర్వసిష్ఠోరుద్రోఽనుష్టుప్:---

౪. మూ. త్ర్యంబకం యజామహే సుగంధింపుష్టివర్ధనం। ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

౪. ఈక్రిందిమంత్రములతో యజ్ఞోపవీతమునభిమంత్రించవలయును:-

మూ. ఆపోహిష్ఠామయో భువస్తాన ఊర్జేదధాతన।మహేరణాయచక్షసే॥ యోవశ్శివతమో రసస్తస్య భాజయతేహనః।ఉశతీరివమాతరః॥ తస్మా అరంగమామవో యస్యక్షయాయజిన్వథ।ఆపోజనయథాచనః॥

మూ. మం. హిరణ్యవర్ణా శ్శుచయః పావకా........బలమోజో నిధత్త.
మూ. మం. పవమాన స్సువర్జనః...జాతవేదా మోర్జయంత్యా పునాతు॥
(ఈ రెండు మంత్రములు ఈ గ్రంథము ౬౦, ౬౧, ౬౨, పుటలలో సమగ్రముగ గలవు)

ఓం భూరగ్నించ పృథివీంచమాంచ। త్రీగ్ శ్చలోకాన్ త్సంవత్సరంచ। ప్రజాపతిస్త్వాసాదయతు।తయా దేవతయాంగిరస్వద్ధ్రువాసీద ॥ ౧.

ఓంభువో వాయుంచాంతరిక్షంచమాంచ। త్రీగ్ శ్చలోకాన్ త్సంవత్సరంచ। ప్రజాపతి స్త్వా సాదయతు। తయా దేవతయాంగిరస్వద్ధ్రువాసీద ॥ ౨.

ఓంస్వరాదిత్యంచ దివంచమాంచ। త్రీగ్ శ్చలోకాన్ త్సంవత్సరంచ। ప్రజాపతిస్త్వాసాదయతు। తయా దేవతయాంగిరస్వద్ధ్రువాసీద ॥ 3.

ఓంభూర్భువస్స్వశ్చంద్రమసంచమాంచ। త్రీగ్ శ్చలోకాన్ త్సంవత్సరంచ। ప్రజాపతిస్త్వాసాదయతు। తయా దేవతయాంగిరస్వద్ధ్రువాసీద॥ ౪.

తై. బ్రా. 3. 10. 2.

తా. ఈమంత్రములతో చయనమునందు స్వయమాతృణ్ణలు'' అనుఇష్టకలను చతుర్దిక్కు లందు ఉపధానము చేయవలసినదిగా వినియోగముకలదు. అర్థమున్నూ అందులకు అనుకూలముగ విద్యారణ్యభాష్యమున వ్రాయఁబడియున్నది. ప్రకృతానుపయోగమనితలంచి ఇచట వ్రాయలేదు.

ఓంకారం ప్రథమతంతౌన్యసామి। అగ్నింద్వితీయతంతౌన్యసామి।
నాగాన్ తృతీయతంతౌన్యసామి। సోమంచతుర్థతంతౌన్యసామి।
పితౄన్ పంచమతంతౌన్యసామి। ప్రజాపతింషష్ఠతంతౌన్యసామి।
వాయుంసప్తమతంతౌన్యసామి। సూర్యమష్టమతంతౌన్యసామి।
విశ్వాన్ దేవాన్ నవమతంతౌన్యసామి।
ఋగ్వేదం ప్రథమదోరకేన్యసామి। యజుర్వేదంద్వితీయదోరకేన్యసామి। సామవేదంతృతీయదోరకేన్యసామి। అథర్వవేదంగ్రంథౌన్యసామి ॥

ప్రతియజ్ఞోపవీతం దశగాయత్రీమంత్రంజప్త్వా
ఒక్కొకయజ్ఞోపవీతమునకు ౧౦ సి పర్యాయములు గాయత్రిని జపించవలయును.

ఈక్రింది మంత్రములతో సూర్యునకు గనంబజుచవలయును:—

మూ. మం. ఉద్యన్నద్యమిత్రమహః ఆరోహన్నుత్తరాందివం।
హృద్రోగంమమసూర్యహరిమాణంచ నాశయ॥ ౧
శుకేషు మేహరిమాణం రోపణాకాసుదధ్మసి॥
అథోహారిద్రవేషుమే హరిమాణం నిదధ్మసి॥ ౨॥
ఉదగా దయమాదిత్యో విశ్వేన సహసా సహ।
ద్విషన్తం మహ్యంరంధయన్మో అహం ద్విషతే రథమ్॥ ౩॥

౫. గాయత్రిచేత యజ్ఞోపవీతమును ముమ్మారు విదిలించవలయును।

౬. ఈక్రింది మంత్రముతో యజ్ఞోపవీతమును ధరించవలయును:—
యజ్ఞోపవీతమితి మంత్రస్య। పరబ్రహ్మపరమాత్మా త్రిష్టుప్।
శ్రౌతస్మార్తకర్మానుష్ఠానసిద్ధ్యర్థంయజ్ఞోపవీతధారణేవినియోగః॥
ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥
తరువాత ఆచమనము చేయవలయును.

౭. వ రే. వ యజ్ఞోపవీతములను ఏ మంత్రముతోడనే తరువాత ధరించవలయును.

౮. సముద్రంగచ్ఛస్వాహా। అను మంత్రముతో జీర్ణయజ్ఞోపవీతమును జలమునందు విడువవలయును.

ఇట్లు ఋగ్వేదీయ బ్రహ్మకర్మ సముచ్చయమునన్నది.

ప్రకృతమున యజ్ఞోపవీత ధారణవిధి ఈ దేశమునందు ఈవిధముగ జరుగుట లేదు. పైవిధముగ సంకల్పించి, బ్రహ్మచారియొక్క యొక యజ్ఞోపవీతము, గృహస్థాశ్రమి, రెండు యజ్ఞోపవీతములుధరించవలయును. గృహస్థాశ్రమి ఉత్తరీయార్థము. ౩వ యజ్ఞోపవీతమును ధరించవలయును. "యజ్ఞోపవీతం...బలమస్తుతేజః॥ అను మంత్రమునే పఠించుచు యజ్ఞోపవీతములను ధరించవలయును.

## శయన విధి.

౧. ప్రయోగము:--- రాత్రియందు శయన గృహము నందు పడక దగ్గఱకు పోయి ఈ క్రింది మంత్రమును పఠింప వలయును:---

మూ. మం. సుత్రామాణం పృథివీంద్యామనేహసం సుశర్మాణమదితిం సుప్రణీతిం। దైవీం నావం స్వరిత్రామనాగస మస్రవన్తీ మారుహేమా స్వస్తయే॥

౨. ప్రయోగము:--- తరువాత రాత్రిసూక్తమును జపించవలయును.

# రాత్రిసూక్తమ్.

రాత్రీత్యష్టర్చం పంచదశం సూక్తం, సోభరి పుత్రస్యకుశికస్యార్షం

మూ. రాత్రీ వ్యఖ్యదాయతీ పురుత్రా దేవ్యక్షభిః।
విశ్వా అధి శ్రియోఽధిత॥

తా. వచ్చుచున్నట్టియు నేత్రస్థానీయములగు నక్షత్రములచేత అనేక ప్రదేశములందు ప్రకాశించునదియునగు రాత్రి విశేషించి చూచుచున్నది. మఱియు నీరాత్రి కాంతులనన్నింటిని ధరించుచున్నది. ౧.

మూ. ఓర్వప్రా అమర్త్యా నివతో దేవ్యుద్వతః।
జ్యోతిషా బాధతే తమః॥ ౨.

తా. అంతము లేనట్టియు, ప్రకాశించు స్వభావము గలదియునగు రాత్రి విస్తీర్ణమగు అంతరిక్షమును ప్రథమమున చీకటి చేత నిండించుచున్నది. అట్లే అణగియున్న తీగెలు పొదరిండ్లమున్నగు వానిని లేచిన వృక్షములు మున్నగువానిని స్వతేజముచేత ఆవరించుచున్నది. పిదప చీకటిని తనకాంతి చేత పీడించుచున్నది.

మూ. నిరుస్వసార మస్కృతోషసం దేవ్యాయతీ।
అపేదుహాసతే తమః॥ 3.

తా. వచ్చుచున్నట్టియు ప్రకాశించునదియు అగు రాత్రి (తనకు చెల్లెలగు) ఉషస్సును నిర్మింపచేయుచున్నది.

మూ. సానో అద్యయస్యావయం నితేయామన్నవిక్ష్మహి।
వృక్షేన వసతిం వయః॥ ౪.

తా. ఏరాత్రియొక్క అంశమగు జామునందు మేము విహంగము ములు వృక్షమునందువలె సుఖముగ నుంటిమో అట్టి రాత్రిమాయందు అనుగ్రహించుగాక.

మూ. నిగ్రామాసో అవిక్షత నిపద్వన్తో నిపక్షిణః।
నిశ్యేనాస శ్చి దర్థినః॥ ౫.

తా. రాత్రియందు గ్రామమునందుండు జనులందఱు సుఖముగను న్నవి. గోవులు మున్నగునవియు సుఖముగ నుంటున్నవి. శీఘ్రగమనముగల డేగలు మున్నగునవియు సుఖముగ నుంటున్నవి.

మూ. యావయా వృక్యం౽ వృకం యవయస్తేనమూర్మ్యే।
అథానస్సుతరాభవ॥ ౬

తా. ఓరాత్రీ! మమ్ములనుహింసించుటకువచ్చెడితోడేళ్ళనుపారదోలుము. దొంగలను పారదోలుము. తరువాత మాకుసుఖకరివికమ్ము.

మూ. ఉపమా పేపిశత్తమః కృష్ణం వ్యక్తమస్థిత।
ఉష ఋణేవ యాతయ॥ ౭.

తా. ఓయుషోదేవతా! అన్ని వస్తువులను వ్యాపించినట్టియు, నల్లని వర్ణముగలదియు, తనకాంతిని అంతట వ్యాపింపజేయునదియు అగు అంధకారము నన్ను పొందెను. ఓయుషో దేవతా! నీవు ఆయంధ కారమును నిన్ను స్తుతించు వారి ఋణములను ఎట్లు పోగొట్టుదవో అట్లు పోగొట్టుము.

మూ. ఉపతే గాఇవాకరం వృణీష్వదుహితర్దివః।
రాత్రిస్తోమం నజిగ్యుషే॥ ౮.
ఋ. సం. అ. 8, 7, 14.

తా. ఓరాత్రీ! పాలకు గోవులను స్తుతించునట్లు నిన్ను కొనియా డుచున్నాను. ఓసూర్య పుత్రికగునోరాత్రీ! నీయనుగ్రహము వలన శత్రువులను జయింపనిచ్ఛగల మేము చేయు స్తోత్రమునువలె మేమి చ్చు హవిస్సును గూడ స్వీకరించుము.

రాత్రిసూక్తము సమాప్తము.

మూ. శ్లో॥ సర్పాపసర్పభద్రంతే దూరంగచ్ఛమహాయశాః।
జన్మేజయస్యయజ్ఞాంతే ఆస్తీకవచనం స్మర॥ ౧
,, ఆస్తీకవచనం స్మృత్వా యస్సర్పోననివర్తతే।
శతధా భిద్యతే మూర్ధ్ని శింశావృక్షఫలంయథా॥ ౨
,, యోజరత్కారుణాజాతో జరత్కార్వాం మహాయశాః।
అసితం చార్థసిద్ధంచ సునీతిం చాపియస్స్మరేత్॥ ౩
,, దివావా యదివారాత్రౌ నాస్తిసర్పభయం క్వచిత్।
జరత్కారో జరత్కార్వాం సముత్పన్నోమహాయశాః॥ ౪
ఆస్తీకస్సత్య సంధోమాం పన్నగేభ్యోఽభిరక్షతు।
అగస్తిర్మాధవశ్చైవ ముచికుందోమహామునిః।
కపిలో ముని రాస్తీకః పంచైతేసుఖశాయినః॥ ౫

కొందఱు శయనసమయమునందు స్వప్నసూక్తమును కూడప ఠించుచున్నారు. కావునఆసూక్తమునుకూడ ఇచటవ్రాయుచున్నాము.

స్వప్నసూక్తమ్.

మూ. మం. అమీవహావాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్।
సఖాసు శేవ ఏధినః॥ ౧

తా. గృహమునుపాలించునట్టి ఓవాస్తోష్పతీ. రోగములను నాశనముచేయునీవు నీయిష్టానుసారము పలువిధములగురూపములను పొందుచు మాకుమిత్రుండవును సుఖకరుండవునుకమ్ము.

మూ. మం యదర్జునసారమేయదతః పిశంగయచ్ఛసే।
వీవభ్రాజన్తఋష్టయఉపస్రక్వేషు బప్సతోనిషుస్వప. ౨

తా. శ్వేతవర్ణముకలిగినట్టియు, కొన్నియవయవములందుపింగలవర్ణముగలట్టియు, సరమయను దేవశునిపుత్రుండవు నగు ఓసారమేయమా! నీవుమమ్ములను కరచుటకు నోరు తెరవగా నీకోరలుప్రకాశించుఆయుధములవలె భక్షించుచున్న నీ యొక్క దంతములు ప్రకాశించుచున్నవి. అట్టినీవు ఇప్పుడు లెస్సగా నిద్రనుపొందుము.

మూ. మం. స్తేనంరాయ సారమేయ తస్కరం వాపునస్సర।
స్తోత్రానిన్ద్రస్యరాయసికిమస్మాన్దుచ్ఛునాయసేనిషుస్వప॥ ౩

తా. పోయినప్రదేశమున కేమఱలపోవునట్టి ఓసారమేయమా! నీవు రహస్యముగ ధనముహరించునట్టియు ప్రకాశముగ ధనమును హరించునట్టియు దొంగలను నివారింపుము. ఇంద్రుని స్తుతించుమమ్ములనేల కరుచవచ్చెదవు? మమ్ములనేలబాధించెదవు? గాఢముగ నిద్రించుము.

మూ. మం. త్వంసూకరస్య దర్దృహితవదర్దర్తు సూకరః ॥
స్తోతౄనిన్ద్రస్య రాయసికిమస్మాన్దుచ్ఛునాయసెనిషుస్వప. ౪

తా. ఓసారమేయమా! నీవు వరాహమును పగులఁజీల్చుము. నిన్ను మఱల వరాహముపగులఁజీల్చుగాక. ఇంద్రునిస్తుతించుమమ్ము నేలకరువవచ్చిబాధించెదవు? గాఢముగ నిద్రించుము.

మూ. మం. సస్తుమాతాస స్తుపితా సస్తుశ్వా సస్తువిశ్పతిః ।
సస్తు సర్వేజ్ఞాతయ స్సస్త్వయమభితోజనః ॥ ౫

తా. ఓసారమేయమా! నీతల్లియు, తండ్రియు, నీవును, నీఅల్లుఁడును, నీబంధువులందఱును నిద్రింతురుగాక. చుట్టునున్న ఈజనులందఱును నిద్రింతురుగాక.

మూ. మం. యఆస్తె యశ్చచరతి యశ్చపశ్యతి నోజనః ।
తేషాం సంహన్మోఅక్షాణి యథేదం హర్మ్యంతథా ॥ ౬

తా. ఈప్రదేశమునందెవఁడున్నాఁడో, ఎవఁడుపోవుచున్నాఁడో, ఎవఁడుమమ్ములను చూచుచున్నాఁడో ఇట్టివారి కన్నులను మేము నిమీలనము చేయించుచున్నాము. ఈకనంబడు మేడకదలక ఎట్లున్నదో అట్లే ఈజనులందఱు నిశ్చలులయి యుందురుగాక.

మూ. మం. సహస్రశృఙ్గోవృషభోయస్సముద్రా దుదాచరత్ ।
తేనాసహస్యే నావయంనిజనాన్స్వాపయామసి ॥ ౭

తా: వెయ్యికిరణములు గలట్టియు, భక్తులకుకోరికలను కురిపించునట్టియు సూర్యుఁడుసముద్రమునుండిఉదయించుచున్నాఁడు. శత్రువులను పరాభవింపఁ జేసెడి ఆసూర్యునిచేత స్తోతలమగుమేము అందఱిజనుల ను మిక్కిలి నిద్రింపఁ జేసెదము.

ఋ. మం. ప్రోష్ఠేశయా వహ్యేశయానారీర్యాస్తల్పశీవరీః।
స్త్రియోయాఃపుణ్యగన్ధాస్తాస్సర్వాః స్వాపయామసి॥ ౮
ఋ. సం. అష్ట. 6-4-22.

తా. ముంగిళ్లయందు నిద్రించువారును, వాహనములందు నిద్రించువారును తల్పములందుపరుండువారును, మాంగల్యమగు పరిమళముగలవారును **అగు** స్త్రీలనందఱిని నిద్రింపఁజేయుచున్నారము.

స్వప్నసూక్తము సమాప్తము

శయనేవిశేషవిధయః.

శ్లో॥ స్వగృహే ప్రాక్శిరాశ్శేతే శ్వశుర్యే దక్షిణాశిరాః।
ప్రత్యక్ఛిరాఃప్రవాసేతు నకదాచిదుదక్ఛిరాః॥
పరా. మాధ గార్గ్యః.

తా. స్వగృహమున ప్రాఙ్ముఖముగను, శ్వశురగృహమున దక్షిణాముఖముగను, ప్రవాసమున పశ్చిమముఖముగను నిద్రించవలయును. ఉత్తరముఖముగా నెప్పుడును నిద్రించగూడదు.

శయనమునందు వర్జించదగినవి.

శ్లో॥ నావిశాలాం నవైభగ్నాం నాసమాంమలినాంనచ।
నచజంతుమయీంశయ్యా మధితిష్ఠేదనాస్తృతాం॥ ౧
పరా. మాధ. విష్ణుపురాణే.

,, నచతైలాభ్యక్తశిరాః స్వపేత్ నాదీక్షితఃకృష్ణచర్మణి॥ ౨
పరా. మాధ. శాతా.

నార్ద్రవాసాస్స్వపే న్నపలాశశయనే న పంచదారుకృతే నభగ్నశయనే నవిద్యుద్దగ్ధే నాగ్నినాప్లుష్టే న బాలమధ్యేన చారిమధ్యే నథాన్యేన గోహం తాళన గురూణాముపరి నోచ్ఛిష్టో నదివా॥
పరా. మాధ. విష్ణుః.

తా. వైశాల్యము లేనట్టియు,విరిగినట్టియు, సమానముకానట్టియు, మలినము అయినట్టియు, నల్లులుకలిగినట్టియు, ఆస్తరణము లేనట్టియు శయ్యయందుపరుండఁగూడదు. ౧ తలంటుకొని తలకుపోసుకొనక నిద్రించగూడదు. దీక్షితుఁడుకానివాఁడు కృష్ణాజినముపై నిద్రించఁ

గూడదు. ౨. తడిబట్ట కట్టుకొనిగాని, మోదుగకఱ్ఱతో చేసినమంచ మునందుగాని మఱ్ఱి, నేరేడు, జువ్వి, రావి, మేడి, అనుఅయిదు, వృక్షముల సంబంధమగు కఱ్ఱలతో చేసిన మంచమందుగాని, విరిగినమంచమునందుగాని, పిడుగుపడికాలిన మంచమందుగాని, కాలినమంచమందుకాని, బాలుడు, జలము, శత్రువులు వీరిమధ్యయందుగాని, ధాన్యమందుగాని, గోవులు, అగ్ని, గురువులు వీరికి ఉపరిభాగము నందుగాని, ఉచ్ఛిష్టుండై యుండిగాని, పగటియందుగాని నిద్రించఁగూడదు.

## తైలాభ్యంగస్నానవిధి.

శ్లో. సంతాప, శ్శాంతి, రల్పాయు, ర్ధనం, నిర్ధనతా, తథా।
అనారోగ్యం సర్వకామా అభ్యంగా ద్భాస్కరాదిషు॥
పరా. మాధ. జ్యోతిశ్శాస్త్రే

తా. ఆదివారము మొదలుకొని క్రమముగ ౭ వారములకు, సంతాపము, శాంతియు, అల్పాయువు, ధనము, నిర్ధనిత్వము, అనారోగ్యము, సకలాభీష్టసిద్ధియు అభ్యంగస్నాన మొనర్చిన కలుగును.

౧. విదియ, పంచమి, ఈ తిథులందు తక్కతక్కిన అన్నితిథులందును అభ్యంగస్నానము నిషేధింపఁబడి యున్నది. అయినను ఆనిషేధము కేవలము నువ్వులనూనెకు చెల్లునుగాని ఇతరమునకుగాదు. నేతితోగాని సుగంధితైలములతోగాని సర్వదా అభ్యంగమును చేసికొనవచ్చును.

శ్లో. సార్షపం గంధతైలంచ యత్తైలం పుష్పవాసితమ్।
అన్యద్రవ్యయుతం తైలం నదుష్యతి కదాచన॥
పరా. మాధ. ప్రచేతాః

శ్లో. ఘృతంచ సార్షపం తైలం యత్తైలం పుష్పవాసితం।
నదోషః పక్వతైలేషు స్నానాభ్యంగేషు నిత్యశః॥
పరా. మాధ. యమః

తా. ఆవనూనె, పరిమళతైలము, పుష్పములు వేసికాచిన తైలము నెయ్యి, యితరద్రవ్యములతో కలసిన తైలము, అభ్యంగస్నానమునకు ఎప్పుడు పనికివచ్చును. స్నానాభ్యంగములందు వీనిని నిషిద్ధ తిథులందును, నిషిద్ధవారములందును ఉపయోగించవచ్చును.

అభ్యంగస్నాన గుణాః.

శ్లో. అభ్యంగోమార్దవకరః కఫవాతనిరోధనః।
ధాతూనాం పుష్టిజననో మృజావర్ణబలప్రదః॥ ౧॥
,, సేకశ్శ్రమఘ్నోఽనిలహృద్భగ్నసంధిప్రసాధకః।
క్షతాగ్ని దగ్ధాభిహత విఘృష్టానాం రుజాపహః॥ ౨॥
,, జలసిక్తస్య వర్ధంతే యథామూలేంకురా స్తరోః।
తథాధాతువివృద్ధిర్హి స్నేహసిక్తస్యజాయతే॥ ౩॥
,, శిరాముఖై రోమకూపైః ధమనీభిశ్చతర్పయేత్।
శరీరబలమాధత్తే యుక్తస్స్నేహావగాహనే॥ ౪॥
,, తత్రప్రకృతిసాత్మ్యర్తు దేశదోషవికారవిత్।
తైలం ఘృతంవామతిమాన్యుంజాదభ్యంగసేకయోః॥ ౫॥

తా. అభ్యంగస్నానము శరీరమార్దవమును చేయును. కఫవాత ములను పోగొట్టును. ధాతువృద్ధిని చేయును. నలుగుపెట్టుటచేశ రీరకాంతియు బలముకలుగును. శ్రమను, చెమటను వాయువును శ మింపజేయును. భగ్నములగు సంధులనుబాగుజేయును, నరుకుచేతను కాల్పుచేతను క్షతుడగువానికిని, శరీరము చితికినవానికిని, వీరికపీ డను పోగొట్టును. జలముచేతడిసినవృక్షమునందు అంకురములు మొ లుచునట్లు శరీరమునందు ధాతువులు చమురురాయుటచే వృద్ధిపొందును. నాడులు రోమకూపములు, పెద్దనాడులు వీటివెంబడిని శరీరమునరా యు చమురు లోపలికి ప్రవేశించి స్నానమగుచుండగా బలమునుపు ట్టించును. అందు శరీర ప్రకృతియు, పరిణామము, ఋతుభేదము దేశ ము వీనివలనగలుగు దోషము వికారమును తెలిసిన బుద్ధిమంతుడు అభ్యంగాదికమందు తైలమైనను ఘృతమైనను ఉపయోగమునుచూ చి శరీరము కుపయోగించు కొనవలయును.

శ్లో॥ కేవలం సామదోషేషు నకథంచనయోజయేత్।
తరుణజ్వర్యజీర్ణేచ నాభ్యక్తవ్యఃకథంచన॥ ౧
,, తథావిరిక్తోవాంతశ్చ నిరూఢోయశ్చమానవః।
పూర్వయోఃకృచ్ఛ్రతావ్యాధే రసాధ్యత్వమథాపివా॥ ౨
,, శేషాణాంతదహాః ప్రోక్తాః అగ్నిమాంద్యాదయోగదాః।
సుశ్రుతే

తా. కేవలము ఆమదోషమునందును, తరుణజ్వరమందును, అజీర్ణమందును, విరేచనములగువాఁడును, వమనములగువాఁడును, నిరూఢుఁడును, ముందు రోగముయొక్క కష్టతయు నసాధ్యము కలిగిన స్నేహలేపము తగదు. మిగిలిన యగ్నిమాంద్యాది రోగములుదీని వలనశమించును.

శ్లో॥ ఉద్వర్తనంవాతహరం కఫమేదోవిలాపనం।
స్థిరీకరణమంగానాం త్వక్ప్రసాదకరంపరం॥ ౧
,, సిరాముఖవివిక్తత్వం త్వక్థస్యాగ్నేశ్చతేజనం।
ఉద్ఘర్షణోత్సాదనాభ్యాం జాయేయాతా మసంశయం॥

తా. శరీరమందు నలుగు పెట్టిన కఫము, వాతము, మేదస్సుక్షీణించును. అవయవములు దృఢమగును. చర్మము నున్నఁబడును నాడీ ముఖములు స్పష్టమగును. చర్మమందలి పిల్లనరములు జఠరాగ్నియు తేజము నొందును. స్నేహమర్దనము చేతను నలుగుచేతను పూర్వోక్త గుణములు కలుగును.

## క్షౌరవిధి.

శ్లో॥ మాతుశ్చతుర్థీభగినీచతుర్దశీ భ్రాతుశ్చషష్టీపితురేవపర్వసు।
ఆదానవమ్యాంధనధాన్యహానిఃక్షౌరాష్టమీస్యాద్ధికుటుంబ హానిదః॥

శ్లో॥ రవ్యాదిసౌరవారేషు రాత్రౌపాత్రేవత్రైహాని।
శ్రాద్ధాహంప్రతిపద్రిక్తాభద్రాః క్షౌరేషువర్జయేత్॥
,, నిషిద్ధతిథివారాదాభోజనానంతరంచయః।
క్షౌరంకరోతితదేహేనాశ్నంతి పితరస్సురాః॥

తా. భాను, మంగళ, శనివారములందును, రాత్రియందును, వ్యతీపాతమునందును, వ్రతతిథులందును, శ్రాద్ధదినమునందును, ప్రతిపత్తునందును, రిక్తభద్ర తిథులందును, భోజనానంతరమునందును. క్షౌరమును వర్జించవలయును.

అమావాస్యా సంక్రమణాదిషుకర్తవ్యతిలతర్పణమ్.

ఆచమ్య, ప్రాణానాయమ్య, ఏవంగుణవిశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ శ్రీపరమేశ్వరముద్దిశ్య శ్రీపరమేశ్వరప్రీత్యర్థం మకరగతే సవితరిపిత్రూనుద్దిశ్య తిలతర్పణం కరిష్యే:—

ప్రమాణవచనాని, క్రమః.

శ్లో॥ ఆదౌపితాతథామాతా సాపత్నీజననీతథా ।
మాతామహాస్సపత్నీకా ఆత్మపత్న్యస్త్వనంతరం ॥ ౧
,, సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులాస్సహభార్యకాః
దుహితాభగినీచైవ దౌహిత్రోభాగినేయకః ॥ ౨
,, పితృష్వసా మాతృష్వసా జామాతాభావుకస్స్నుషా ।
శ్వశురస్స్యాలకశ్చైవ స్వామినో గురురిక్థినః ॥ 3

తా. మొదట, తండ్రి, తాత, ముత్తాత; మాతృ, పితామహి, తితామహీలు; సవతితల్లి; మాతామహాదిత్రయము, తనభార్య; మారుడు: సోదరుడు; పినతండ్రి పెత్తండ్రులు; మేనమామ; అతని భార్య; కూతురు; తోబుట్టువు; దౌహిత్రుడు; మేనల్లుడు; మేనత్త; పినతల్లి; పెదతల్లులు; అల్లుడు, బావమరుదులు; కోడలు; మామ; స్యాలకుడు; స్వామి; గురువు;రిక్థుడు; వీరలకుతర్పణమొనర్పవలయును. ప్రాచీనావీతీ:—

పితాదితర్పణమ్:—

౧ పితరం......గోత్రం...శర్మాణంస్వధా నమస్తర్పయామి(ఏవంత్రిః)
౨ పితామహం...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3.
3. ప్రపితామహం...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3.

మాత్రాదితర్పణమ్.

౪ మాతరం...గోత్రాం...దాం స్వధానమస్తర్పయామి 3
౫ పితామహీం...గోత్రాం...దాం స్వధానమస్తర్పయామి 3.

౬ ప్రపితామహీం...గోత్రాం దాం స్వధానమస్తర్పయామి 3.
౭ సాపత్నిమాతరం...గోత్రాం దాం స్వధానమస్తర్పయామి 3.

మాతామహాదితర్పణమ్

౮ మాతామహం...గోత్రం శర్మాణం. స్వధానమస్తర్పయామి 3.
౯ మాతుః.పితామహం.గోత్రం...శర్మాణంస్వధానమస్తర్పయామి 3.
౧౦ మాతుఃప్రపితామహంగోత్రంశర్మాణంస్వధానమస్తర్పయామి 3.

మాతామహ్యాదితర్పణమ్:--

౧౧ మాతామహీం......గోత్రాం...దాంస్వధానమస్తర్పయామి 3
౧౨ మాతుఃప్రపితామహీం..గోత్రాం.దాం..స్వధానమస్తర్పయామి 3
౧౩ మాతుఃప్రపితామహీం..గోత్రాందాం స్వధానమస్తర్పయామి 3

అనన్తరంకారుణ్యతర్పణంకుర్యాత్.

౧ ఆత్మపత్నీం...గోత్రాం...దాంస్వధానమస్తర్పయామి. 3
౨ సుతం...గోత్రం...శర్మాణంస్వధానమస్తర్పయామి. 3
3 భ్రాతరం...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3
౪ పితృవ్యం ...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3
౫ మాతులం...గోత్రం..శర్మాణంసపత్నీకంస్వధానమస్తర్పయామి 3
౬ దుహితరం...గోత్రాం...దాం......స్వధానమస్తర్పయామి 3
౭ భగినీం...గోత్రాం..దాం.స్వధానమస్తర్పయామి 3
౮ దౌహిత్రం..గోత్రం...శర్మాణం . స్వధానమస్తర్పయామి 3
౯ భాగినేయకం...గోత్రం...శర్మాణంస్వధానమస్తర్పయామి 3
౧౦ పితృష్వసారం...గోత్రాం...దాం స్వధానమస్తర్పయామి 3
౧౧ మాతృష్వసారం...గోత్రాం...దాం స్వధానమస్తర్పయామి 3
౧౨ జామాతరం...గోత్రం...శర్మాణంస్వధానమస్తర్పయామి 3
౧౩ భావుకం...గోత్రం శర్మాణం స్వధానమస్తర్పయామి 3.
౧౪ స్నుషాం...గోత్రాం దాం స్వధానమస్తర్పయామి 3.
౧౫ శ్వశురం...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3.
౧౬ స్యాలకం...గోత్రం...శర్మాణం స్వధానమస్తర్పయామి 3.
౧౭ స్వామినం తర్పయామి 3.

౧౮ గురుం భారద్వాజసగోత్రం లక్ష్మీనారాయణావి
ర్యాజి శర్మాణం తర్పయామి
౧౯ రిక్థినం...తర్పయామి
శ్లో. యేకేచాస్మత్కులేజాతా అపుత్రా గోత్రిణో మృతాః
తేగృహ్ణంతుమయాదత్తం సూత్రనిష్పీడనోదకమ్.

ఇతిపితృతర్పణం.



# స్వధర్మప్రకాశిని.

మతవిషయిక మాసపత్రిక.

ఈ పత్రిక సుమారు ౫ సంవత్సరములనుంచి ప్రకటింపబడు చున్నది. చందా. సంవత్సరమునకు పోస్టేజితో రు. ౨-౦-౦

ముద్రణమునందున్న గ్రంథములు.

౧. **వేదపరిచయము.** (వచనము)

౨. **సూక్తకదంబము.** సతాత్పర్యము.

వలయువారు.

మానేజరు స్వధర్మ ప్రకాశిని.

గుంటూరు.

అని వ్రాసేది

ఈ గ్రంధము వలయువారు ఈ క్రింది ప్రదేశములలో దేనికైనను వ్రాసి తెప్పించుకొనవచ్చును.

౧. మానేజరు స్వధర్మ ప్రకాశిని. గుంటూరు

౨. సంస్కృతపాఠశాల, త్రిపురమల్లు గురునాథం, దొడ్డా వెంకటరత్నం గార్ల స్వతము. గుంటూరు.

3. యమ్. శ్రీనివాసరావు గారు. హూడ్సుమేస్టరు గుంటూరు.

౪. R. V. N. శర్మగారు రాజమండ్రి.

అనిర్వాసేది.